THE

# THARAKAPACHAYAM,

EDITED AND PUBLISHED.

BY

**IVATURI SURYAPRAKASA KAVI**

KOTHAPETA,

*NAGARAM TALUK,*

*Godavari District*

AMALAPUR

PRINTED BY *PERI VENKATESAM,*

PROPRIETOR

AT THE SAVANT PRESS.

PRICE 2 Rs

FIRST EDITION 2000



1911

శ్రీరస్తు.

# తారకాపచయము.

అనునీప్రబంధము

తణుకుతాలూకాలోని

క్రొత్తపల్లెగ్రహారనివాసియు,

ప్రకృతమందు

రాజవోలు తాలూకా

కొత్తపేటవాస్తవ్యుడునగు

ఇవటూరి సూర్యప్రకాశకవిచే

రచింపబడె

అమలాపురము

పేరి వేంకటేశముగారి

స్వకీయ శ్రీశార్వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రకటింపబడెను.

మొదటికూర్పు. 2000

1910

దీని వెల. రు 2-0-0

# ఆంధ్రమహాజనులకొకవిజ్ఞప్తి.

—:0:—

విద్వదాంధ్రజనులారా! సప్తసంతతులలో క్షితిని క్షతిలేనిది కృతియయని కృతులనికృతులు పెద్దనాదిమహాకవులు రచించిన మనుచరిత్రమున్నగు కావ్యములను శ్లాఘించుచుండుటవిని తగుమను తగననువిచారముదవ్వునుంచి చాపలప్రచోదితుడనై యెల్లుభట్టుపల్లకీయెక్కఁటచూచి సర్వ్వభట్టు చెరువుగట్టెక్కెఁనన్నట్లు నేను మూడేండ్లకు ముందీకావ్యరచనకుదొరకొంటిని. దొరకొని ఎట్టెట్లో ఇందలిప్రథమభాగమెనిమిదాశ్వాసములు సంవత్సరముకుపూర్వమే ముగించినానుగాని నేను గ్రాసవాసోదైన్యముమట్టుకులేని సామాన్యగృహస్థుడనగుటచే నేతద్గ్రంథముద్రణమునకువలయు ద్రవ్యమును స్వంతముగా వెచ్చించుటకు చాలికలేకపోవుటచేతను నేనీకృత్యాదిలోని (అనయంబు పరమేశ్వరునిదకఁ) అనుసీసపద్యములోచెప్పినట్లితరులను ధనదానాద్యుపకారమును కోరని యప్రతిగ్రహవ్రతినగుటచేతను ఋణమో ఫణమో చేసియైనను స్వంతపుద్రవ్యముతోనే ముద్రింపంతునేని ముద్రణాదికమునకైన వ్యయమయినను తిరిగిచేరునో లేదోయను భీతిచేతను నింతవరకుచు దీనినచ్చొత్తింపజాలకుండియు నెట్టెటో శ్రమచేసి వ్రాసిన యీపొత్తమును వెల్లడింపకెంతకాలమిట్లుమూలబడవైచియుంతునని విసుగుపుట్టి తుదకు తెగువచేసి స్వంతపువ్యయముతోనే ప్రథమభాగమెనిమిదాశ్వాసములును, నీదరిమిలానువ్రాసిన ఉత్తరభాగములోని నాల్గాశ్వాసములును నచ్చొత్తించినాడను. ఛందోవ్యాకరణాదివిషయములలో పూర్వకవులుశాసించినమార్గమునే యనుసరించినాడగాని ల డ ల ర మొదలైనవానికి విశ్రమప్రాసమైత్రిని నేనె

చ్చటను వాడియుండలేదు. ఉత్పలమాల చంపకమాల శార్దూల మత్తేభ విక్రీడితాదివృత్తములలో పూర్వకవిమతవిరుద్ధముగా నెక్కడను పాదపం చకములుంచియుండలేదు. లఘ్వలఘు రేఫలకు ప్రాసమైత్రిగాని, విశ్రమ మైత్రిగాని క్వచిత్ గానైనను వాడుక చేయలేదు. పవర్గునకును, వకా రమునకును విశ్రమమైత్రి క్వాచిత్కముగా వాడవచ్చునుగాని స్వేచ్ఛ గా ప్రాయికముగా వాడగూడదు. కనుకనే భారతము పదునెనిమిదిపర్వ ములలో (పరతేంద్రియవృత్తినున్నవానిశమీకుఁ) (వ్రతయొకబావిమేలు మరిబావులునూరిటికంటె) ఇత్యాదులగు మూడునాలుగుస్థలములలోమా త్రమే పవర్గునకును వకారమునకును విశ్రమమైత్రివాడబడినదిగాని పదు నెనిమిదిపర్వములకును పదునెనిమిదిపద్యములైనను అట్టివిదొరకవు. కొం చెముగనో తరచుగనో ప్రామాణికకవులుపయోగించిరికదా మనమేలతరు చుగామాత్రముపయోగింపగూడదందుమేని భారతమాదిపర్వములో "కా దనక అనిదకారప్రాసతోపద్యమారంభించి రెండవపాదములో బోధనల ని ధకారము ప్రాసస్థానమునందుంచినాడు" ఇట్లని మనము దధలకు స్వే చ్ఛగా మైత్రివాడవచ్చునా? వలనుపడదు. అశ్లేతప్పనిసరియైనచోటనేతప్ప స్వేచ్ఛందముగా వకారపవర్గములకు విశ్రమమైత్రి వాడకూడదని నాయ భిప్రాయమగుటచే తప్పనిసరియై మూడునాలుగుచోట్లమాత్రము పబలకు వకారముతో విశ్రమమైత్రివాడినాను. ఇప్పటికి పూర్తిచేసిన పంద్రెం డాశ్వాసములను నీవిధముగానే చకితచకితముగా వ్రాసినాను.

సీ॥ గుదికాళ్లు మొదలుగా గుంతలంబులదాఁక నిడుదవెన్నుపిసాళి తొడవులొప్పఁ। గరికృత్తిబెబ్బులి కడవసంబును నుత్తరీయాంతరీయం బులై యెసంగఁ। దోరంపుబుఱియల పేరులురమ్మునఁ దోమాలియలు వోలెఁ మెఱుఁగళింప। మడికానుగుబ్బలివడువునఁ బొడవైన యాలపోతె

కిరింతయైతలిగ్ప। నెవ్వఁడో కాని యతఁడు మున్నెపుడు నేను। చూడనట్టి మహాపురుషుండు రేయి। నిమరబోవుతఱినివచ్చి యెదుటనిలిచి। కేల నాజత్రువునుదాఁకి మేలుకనిపె॥ అని నేనును పూర్వకవులలో గొందరివలె భగవంతుఁడు స్వప్నములో సాక్షాత్కరించినట్లు మొదట వ్రాసినాడనుగాని తరువాత నట్టియసత్యముంచుటకు మనసొప్పక యాభాగమునుతీసివేసినాను. ముద్రాపితమైన యీపుస్తకమునకు రు ౧-౦-౦ లుమాత్రమే మూల్యమేర్పరుపబడినది. ప్రతిఫలములేకుండ నెట్టియాదాఢ్యవంతులును వేయినూటపదారులిచ్చినను గయికొనననియప్రతిగ్రహవ్రతమునుపూనిన నన్ను ఈమాత్రపువెలయిచ్చి యొక్కొకపుస్తకమును తీసుకొనుటకు వెనుకదీసి నిరుత్సాహపరుపక యాంధ్రదేశీయమహాపురుషులు సాదృతిస్వీకృతైకైకపుస్తకక్రయధనదానరూపముగా నన్నాదరించుటకు మరిమరిప్రార్థించుచున్నాడను.

ఇట్లువిద్వద్విధేయుఁడు,
ఇవటూరి సూర్యప్రకాశకవి.

———:0:———

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

శా॥ శ్రీపర్ణప్రభువుండు శ్రీరమణుఁడున్ శ్రీకంఠుఁడున్ సర్గర।
క్షాపింజాత్మని యోగనిర్వహణముల్ హైమోద్భవలన్ నిల్పి వి।
జ్ఞాపింపన్ వినిమీఁదికర్జములనాజ్ఞాపించి సర్వాత్మక।
త్వోపేతుండయి చూచుచుండెడు పరంజ్యోతిన్ భజింతున్ శివున్॥

మ॥ తలపై వెన్నికవెట్ట వీల్పడని శుద్ధస్వర్ణదీనారముల్।
గలవిత్తేశుఁడవయ్యు మేనఁ దోడవుల్గాఁ దాల్తుతోల్బూదియ।
స్థులునున్ గావున మున్నెలుబ్బకుఁడవంచున్ మేలముల్ వల్కఁగు।
బ్బలిరాచూలిని జూచినవ్వు కుహనావ్యాధుండు మమ్మోముతన్॥

సీ॥ ప్రణతలై భజియించు భారతీప్రభృతులఁ గ్రేగంటఁగనియాదరించుప్రభ్వి।
వినయంబుమై బ్రహ్మవిష్ణ్వాదులొనరించు నవ్యాజనుతులకు నలరుదేవి।
హరిహయాద్యవిజేయులగు రక్తబీజాది ఘోరదైత్యులమన్నిగొన్నదిట్ట।
సోమార్ధకోటీరు వామార్ధదేహంబు కూరిమిమీఱఁ గైకొన్న ప్రోడ।
పాతసంత్రస్త దేవతాజాతలోక।
మాతహతదుర్నిశాచర వ్రాతశైల।
జాతదృఢహార్దయునుఁ గృపోపేతయునగుఁ।
గాతనాయందు నాచేయు జోతలుగొని॥

మ॥ తనవక్షంబునఁ బొల్చుకౌస్తుభమణిన్ దర్శించుచున్ జంద్రమా।
మనసోజాతయటంచుఁ బల్కఁగదయామ్నాయంబుగానన్ విరో।
చనుఁడొక్కొయిదియంచు నొండొరులతోఁ జర్చించునాత్మాగత।
ర్షినికాయంబులఁజూచి నవ్వుకొను లక్ష్మీనాథునర్చించెదన్॥

ఉ॥ కంటినినిమ్ము నొకరునిఁ జగంబులలోపల నెప్పునబ్బమొ।
కంటికి నాల్గుమోసములుగా మితిదప్పక యుండన త్తవా।
రింటనె కాఁపురమ్ము వసియించు మహాత్మునటంచుఁ బకిరా।
ల్దంటను మేలమాడుకమలన్ విశాలంబగు బత్తిఁ గొల్చెదన్॥

మ॥ స్తుతమూర్తిత్రితయంబునందొకఁ డనైశ్శోభిల్లు నాకేలపూ।
జ్యత లేదయ్యెఁ జగంబులన్నిటనటంచత్యంతచింతానమా।
న్వితచిత్తుండయి శక్తిమైఁదనకుఁ దానేపూజ్యుఁడైనాడనన్।
సుతయాపల్కుచెలిన్ వరించిన విరించున్ గొల్తునిష్టాప్తికిన్॥

మ॥ తనకున్ గానమురోరుహంబగుటచేతన్ దద్రసంబెల్లనం।
దెనయన్ జొన్పుచు నున్నదోయని జనంబెంచన్ బ్రపీనోన్నత।
స్తనమందొప్పుగఁజేర్చి కచ్ఛపిని చేతంబూని త్రైలోక్యమో।
హనని క్వాణ మొనర్చు శారద నెడన్ ధ్యానింతు వాక్ప్రౌఢికిన్॥

ఉ॥ శీతమయూఖశేఖరుని శీర్షము నెక్కి శిశుత్వఖేలలన్।
ద్యోతటినీజలంబుఁ దనతుండమునిండఁగఁ బీల్చిదిగ్గరుల్।
చేతులు మోడ్చి మ్రొక్కఁగరశీకరముల్ పయిఁజల్లినవ్వువై।
మాతురుఁ గొల్తు నుత్కృతిసమాప్తి వివర్జితవిఘ్నమాటకున్॥

సీ॥ కలితవిశ్వేశ్వరాగముఁడైనవిశ్వేశ్వరారాధ్యచంద్రుఁడేయనఘుతాత।
సంజ్ఞాతలింగాంగసామరస్యుండైన పేరనారాధ్యుఁడే ధీరుతండ్రి।
ప్రాజ్ఞులు సాంబనారాధ్య విశ్వేశ్వరమల్లనారాధ్యులేమాన్యసహజు।

లేమహోత్కుఁడు సర్వతోముఖ పాండితీప్రౌఢిచేసభలఁగౌరవమువడసె।
నమ్మహాబోధుశబ్దశాస్త్రపారీణ।
గూఢపాన్థు నివటూరి కులజలధిని।
శీధినీనాథునిర్జితక్రోధు సోమ।
నాథుమద్గురుఁదలఁతు మానసమునందు॥

సీ॥ లేక లేకేనుకల్గితిఁగాన నామీఁదనసువులకంటెను నరితిప్రాని।
బడికిఁబంపిననొజ్జ బాఁదునడ్డప్పని యోనమాల్ సైతము తానచెప్పి।
క్రిందవ్రాశిననామవ్రేల్నొచ్చుననియక్కరములుబల్పముమీఁదవ్రాయ
యోపికతీరికయునుఁగల్గినపుడెల్లచదివించికొంతకోవిమునిఁజేసి। [నేర్పి
మత్పురాకృతపాపకర్మమునఁ బాల్య।
మున నె యూర్ధ్వగతికిఁజన్నజనకునిపద।
ములు స్మరించెద నాయన తలఁపువలన।
లోచనాశ్రువులు రలికాలువలు నాఱ॥
గీ॥ పుడమి జగమున వేడుకపడి వయాళి।
తిరుగవచ్చిన పొత్తువు తెఱవ కేజ।
గద్వదితునాలక ప్రథమోపకార్యయయ్యె।
నాకవివరేణ్యుఁదలఁతు వల్మీకభవుని॥

ఉ॥ వేదములన్ స్ఫుటంబులుగ వీక్షమతిన్ విభజించి యెవ్వఁడ।
ష్టాదశ సత్పురాణములు సంస్కృతభాషరచించెనట్టియం।
హోబాదళనక్షమప్రయతసూక్తిపరాయణుఁ బాదరాయణున్।
మోదమునన్ నుతింతుఁ జలముజ్జ్నిభమూర్తి విలాసువ్యాసునిన్॥

ఉ॥ కోహమటంచు నేకవికులాగ్రణి తన్నడుగన్ గపాలభృ।
ద్దేహిని సర్వథీమదవగీర్ణచరిత్రనసంశయ స్త్వమే।
వాహమటంచుఁ బల్కెనో మహామహునాతని సన్నుతింతుసో।
త్సాహసమర్చిత త్రిదశశైల శరాసునిఁ గాళిదాసునిన్॥

కాంతవృత్తము॥ మాఘున్ భవభూతిని మాఘ్యగదో।
శ్లాఘాత్మునిఁ భారవిలాలితధీ।
ద్రాఘిష్ఠుమురారినిఁ దండికవిన్।
శ్లాఘించెన సంస్కృతసత్కవులన్॥

ఉ॥ వాగనుశాసనుండనఁగ వాసికినెక్కిన నన్నపార్యుఁడున్।
ధీగురుఁడెఱ్ఱప్రెగ్గడయుఁ దిక్కనసూరన పెద్దనార్యుఁడున్।
భాగవతాగ్రగణ్యుఁడగు బమ్మెరపోతనసోముఁడున్ మొదల్।
గాగల తొంటియాంధ్రకృతికర్తలకాదృతిఁ గేలుమోడ్చెదన్॥

చ॥ కవికులసార్వభౌముఁ డనఁగాఁ బ్రథఁగాంచినబట్టుమూర్తికే।
నవనిసురుండ నన్న మరహంతఁ బొకారిచి యమ్మహామహుం।
డు వృషలవంశజుండనియునున్ మదిఁగొంకకబత్తిమోడ్పుకే।
ల్గవయొనరింపనేయతఁడు గాన్పడునంతటి బాగెమబ్బినన్॥

ఉ॥ తోలెపు శేపులోఁ బహుకృతుల్ సరసస్తుతరీతిఁ జెప్పఁగా।
జాలినయట్టిపూర్వకవిచంద్రులపాదనఖాంకురమ్ములన్।
బోలనివాఁడనయ్యునహిభూషణపుణ్యకథాసుధారస।
క్షాళిత సర్వపంకుఁడను కావునకీకృతిఁ జెప్పఁబూనితిన్॥

ఉ॥ కాయలు పండ్లనున్న సహకారములొల్లక వేఁపపండ్లకై।
పోయెడు చాడ్పునన్ సరసముల్ విషయంబులు కోరిచూడఁబో।
కేయెడనైనఁ దోషములె వేసియునుండ వెయంచు నారయన్।
గాయువుపూనుకాకవులు కాకవులేకద యెంచిచూడఁగన్॥

వ॥ అనియిష్టదేవతావందనంబునుఁ గురుచరణస్మరణంబును సుకవిజనాభివాదంబునుఁ గుకవిజనావహేళనంబునుంగావించి యెద్దియేనొకమహాకావ్యంబు రచింపనభిలషించి పెద్దచింతించి॥

గీ॥ జగములందు సూర్యప్రకాశమ్ము తార।
కాపచయకర్త యగుట ప్రఖ్యాతమెయని।

జనులుతలఁప సూర్యప్రకాశమును నేను।
తారకాపచయమొనర్పఁ దలఁచి కడఁగి॥

సీ॥ అనయంబుఁబరమేశ్వరునిఁదక్క రాతేని నేని యన్యునినాశ్రయింపమి [యును।
సామ్రాజ్యపదవియొసఁగునన్న నొరుచేతిక్రిందఁజేజాపఁగాంక్షింపమి [యును।
గలయంతవట్టురిక్థము మామకీనంబు సద్వినియోగంబుసల్పుటయును।
గోటిలాభంబు చేకుఱునన్న నిశ్వరాగ్రహహేతువృత్తు లఁగడఁగమి [యును।
నామనోనిశ్చితములుగానఁ మనుజున।
కెంతవిడుపరి కథకర్థికేనిఁదీనిఁ।
గృతియొసంగుట కెద నిచ్చగింప కీశ్వ।
రునకుఁ గృతియిచ్చుటకు మనంబునఁ దలంచి॥

సీ॥ క్షితిమేకవార్థియైనతఱి నేఁపోలుభైరవునిశూలమున నగ్రముననిలుచు।
మువ్వారునరులేవురమ్ము నికరఁపుఁ బత్తిఁదలఁచినఁ గలుషముల్తొలఁగి [పోవు
మరణించునపుడే నగరిమ్ముప్రాణులకుఁ దారకమును శ్రోత్రరంధ్రముల [నొడువు।
నేపీటమేవీడు జీవులకపునరావృత్తియాముక్తిసంపత్తిపొసఁగు।
నట్టివారాణసీక్షేత్రమందుఁ బ్రణమ।
దనుజఘ్నృక్షుఁడై నెలకొన్నయట్టివిశ్వ।
నాథుని మదీయ సుకృతికి నాథుఁజేసి।
నేను సుకృతినాటకు మదినిశ్చయించి॥

షష్ఠ్యంతములు. } క॥ స్థాణునకు నిందిరాధవ।
బాణునకుఁ బ్రపన్నదురితపటలాబ్దజగ।
త్త్రాణునకునుక్షపతికం।
ఖాణునకు నమర్త్యదత్తకళ్యాణునకుఁ॥

క॥ శర్వునకుఁ నమదఖిలసు।
పర్వునకుఁ క్షుపితపద్మపలలాశనదో।
ర్గర్వునకుఁ మహిమభరా।
ఖర్వునకుఁ నిగమరథ్యగంధర్వునకుఁ।

క॥ భీమునకు భసితసాత్కృత।
కామునకు మహర్షివినుత కళ్యాణగుణ।
స్తోమునకుఁ బతితపావన।
నామునకు మృగాదనాజినక్షౌమునకుఁ॥

క॥ ఈశునకు వతంసితతా।
రేశునకుఁ బదానతామరేశునకువియ।
త్కేశునకుఁ బదనిహతకీ।
నాశునకానంద కాననని వేశునకుఁ॥

వ॥ సభక్తిసమర్పితంబుగా నాయొనర్పంబూనిన తారకాపచయం
బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన॥

ఉ॥ పుణ్యమునిప్రవేకులు ప్రభూతతమశ్రుతిమంత్రతహూతిన్నై।
పుణ్యము వెంపనబ్బురము ప్రోలకుఁబిల్చి హవిష్యమీనశీ।
ర్షణ్యము వంగిగైకొని సురల్ తమిసాపడనొప్పనైమిశా।
రణ్యమునామృగోత్తమ శరణ్యమొకానొకకానయొప్పెదుఁ॥

గీ॥ క్రాలుఁ గాలవశాండిల్య కాశికాము।
లైనఘునతరుల్ కల్గియకాననంబు।
క్రాలుఁగాలవశాండిల్యకాశికాదు।
లైనఘునతరుల్ కలిగి యకాననంబు॥

తరల॥ అమలినాత్ములు శౌనకాది మహామునుల్ తమచేయుస।
త్రమను పేరిటి యధ్వరంబు యథావిధిఁ నెఱవేర్చివ్వ।

ద్ధమునిముఖ్యులతో నభీష్టకథావినోదమొనర్చునా ।
సమయమునం దరుదెంచె సూతుఁడు సంయమీంద్రదిదృక్షుఁడై ॥

క॥ వచ్చినయాయుగ్రశ్రవసున ।
కెచ్చుగు కౌతూహలమున నెదురుగఁ జనితో ।
డ్తెచ్చి పవిత్రమయినవిచి ।
త్రోచ్చాసనమొకటి చూపి యుపవేశింపన్ ॥

క॥ శౌనకుఁడు మున్నయినయా ।
వానప్రస్థవరులార్జవమున నతనిస్మే ।
రాననముఁ జూచు చాతని ।
తోనిట్టులనిరి వినీతిధుర్యోక్తులతోన్ ॥

సీ॥ ఎవనిముత్తాత వేఁడి వెలుంగుకోలపుఁబోమిన్నడికపుతాల్పులమేటియొజ్జ
యెతని నెయ్యంపుఁదండ్రి తుదియుగంపు మేల్పాడి పౌత్రంపుఁగూర్పరులమిన్న ।
యేబాసవాల్పొట్ట ప్రాఁబలుకుఁగమి మొదల్వడై పొమ్ముదలిర్చువెడఁదపెట్టై ।
యెవ్వానికొమరుండు పువ్వులకోరివిలుకాని నోర్చినమగమానికంబొ ।
సత్యవతి పెద్దబము పంటజమునయేటి ।
రేఁగుదీవిఁ జనించిన జోగిరాయఁ ।
డై దవమినుకుఁగూర్పరినీము నెనరు ।
టొజ్జ యాతండు లెస్సనైయె యున్నవాఁడె ॥

క॥ మొగములతిగయగపడకుం ।
డఁగఁబుడమికిఁదిగిన పలుకునవలాయొడయం ।
డగుతబిసిచేఁజమువులె ।
ల్లఁగఁజదిన వలంతి వీవలంతివె తలఁపన్ ॥

క॥ తూలమునలఝంఝావా।
తూలమువలె శ్రోతృజనులమఘమునాది।
వ్యాలపనాయితనీది।
వ్యాలపనాయిత మృదూక్తులపయాపించున్॥

ఉ॥ చెప్పితి క్రౌంచదారణునిచే మును తారకశూరపద్ములన్।
గొప్పనిశాటులచ్యుతునకున్ గలినోరువరాకయాతనిన్।
రొప్పినమేటిబల్లిమలు త్రుంగుట వారలకట్టిగారవం।
బెప్పగిదిన్ బొసంగెవచియింపవె తజ్జననాది వృత్తముల్॥

ఉత్సాహ॥ స్కందుఁడొక్కరుండె కృత్తికలకు నార్వురకుఁగుభృ।
న్నందనామహేశులకుఁ ధనంజయునకుఁ గంగకె।
ట్లిందటికిఁ దనూజుఁడయ్యె నేర్పడన్ వచించిమా।
సందియములు దీర్పుమయ్య సరగ రోమహర్షణీ॥

శా॥ చిత్రంబుల్ కదుశ్రోతృముక్తివనజాక్షీప్రాంచితోద్వాహవా।
చిత్రంబుల్ గ్రహయాళుదుష్కృతలసత్తిగ్మాతపా పేలవ।
ఛత్రంబుల్ జగదేకనాథుఁడగు నాచంద్రార్కకోటీరుచా।
రిత్రంబుల్ వినుచుంటకున్ దనివి మాహృద్వీధిలేదెన్నఁడున్॥

మ॥ వనజాతాసనకేశవప్రముఖ దేవవ్రాతనుత్యాదరం।
బున నాలించుశశాంకమౌళిచరితంబుల్ బ్రహ్మహత్యాదిపం।
కనితాంతప్రసితాత్ముఁడొక్కఁడుడకన్ వేఱొకండెవ్వఁడున్।
వినహేయంపడు నయ్యయో వసుమతీవిఖ్యాతపౌరాణికా॥

క॥ అనినవిను రోమహర్షణ।
తనుజాతుఁడు ద్విజులకెల్లె తనవినుచుటయెం।
చినఁదలక్రిందనిచూపెడు।
ననువునఁ దనుజాతరోమహర్షణుఁడయ్యెన్॥

చ॥ సిరివిరిబోఁడి నేలు జగజెట్టికి నైననుఁబెట్టిదంపు మో।
హరమున నోహటింపని విభూతులఁగొట్టిన యట్టి మేటిసో।
టరికత చెప్పఁబూనుట కోడల్ నిడువెండ్రుక వెట్టఁబాసవా।
ల్దారలకు మోడ్పుకేలుగవతో నెఱియొప్పఁగ సూతుఁడిట్లనున్॥

సీ॥ వితతస్ఫుటాపంక్తిశతమా ప్రథమపృదాకువు చెంతనలగర్దమూర్ధనంబు।
తపలలాటంతపాతపచండిమప్రభాకిరుపజ్జజ్యోతిరింగణవిలసన।
మున్మాల్యమానసారోర్వీజమగుమహావాయువు చెంగటివ్యజనపవన।
మతిమాత్రవిన్నతోయంబౌనుదధిమ్రోలఁగుల్య దఘ్నోదయాకుల్య
నెట్టివట్టిదవేదాగమేతిహాస। [పెంపు।
ఘనస్మరమనీషులరు మీనికటమునందుఁ।
బరిచితస్తోకపంచషాత్తురుఁడ నేను।
తగుదునను కొని చెప్పంగడఁగుటయరయ॥

ఉ॥ కూరిమిఁబెంచి రాచిలుకకున్ బలుపల్కులు నేర్పి వెండియ।
కీరము నోటనుండి పలికించి వినోదముఁ జెందు వాగ్మిల।
ట్లీరఖిలేతిహాసవిమలీ యనభిజ్ఞుఁడు చెప్పఁగా వినం।
గోరుట వీనిపైఁగలయ కూటఁపుటర్మిలి గాదె యారయన్॥

క॥ మానివరులార వేల్పుల।
కైనన్ జవదాఁటరాని ప్రాంచితమగుమీ।
యానతి యతిక్రమింతునె।
నానేరిచినట్టి తెలుఁగునన్ వినిపింతున్॥

వ॥ అనిపలికి పలగొని యామస్కరులకు నమస్కరించి పారికాంక్షివర్యుండగు పారాశర్యుని మనోంబుజంబునన్ దలంచి యనేకావ్యాజభక్తికప్రణామంబులొనర్చి యశేషపురాణకథాకథననిష్ణాతుండగు సూతుండిట్లని చెప్పందొడంగె॥

మ॥ మును త్రేతాదిని దైవతౌఘమునకున్ బూర్వాదితేయోత్కరం
బునకున్ భూతభయానకంబయిన సంస్ఫోటంబుగానందశ
త్రునితాంతార్దితులైన నిర్జరులకున్ దోర్దైహృషీకేశుఁడ
ద్దనుజానీకమునోర్చె శార్ఙ్గధనురుద్యద్బాణఘాతంబులన్ ॥

గీ॥ చక్రికాశుగగిళనంబు సాజమగుట
మ్రింగుచున్నాఁడోయంచు వైరిధ్వజినులు
తెల్లవోయిచూచుచునుండఁ దితిజులేయు
నంపగములెల్ల మాయించు నచ్యుతుండు ॥

మ॥ తమయస్త్రావళులట్లు వమ్మగుటయున్ దైత్యారియస్త్రింబులం
గములంగాఁడి ప్రభూతమానలజడిన్ గావింపనుద్విగ్నులై
యమరద్వేషులలోడిపాఱరని శేయన్ లేక బృందారకేం
ద్రముఖుల్ శాత్రవులందఱున్ బ్రమదమందన్ గాండశీకాదితిన్ ॥

సీ॥ ఆదిత్యతేజో మహాప్తికోప్పక తమలాగున్నయడవులఁ డాఁగిడాఁగి
తమమనంబులువోలెఁ దతతమోవృతములై యొప్పుగవులలోన నుం [డియుండి
తమకథోగతియెతథ్యంబంచుఁ దెల్పుపగిది రసాతలమునొదిగియొదిగి
తమయత్నైకలితభంగముగదా కడుపులోనిశుకోదెయని వార్ధినడఁగి [యడఁగి
తమయనాథత్వమునకు ఖేదముపడిపడి
వైరనిర్యాతనమునకవంధ్యమగును
పాయమొకఁటి నిర్ణయింపందలంచి
రాత్రిచరులెల్లఁజనిరి భార్గవునికడకు ॥

క॥ చరణానతులగుచునదీ
చరణార్థితులైన రాత్రిచరులజగవభృ
చ్చరణారవిందమసప
చ్చరణాయితహృమనకనిరిజననగురునకున్ ॥

ఉ॥ నవ్వుహితుండవు నస్మదధునాతనదుష్పరిభూతివిన్నచో ।
జివ్వలలోనము న్నెపుడుఁ జెందనిబన్నమునొంది యిట్లుగా ।
నెవ్వఁగఁగుందుచుండుటకు నీకిటులొప్పరికించెదేని మే ।
మెవ్వరివారమై మనుదు మెవ్వరుదిక్కు మాకుఁ భార్గవా ॥ [గూర్చి ।
సీ॥ అలప్రసూనాహ్వయునాశ్రమంబునఁ ద్రుంచి ద్రుమముని సమూలబలముగ
వృత్రసంజ్ఞునిఁ గుహావితతికిఁ బోఁదోలి పంచాస్యుఁగానల పాలొనర్చి ।
పాకునినాహవప్రౌఢుఁడంచు హసించి మతికర్దమాహ్వయు మన్న
[జేసి ।
ఘోరాభిధానునిఁ గడిమి నీఱొనరించి యంధకునిన్ వికలాంగుఁ జేసి ।
తక్కుఁగలరక్కసుల నెల్లనుక్కడంచి ।
మముఁబరిభవాబ్ధిఁ ద్రోచిరి మఘవముఖ్యు ।
లైన సురలచ్యుతుండు తోడైనకతన ।
నేమి జెప్పఁగ మయ్య మాహీనదశను ॥

క॥ నొచ్చితిమి కదనమున నర ।
సచ్చితిమరులన్ జయింపఁజాలకయిటకున్ ।
వచ్చితిమి త్వద్దిదృక్షన్ ।
జొచ్చితిమి మిముశరణము విశుద్ధచరిత్రా ॥

శా॥ పాలన్ముంచిన నీటముంచినను నీభారంబు పెంపేదినీ ।
పాలంజేరితి మోశుక్రప్రముఖశుంభద్దివ్యవిద్యాకలా ।
పాలంకారరసజ్ఞమాయెడదు కుయ్యాలించి విష్ణ్వాదిగో ।
పాలస్తోమజయాప్తికై యొకమహోపాయంబు జింతింపుమా ॥

* తరువోజ *

అనియిట్లు దైతేయు లత్యంతదీనతామాత్రగద్గదాస్యులై వేఁడుకొనఁగ ।
ననుకంపమానుఁడై యాశరాచార్యుఁడాంతరదృష్టి దీక్షప్రణిధాన ।

సునిమీలితాక్షుఁడై సుప్తమీనమగుచుఁ జెలువొందఁ బ్రహ్లాదంబు చొప్పునఁ
[గొంతఁ।
దనుకనిశ్చలవృత్తిఁ బూనుండి తగనుదర్క మెఱిఁగి యాదైత్యులకనియె॥

ఉ॥ తొల్లి నమాశతంబు నియతుండయి యంచితఘోరనిష్ఠనై ।
నుల్లమునన్ శివుం గొలుచుచుండి తపంబొనరించె నాకస ।
త్తల్లజుఁడా నధోక్షజుఁడు తద్ఘనభక్తికి మెచ్చి యంబికా ।
వల్లభుఁ డిందుమౌళి మునివంద్యుఁడు దాఁ బొడసూపె శార్ఙ్గికిన్ ॥

వ॥ ఇట్లు నాళీకలోచనునకు నళినలోచనుండు లోచనగోచరుండై నారాయణా యనన్యాచరణీయంబగు నీ యనశ్వరతపంబునకు మెచ్చితి నత్యంతవికుర్వాణుండవై యభీష్టంబు లీవచ్చితి శక్తిస్తుండవగుము నఖిలలోకపరిపాలనాధికారంబిచ్చితి నెల్లలోకంబులు నొకట నెత్తివచ్చినను నెట్టిబల్లిదులకుఁ గదనంబున నీ యెదుర నిలువఁ దరంబుగాదు. వేయేల త్రోడరుటగలిగిన నన్నునైన బన్నంబునొందింపఁజాలుదువని నిర్వపిష్యమాణా నేకనైరిచక్రంబగు చక్రంబొసంగి యబ్జభక్తపరాధీనుండు తిరోధానంబునొందె. ఇదియవ్విష్ణుదేవుని మహానుభావబీజంబు ॥

మ॥ కలనన్ మీకననేల నియ్యఖిలలోకవ్రాత మేకంబుగాఁ ।
దలపడ్డన్ ద్రిదశప్రవేశుఁడగునద్దైత్యారిచేఁ జిచ్చునన్ ।
శలభస్తోమము గ్రాగ్గుచాడ్పున వినాశంబందు నయ్యిందిరా ।
లలనాధీశ్వరునాజిరంగమునఁ గెల్వన్ శక్యమే యేరికిన్ ॥

గీ॥ మీకు నెవ్విధమునను సమీకమందు ।
జంగమస్థావరాత్మక సకలజగద ।
ధీశుఁడగు విష్ణుదేవుఁ జయింపరాదు ।
గాని యొకట విశేషంబు గలదు వినుఁడు ॥

సీ॥ గంధర్వపలభుక్సుధాంధోస్సరోహిప్రముఖజాతులకు నెల్ల మూలకంద ।
మజుని చేసన్నీత్యనియుక్తులగు ప్రజాపతులకందఱకును బ్రాథమికుఁడు ।

నిగ్రహానుగ్రహనిష్ణాతమగు సప్తఋషిమండలమునఁ బురోగముండు।
పరమేష్ఠి మానసప్రభువుఁడైన మరీచియను నాదిగృహమేధికాత్మజుండు।
కశ్యపుండనెడు ద్వయాతిగప్రవేకుఁ।
డమునిసామాన్యసాధారణానుభావుఁ।
డుత్తమతపంబు సల్పుచునున్నవాఁడు।
రుచిరవిష్ణుపదీ నదీరోధమందు॥

వ॥ అని చెప్పి యసురేంద్రుండను వానిం జూచి॥

మ॥ సురసారంగవిలోచనానుతతనూశోభన్మదభ్యస్తభా।
సురసాహిత్యరుగీతికాదికకళాసూద్ధానసభ్యంచితా।
సురసామ్రాజ్యరమావతారమనఁగా సొంపారునీయాత్మజన్।
సురసాభిక్ష్యనుఁబంపుమా మునివరేణ్యుండున్నగాంగోర్వికిన్॥

క॥ ఆయనునత్పుంగవునకు।
నాయమకును మువ్వురుదితులగుసురధికతే।
జోయుతమూర్తులునుఁ బ్రభి।
న్నాయుతపృథుబలులునగు మహాశూరవరుల॥

వ॥ ఆమువ్వురిలోన॥

గీ॥ మత్స్యముండు శాత్రవధనుష్మత్స్యముండు।
ప్రోద్యదమలాఘుభయదజనోద్యముండు।
నైరమావాధుఁదొట్టిదాయలఁజయించి।
దివిషదులమీఁది మీకినరఁ దీప్తిమజేయు॥

క॥ అగ్రియుఁ బ్రాజ్యతరతరస।
భుగ్రాజ్యమహాపదాధిపుని జేయుసుమీ।
వ్యగ్రతలుమానిమన్నీపి।
తాగ్రియకృత్యమునకై ప్రయత్నింపుఁడనన్॥

సీ॥ సహజనియగు సమిచ్ఛక్తి చక్రాయుధుచేఁ బ్రసంగుటయు నందుచేఁ [కలిగిన
సాంద్రమఃఖలాశౌచంబుఁగొన్నాళ్ళవట్టియమైత్రలవోవంగనవుడు।
మహితశుక్రోక్త్యఘమర్షణబుకుఁలనానందశింధువునందు లెస్స।
యవగాహన మొనర్చి యతిభక్తినన్వయగురువర్యుచరణతామరసయు
నకు బునఃపునః ప్రణామంబులొనరించి। [గము।
యమ్మహోత్మనొద్దనానతిఁగొని।
స్వస్వధామములకుఁ జనిరసురేంద్రపు।
రస్సురులయినట్టిరాత్రిచరులు॥

ఉ॥ అంతఁదనూజఁబిల్చి యనెనయ్యసురేంద్రుఁడాతల్లిభార్గవీ।
కాంతునిచేనదీఁ గడుఁవికారమునొంది సుగారులెల్లను।
క్ష్మాంతికినై యుపాయమడుగఁ గురుచెంతకుఁజేరి వేఁడగా।
నాంతరదృష్టిఁజూచి యతఁడంతయుఁదెల్పెను భావివృత్తముల్॥

* కవిరాజవిరాజితము *

అలఘుచరిత్రుఁడు విశ్రుతశాంతిదమాదిగుణౌఘవిశిష్టుఁడనా।
విలహృదయుండలకశ్యపుఁడల్ మునిసేలుపుఁ కేటిదరిఁ దబముఁల్।
జలిపెడు నమ్మునిలోకవరేణ్యుని సంగతినీకునయింతురుపు।
త్రులు ఘనతేజులు మువ్వురు శౌర్యనిధుల్ ప్రథనోగ్రులవార్యబలుల్॥

స్వాగతవృత్తం॥ అందుమధ్యముఁడహస్పతితేజం।
డిందిగావరుఁ జయించినికారం।
బొందజేయు సమరోర్వినటంచున్।
గందయొజ్జమునకావ్యుఁడుసెప్పెన్॥

క॥ సత్వరమయత్తపస్యా।
పత్వరతుఁడవలన నాత్మజన్మనమోఘా।

జిత్వరు విష్ణ్వాదిదివిజ।
జిత్వరుఁగనిమాకు హితముసేయుముతల్లి॥

ఉ॥ నాకిజనంబుచే నని మొనర్చ గడుఁబన్నమునొంది మేమతి।
వ్యాకులితావిలాత్మకులమైతిమితల్లిరొ గోరుచుట్టుపై।
రోకఁటిపోటుగాగ హృగరుంతుదమామునిశాపసంభవ।
చ్ఛోకముఁ దెచ్చిపెట్టకుముసుమ్ము సురల్ విని పెద్దనవ్వఁగన్॥

సీ॥ మాయావిమషినౌటమునగురుండొనరించె మాయయంచునభిక్ష్యనుగు [ఏనీకు।
నని పెదఁభావిజ్ఞుఁడగుకవిదిన్నంపుమని పెలుచన్ జెప్పినంమవలన।
నహ్మహితునిహృదయమెఱింగి మెలఁగుమోయహ్మహితుల్ హర్షమం [దఁజనిన।
కార్యముఁ దగనమోఘుతఁదీర్చ మానిలోకార్యముని యనుగ్రహం [బువడసి।
దానవీతతి నేర్పున్నదానవీవ।
నీవతగుదిప్పనికిఁభావినీవతంస।
మాయనుంగుఁదనూజరోమాయ వేగ।
మరిగి భిమరముత్పాదింపు మరిగిరులకు॥

నర్కుటవృత్తం॥ అనవుడు నప్పొలఁతియనెనయ్యోడకంపుటకున్।
మనసెటులొప్పెఁ బుష్పసుకుమారమనోహరసం।
హననలుపొల్తులెకఁడ నమర్త్యణులైనతపో।
ధనులు దృఢాత్ములెకఁడనెదన్ డగనారయుమీ॥

గీ॥ పారధిమణాసురాచార్యజటికుఁఅఁగట।
నలఁతితనమొందదే రంభయంతటిదియు।
నిట్లగుటకనివిపియును దీకుమారి।
యొంతటిదియనిమనమున నెంచవైతి॥

ఉ॥ ప్రేముడిమీఱఁ బెంచినతుభీశిశువున్ బులివాతఁద్రోచిన ।
గ్రామునిసింహముచెంగటికినంపఁ దలంచితినన్ననక్కటా ।
యేమయిపోయెఁ బుత్రిపయినిందనుకన్ గలయన్యరాజక ।
న్యామణిమర్లభంబయిన యబ్రుఁపుఁగారము దానవేశ్వరా ॥

చ॥ అనవినిముగ్ధవాటఁ దనయాయిటులాడితికాని నాకునీ ।
వనఁగనునాదుప్రాణము ననంతరమున్నదటమ్మయమ్మహా ।
త్వనిధికినీకు సంగమముదైవవినిశ్చితమంచుఁదివ్యదృ ।
ష్టి నెఱిఁగిక్రవ్యభుగ్గురుఁడుచెప్పుటచేఁ గదయింతకోప్పితిన్ ॥

ఆ॥ చెప్పవలసియట్లు చెప్పితినేగాని ।
నీకుమానిశాపనిహతిభయము ।
లేమినిక్కమింత లెస్సయెఱింగియు ।
కాదె యిట్టిపనికిఁగడఁగినాఁడ ॥

క॥ దీవనమొసఁగెఁ గపిసురన ।
దీవనవాసియగు నయ్యతివరునివలనన్ ।
నీవనపాయరిపుధ్వజి ।
నీవనపావకునిఁ బాపఁగన్ గనెదనుచున్ ॥

ఉ॥ కొండలమందమచున్ జనుటకూడదుమమ్ము ప్రియాత్మజాననః ।
ఖండశభిన్నవోయనఁగఁగర్బురకన్యలనీవయస్యలన్ ।
గొందఱఁదోడుగొంచరిగి కుందనమూర్త్యులు వీరమాత్రవై ।
పొందుమనూనమైన యశమున్ భృశమున్ గృశముద్వవోదరీ ॥

చ॥ అనిజనకుండువల్కఁదగమోసముమోమునఁజెన్నుమీఱని ।
ట్లనుసురసాభిధానయగునవ్వరవర్ణిని దైత్యవర్యమే ।
మనియెదొ నీవుచూతమనియుంటినిగాని మదీయకౌశలం ।
బునకు నశేషమైన జగమున్ వశమాననశంకయున్నదే ॥

చ॥ అరిగెదనిష్ఠనీమునిలనౌదలఁదాలిచియమ్మహాముని ।
శ్వరుమహిమాఢ్యునిష్టవరివశ్యులనన్వహమున్ భజించెదన్ ।
గురుతరమైనతత్కరుణమున్ దగుపాత్రము నైతి నేనిదు ।
స్థిరవిపదబ్ధిఁగూలిన నిశాచరజాతికి సాకనయ్యెడన్ ॥

క॥ నీవును నాహ్మకాభిను ।
తావాప్తియవశ్యసుగమమగుటకునన్నున్ ।
దీవించి వీడుకోలుపుము ।
నావుతనసురేంద్రుఁడత్తనయకను నెలమిన్ ॥

క॥ ఈప్రూటవలను రేపటి ।
రేపకడఁబ్రయాణమై యరిగెదన్ గశ్యా ।
గాపాదియగు ససంశయ ।
మీపయనమునీకుఁ ధీమతీడితధిషణా ॥

ఆ॥ అనిన వల్లెయని నిజాళులఁదనవలె ।
ధృష్టలైన పూర్వదేవసుతలఁ ।
బయనమునకుశీఘ్రపరపించి యాత్రక ।
య్యావిదయాయితమయియుండెనంత ॥

సీ॥ ప్రాచియన్ సీమాటిపడమరనే స్తకత్తియకుఁబంపిన కెంపుతెలెయనంగ
హదనుసాన్నారిరేయతివసొమ్ములకుఁగాఁగరఁగినయపరంజికరుడనంగ ।
వరుణాత్మజులుక్రుంకుకరువపైనాడివిడ్చినయట్టియొజపుట్టచెండనంగ ।
సాంధ్యరాగము పేరిజ్వలనశైలమువెళ్ళఁగ్రక్కిన యుజ్జనకల్లనంగ ।
దమ్మితీవియబోఁడికి నెమ్మకాఁడు ।
నిద్రఁపుంజీకటికిఁ దీరనిపగవాఁడు ।
తొవలయుల్లాసమాడఁగించు దండగీఁడు ।
పశ్చిమాఁభోధిదరిఁజేరెఁ బవలుతేఁడు ॥

ఆ॥ మఱి నిరీక్షమూర్తి తొవలవెట్టముతన ।
దీప్తిఁ గోలువడెఁ బ్రతీచిఁ జేరి ।
యారయనిమ్నుఁడైన వారుణి నానుచో ।
మందతేజుఁడగుట సంభవించె ॥

ఉ॥ ఆగడమూనిపట్టపగలర్కునిఁ బద్మినితోడఁగూడి సం ।
యోగముసేయుచెల్లరకు నుల్బణమాటయుఁ దన్నుఁ బట్టును ।
ద్యోగమునన్ రయంబునఁ బ్రదోషము వెన్బడినన్ భయంబునన్ ।
డాఁగుటకేగెనో యన నడంగెఁ బ్రభాకరుఁ డంబురాశిలోన్ ॥

చ॥ సవిధపథంబునం జనుత్విషాంపతిఁ గన్గొని పుచ్ఛడీకయా ।
చువరుణపత్నియన్యపురుషుల్ తను నెవ్వరుఁ జూడకుంటకై ।
భవనము మ్రోలనడ్డముగఁ బన్నినదట్టవు చెంద్రకావిగం ।
డవడమొకో యనన్ బడమటన్ బరవంజెను సాంధ్యరాగముల్ ॥

సీ॥ పతివచ్చునని నిశావనిత సజ్జికకట్టవిప్పిన కావిపుట్టమేమొ ।
హరిరథాశ్వక్షుణ్ణచరమాద్ర్యధిత్యకోద్ధూతగైరికధాతుధూళియేమొ ।
ప్రాఙ్ముఖోన్నైనపోవుననింగిఁ బాలుమందేహదేహాసృక్ప్రవాహమేమొ ।
సవితతోఁ దినలక్ష్మి సహగమించుటకుఁ బేర్చి జ్వలింపఁ జేసిన చిత్యయేమొ ।
యనుచు మధ్యమవిష్టపంబున వసించు ।
జనులు తమతమమదికిఁ దోఁచినవితమునఁ ।
బలుతెఱఁగులనుత్ప్రేక్షించిరలవినాంత ।
సమయమునఁ బొల్చు సంజకెంజాయఁ జూచి ॥

చ॥ అసదృశమున్ స్థిరంబునగు నంబరరత్నము నోవుటన్ బిత్రు ।
ప్రసువను నింతివంతగమరన్ విలపించుతఱిన్ దదీయశో ।
కసహయరీణసంవళితకజ్జలరోదనబాష్పమో యనన్ ।
విస్పృమరమయ్యె నెల్లెడల వెగ్గలమై తిమిరమ్ము రోదసిన్ ॥

చ॥ కువలయభూరిశర్మఘటకుండును సత్పథవర్తనుఁడునై ।
నెవ డెవు రాజువచ్చునని నిద్దపుహాళితలిర్పవింగిచం ।
దువకలదిష్టసంఘనుఁడు దొత్తగఁగట్టిన ముత్తియంపుచే ।
రువలనఁబొప్పె ఋక్షనికురుంబములాకసమందు నెల్లెడన్ ॥

సీ॥ మిత్రునిజాడలేమికిఁ బొక్కుచుఁ దలెత్తి నెమకుచుండిన తూర్పు నెలఁత [మొగమొ ।
యొంటునివాని రేకంటుఁదాఁకి జయింప నుడి మొగ్గరము వన్ని నడచు [నిగమొ ।
హెలక్రైశ దివిడ్డఁ డెగుదునై చుఁడుఁ బూర్వగిరిపైఁ బడిన బంతి విరుల చెండొ
సనుయమాంత్రికుఁడు ధ్వాంతము మాప మంత్రవిభూతికై తెచ్చిన బూ
యనుచు వనిలోకమున నున్న జనములెన్న । [దివఁడొ ।
సురలకోగిరమిడు విడుపరుఁ మిన్న ।
కనులవనములపాలిటి గాఁడుగున్న ।
పాడుపుఁగుబ్బలిపైఁ దోఁచెఁ గడలివెన్న ॥

మ॥ ఇలపైఁ బ్రాణులుసద్దడంగుటయు హాయిన్ స్వాంతరంగంబుని ।
ర్మలమై యొప్పుడు లోకతాపసుఁ డెడన్ బ్రహ్మానుసంధానమున్ ।
జలుపన్ గ్రొందెలి నారచీరమొయినిండన్ దాల్చెనో యంచు చంద్ర ।
ష్టలు భావింప నెసఁగె నెల్లెడలఁ జ్యోత్స్నల్ పుచ్చపూచాడ్పునన్ ॥

చ॥ అపుడసురేంద్రుఁ డాత్మజఁ బ్రియం బలరఁ బిలిపించి పానజా ।
లిపులుఁగుపోలెనా సొబగు లేమకుఁ దంగట కేగినిల్వన ।
చ్చపు నెల వెల్గుబైటఁ దనుజాసహితంబుగఁ గూరుచుండి క ।
శ్యపముని చెంతకున్ జయన మైచననున్న కొమార్తె కిట్లనున్ ॥

క॥ ప్రాణమును విడిచి దైవైనన్ ।
మానమె దుఁఖ్యాసెక్షణము సేయుదనేన్ ।

గానన్ మానినిప్రాణస।
మానన్ నినువిడువవలసె మానముపొందెన్॥

గీ॥ ఎపుడులాఁటివిలాతులనెఱుఁగనిపసి।
కూనవగునిన్నుఁ దేశముల్ కానిదేశ।
ములకుఁ బంపించి హాయనంబుల కొలంది।
నిన్నువిడిచియెట్లుందు నేకన్నతల్లి॥

సీ॥ విద్దెకై యాచార్యునొద్దకేగినయప్డు చాలసేపుంటకుఁ జలదరింతుఁ।
జోటికత్తియలతో నాటలకై పోవఁదడవుగాన్పడమికిఁ దల్లడిలుదు।
నోలమునదీశ్వరోపాసనము సేయుచున్నప్డు మసలుటకున క్మలింతు।
నెట్లకైనఁబయనమేగుటకొటస్థంబైన నినుఁబాసిచనుటకు నెగులువడుదు।
మామకతపఃఫలమునీవు మగిడివచ్చి।
కంటఁబడుదాఁక నీప్రతీక్షణమువోయు।
గంబులెటువలెయాపింపఁగలుగువాఁడ।
నకటా యెంతనిర్దయయయ్యె నియతి॥

సీ॥ మఱుకువతఱివాక్ప్రవృత్తినెడలోనిబెంగయెవ్వతెవారపించునింక।
గలకంఠరవముతోఁ గానమెవ్వతెపాడ వీనులవిందుగా విందునింక।
శ్లోకంబులన్వయించుచునర్థములు ముద్దుపలుకులనెవ్వతెతెలుపునింకఁ।
బలువితంబులచేతిపనులచేఁజెలులకువిస్మయంబెవతెగావించునింకఁ।
బంజరంబులోనున్న పచ్చగఱుల।
పులుఁగులకునేర్పునెవ్వతె పలుకులింక।
నీవులేనన్నినాళ్ళును నావసథము।
గహనభూప్రాయమైయుండుఁగదవెతల్లి॥

చ॥ కడిమియు రూపసంపదయుఁ గల్మియుఁగల్గిన యొకరసోఁకుడుం।
బహుమనసునన్ గుణాఢ్యునకుఁబావకసాక్ష్యమునన్ హితుల్ ప్రియుం।

పడతినుఁబట్టి గానొసఁగు భాగ్యముగల్గక గోఁచిపాఁతరా।
యఁడయిన వృద్ధతాపసునకక్కటయీవలసెన్ ద్వితీయఁగాన్॥

చ॥ అనితనమీఁది పాదమున నశ్రువులొల్కఁ దంతండ్రిఁజూచియుం।
పుననను నామెకోడలికిఁ బుద్ధులుచెప్పుచు నత్తఱంకువో।
యెననిన బాష్పముల్ బయనమేఁగుతఱిన్ వెతఁగూడదంచు నా।
కుఁనొడివిన్ నీవె యిప్పగిదిఁ గుందుటయర్హమె తండ్రి బేలవై॥

గీ॥ చక్రవజ్రాదిధారలసంతునఁ దల।
లిఖితయున్నఁగరాసులకీకనన్ను।
శ్రీపతీంద్రాదులంజలిసేయుపాది।
కాంక్షికిచ్చుటనాదు భాగ్యంబకాదె।

క॥ జాతిజయగు నొకనాతియ।
రాతిపరాభూతులయిన రక్కసులఁద్రుప।
న్భాతిదోలంచి మనిచెనను।
ఖ్యాతిఁబడయుకంటె నేమికావలె నార్యా॥

వ॥ ఆంగికస్పందాదులగు ననేకనిమిత్తంబులు భావిశుభోదర్క సంసూచకంబులగుచుఁ గన్పట్టుచున్నయవి యిష్టార్థసిద్ధియగుట యవిదితోక్తంబుకావున నాపోకకై యీవంతయు వంతనొందక సుఖంబుండుము నీకడనున్నట్లె నేపోయివత్తునని మందలించిన నానందపరవశుండై బృందారకసపత్నుండాసుందరీమణితుందంబున ముందలఁజొన్పి బిట్టుకౌఁగిలించుకొని నీయట్టిపట్టిగలనాకిక్కట్టులు ముట్టువడుటయేమి చిట్ట తల్లినీవుపుత్రికారూపంబునం బ్రసన్నవైన నాపాలిటిభాగ్యదేవతవగుటనిక్కువంబని వక్కాణించి మఱియునిట్లనియె॥ [నాకినట్లు।

సీ॥ కడువాఁడియైనట్టి కౌక్షేయకము వాయి నాల్కయంతయుఁ జాఁది
త్యక్తనిర్మోకంబుదారుణంబునునైనకోడెదిల్వను ముద్దుగొనినయట్లు।

కాలుసేతులుగట్టిగాఁగట్టుకొని యేటఁగడలకందనిచోటఁ బడినయట్లు।
గళముదాఁకశిరంబుఘాతుకంబైన శార్దూలంబునోటిలోఁజూర్చినట్లు।
కినుకమఱుఁగునఁగల్గిన మానులతోడి।
వైరకాలికైకక్షత్రవాసమ్మపాయ।
కరముకరమప్రమత్తవై కశ్యపుకడ।
మిగులఁజాగ్రత్తతోడుత మెలఁగుమన్న॥

మ॥ తనయారత్నము యన్యరాత్రిచరకాంతావల్లభంబున్ సుధీ।
జనతాశ్లాఘ్యమనైననీతెలివియున్ జాతుర్యమున్ దాత్యమున్।
వినియోగించుటకిప్పుడజ్జయొదవెన్ నిష్ణాతవైయెత్తెఱం।
గునయుత్తమచిత్తమున్ బడసి నాకున్ గూర్చెదోభద్రమాల్॥
ఆ॥ ప్రొద్దుచాలవోయెఁ బొమ్మసంవేశాల।
యమునకీవునేనునరిగిపంతు।
కొందువంచుముద్దుకూఁతును వీడ్కొల్పి।
యరిగెఁ బడకటింటికతఁడానంత॥

ఉ॥ తోయలులార మీపతులదోర్దృఢబంధములొత్తిగించమీ।
మీయుదయంపుచెయ్వులను మెల్లనలేఁడపిల్చుచున్నవే।
మోముటులంచు ప్రోత్సృజనముల్ మకుటలఁదలపోయఁగోకొరో।
కోయని యజ్ఞవాటపులుఁగుల్ రుతిసేయఁదొడంగె నొక్కెటన్॥

సీ॥ చెలువులూంచినకంచెలరెప్పటిఘటించి విడెపుతమ్మలు తమ్మపడిగను [మిసి।
తొడవులపీడూపాటెడలించిసరిజేసిపూర్చిపీడినకురుల్ కొప్పువెట్టి।
వలపుకీళ్ళబిగించివలువలుసవరించి చేలకొంగునఁజెఱుచెమటఁద్రుడిచి।
మకమకలాడుదీపకళిక వెల్గున నిల్వుటద్దమున మేనీడఁజూచి।
బడిబడిఁ గులాయమునుండి వెడలివచ్చు।
కిన్నపిలుతువెంపుడురామతమ్మపెఁటు।

లనఁగ మగనాండ్రు కేళిగేహములనుండి।
వెలువడిరి ఘస్రముఖకృత్యములకునపుడు॥

శా॥ సాయంకాలమునందునీసరసకున్ జంద్రుండురాఁగంటినే।
డీయాతండని నాయకుండలుకఁ జూడ్కిన్ దన్నుఁ బ్రశ్నింపనే।
చాయన్ బోయెనొ నేనెఱుంగనని విస్రంభాప్తికై ప్రోదిత।
స్త్రాయఃపిండముఁ బట్టెనోయనఁగ సప్తాశ్వుండు వొల్చెన్ దివిన్॥

చ॥ వెలుఁగులరాచకోడివిను వీధినిఁ గల్లడరాలియున్నరి।
కఱులవెడుగంద్రనూకలనుఁ గుఱ్ఱనమెక్కుచునుండఁ దన్నునన్।
గలుపునఁ గల్పినట్టికడిగా భ్రమియించి మెసంగునోయటం।
చలుకునవోషధీశుఁడపరాంబుధిఁదూఁకొని నక్కెనక్కఁడన్॥

క॥ ఆతటిమద్దిష్టోద్యను।
కౌతుకియసురేంద్రుఁడొప్పుగా వేలున్ నిశ।
యాత్యతలమువిడిచి నెయ్యఁపుఁ।
గూఁతురిశయనాలయమునకున్ జనివడిగన్॥

ఉ॥ దూరము సెప్పరాని పెనుత్రోవజరించెడు బాటసారిపె।
న్వీరులలోననిలిగిన పోటరులేగెడు దండుదారిదు।
ర్వారతమిస్రమశ్రమలవంబుగఁజోపెడు హేమాంతకారితాఁ।
దూరుపుకొండనెత్తమునఁదోఁచెహిమారికుమారికామణీ॥

క॥ లెమ్మా మొగమ్ముఁ గడిగికొని।
సొమ్మా మహానసములోన్ భోజనమునకున్।
గమ్మా పయనమ్ము వేగమె।
లెమ్మా కొలమువారిగోడుఁదీరఁ దనయులన్॥

క॥ అనిజనకుఁడు మేల్కొలిపిన।
విని డిగ్గన లేచి సెజ్జవిడిచి సురన్న।

ట్రనుమధ్యయప్పటికిఁదగు ।
పనులు నెఱపి చెలులతోడఁ బ్రస్థితయయ్యెన్ ॥

ఉ॥ కశ్యపమౌనిచెంతకరుగన్ బయనంబగుచున్నయయ్యసా ।
దృశ్యతనూవిలాసను రేంద్రతనూజను సాఁగనంపుటా ।
వశ్యకమంచు నెల్లపనిపాటలునున్ ద్యజియుంచి ఖేదము ।
ద్వశ్యమనస్కులై వెడలివచ్చిరి నైగములా మెపజ్జనుల్ ॥

సీ॥ మాతల్లి నిన్నుఁ గన్నులఁ జూడఁగల్గుటయెన్నాళ్ళకోయని యేడ్చువారు
నిను నెడబాసి యీనిగమమునుం దెట్లు కాఁపురముందుమేయని వాకుర
శంకరుకరుణనాసాదితేప్సితకార్యసిద్ధివై రమ్మని చెప్పువారు । [వారు ।
నికృష్టులైనసురారులకుఁ దేవవై యుద్ధరింపుమీయని యెచ్చరించువారు ।
నగుచు వెంబడి నరుగునన్నిగమగృహుల ।
కెల్లవేర్వేఱఁ గేల్మోడ్చి యేగుచున్న ।
తనయనశ్రుపరీతనేత్రయుగళుఁడయి ।
కాంచుచను గేంద్రుఁడనియెఁ గద్గదికతోడ ॥

ఉ॥ ముద్దులమూన ప్రాయమున ముక్కుపచ్చలె యారకుండియున్ ।
బెట్టవుతద్దయున్ దెలివిపెంపున నెవ్వరియొద్ద నెప్పుడే ।
ట్లార్ద్రికమై మెలంగవలెనో సమయానితి నేర్తువీవె నే ।
బుద్ధులు సెప్ప నెవ్వఁడను పొమ్మనియున్ శివుఁడో ముఁగావుతన్ ॥

చ॥ పదిలముసుమ్మి తల్లి మునిపజ్జ మెలంగుతఱిన్ బుభుక్షయున్ ।
నిదురయుమానినైన నతనిన్ భజియించి తదీయనిర్వ్యక ।
ల్పదయకు నీవు నేర్పుమయిఁ బాత్రమవై మముఁ బ్రోవుమమ్మయం ।
ఖేదఁగదియించి ముద్దుగొనియెన్ జనకుండను రేంద్రుఁడాత్మజన్ ॥

ఉ॥ ఆసురసౌఖ్యయున్ జనకునంఘ్రులకుం బ్రణమిల్లిపట్టగా ।
వాసులవంకఁజూచి యపవాదమొసంగుఁడు పోయివత్తునా ।

కోసము మత్ప్రసూపితలఁ గుండఁగనీయకుఁడంచుఁ జెప్పియా ।
ళీసహాగమ్యమానయయి లేమచనెన్ బెడవాసి స్వీయులన్ ॥

క॥ అసురేంద్రాద్యాశరులును ।
రసపోయి వలనికిన్ మరలిచూచుచునా ।
వసథములకుఁ బోయిరిమా ।
వసములకున్ నలఁకువల్ పెనంగొనియలఁపన్ ॥

వ॥ అనియామహాఘ్నులకు రౌమహర్షణి యిట్లు చెప్పె ॥

* అచలజిహ్వకందము. *

క॥ అహిపుంగవబాహామహా ।
మహాపుంగవవాహాభీమముఖనముఖమహా ।
వహాభవగంగాభీమ ।
ఖహాబహువాపాహిభోగఖగప్రాగవిభూ ॥

* బంధురవృత్తము. *

రవిశిఖితుహినకిరణశుభనయనా । రౌప్యమహీధరరాట్సయనా ।
సవనహరణమునిజననతచరణా । సాధుముముక్షుసుధీశరణా ।
పవిధరవిధుముఖవనితసుచరితా । పండితశస్త్రకృపాభరితా ।
శివవిషధరవిలసితమణివలయా । శ్రీజగదబ్జపురీనిలయా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దినటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు ప్రథమా
శ్వాసము.

—:0:—

శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రితభక్తలోకరక్షా। చతురాచతురాననాది సంసేవితయ।
ప్రతిమానుభావమునిరా। జ్ఞాశమ్యమపదభూమి విశ్వాధస్వామీ॥

వ॥ అవధరింపుము శౌనకాది మహామునులకు విదితాశేషపురాణవ్రాతుండగు సూతుండవ్వలికథ యిట్లని చెప్పె॥

సీ॥ అంబుభృత్స్వనపీలిహంబులైన యనేకకుత్కీలములను పశ్చాత్కరించి।
స్వస్వజాత్యుచితజీవనజనపదములౌ దేశముల్ పెక్కులతిక్రమించి।
జంభీరసాలాక్షుకుంభీరసాలాదిసాలముల్ గలవనుల్ చాలఁగడచి।
తనయట్లె పతిసంగమునకునై శరవేగమునఁబోవు బహునైవలినులు [దాఁటి।
యన్నిశాచరపంకేరుహాయతాక్షి।
ప్రియసఖులు వెంటనే తేరఁ బిత్రునియుక్త।
కృత్యనిర్వహణైకాగ్రహృదయయగుచుఁ।
గతిపయదినాభినిర్యాణకలననరిగి॥

క॥ గంగన్ బావితసగరత।
గంగన్ శ్రితముక్తియోషిదంచద్ఘటనా।
చంగట సమాధిగాశ్రవ।
రాంగట దగ్ధతాహృదబ్జసలనారంగా॥

కం॥ అంగనకనుఁగొనె నెఱ్బడిన।
భంగనపాకృతనిమగ్నపాపాత్మాంహ।
స్సంగనధిగతశివోచ్చై।
రంగనవితపశ్యదంతరంగా గంగా॥

ఆ॥ సాటిలేనివేల్పు శేటితీరమునకుఁ।
జోటితుటుముతో నిశాటిజేరి।
తాటిసిడముఁరాచ మేటితల్లిని మెచ్చి।
మాటిమాటికొసఁగు చేటికోళ్ళు॥

సీ॥ అగజాకరాంగుళికాష్టకచ్యుతవయి విష్ణుపదమున నావిర్భవించి।
మందాకినియనెడుమానితసంజ్ఞచేఁ ద్రిదశాలయంబునస్థితివహించి।
పరగఁజాహ్నవియనఁ భాగీరథియనను సంజ్ఞలచే మర్త్యజగతిఁ నిలిచి।
భోగవతీసంజ్ఞఁ బొలుపొందఁగాఁదాల్చి యిలయధోభువనంబునధిగమించి।
కడఁగి త్రైలోక్యపావనీకరణదీక్ష।
పూనిచరియించునట్టినీపుణ్యచరిత।
మభినుతింపఁగనాతరమగునె ప్రణత।
కలుషశమనైకధోరణిగంగాభవాని॥

కం॥ మజ్జనమొకపరిసల్పుచు।
సజ్జనమునకిడియఘచయక్షాళనమా।
సజ్జనననవరతమునీ।
వజ్జనవసియించుటెంత ప్రాయత్యదమో॥

చ॥ సరసిజనాభ తామరసజన్మశచీదయితాదినిర్జరే।
శ్వరమకుటోపలద్యుతిపిశంగితమంగళపాదపీఠుఁడౌ।
పరమశివుండు నీపరమపావనతాగుణమెంచికాదె నిన్।
శిరమున నాదరంబున వసింపఁగఁ జేసెఁదరంగిణీమణీ।

క॥ శుభచరితయెవ్వరీభూ।
తభవిష్యద్వర్తమానదాతలలోఁద్వ।
న్నిభులకలుషజీవనదా।
నభ్రశైకాయనత పెంపునన్ గణుతింపన్॥

చ॥ ఘనతరమైన గర్భనరకవ్యథమాన్పెడుచోటికెవ్వరే।
ట్లనఁదగుత్వత్తరంగములయాహతులంబడునట్టివారలె।
ప్లుమ సమవర్తికింకరకఠోరతరాయుధజాలగాఢమ।
ర్దనములఁబాధనొందరుగదా తటినీకులచూళికామణీ॥

గీ॥ స్నానమొనరింపఁ బంకసంక్షాళనంబు।
నాచరించినసత్పుణ్యులైయాశ్రయింప।
నమృతమొసఁగియుఁ బ్రోచెడియాదిమూర్తి।
విలసుప్రత్యక్షదైవంబవీవకావె॥

మ॥ అభవుండగ్గలమనోయటంచు నళుకావంతైనయున్ లేకని।
త్యభవద్వాగ్భవగాహదీక్షితునకున్ దద్దేవసారూప్యమున్।
రభసంబొప్ప స్వతంత్రవైయొసఁగె దారానెత్తికెక్కించుకొ।
న్నభయంబుండునె యాత్మనాథునెడనెన్నండేని ప్రోయాంద్రకున్।

సీ॥ ప్రాలేయభూధరోపత్యకాంగణమున శైశవక్రీడలు సలిపిసలిపి।
యధికవటంచుఁబొందాసించికూడిన యమునాదితటినులనాదరించి।
యంగవంగాదిదేశావనులకు నెల్లరత్నగర్భాత్వసార్థకతనొసఁగి।
యనురూపుఁడైననాథునిఁగోరి చనిచని వాహినీపతియైనవరునిఁబడసి।
బహుసపత్నులలో నిజప్రాభవమున।
నగ్రమహిషీత్వసంపదనధిగమించి।
ప్రణుతవైనట్టినీదు సౌభాగ్యగరిమ।
ముచ్చటగుగాదె మముఁబోఁటిముద్దియలకు॥

గీ॥ ఆశ్రయముఁ గోరి దరిఁ జేరినట్టి వేన।
నేలుకవులను లోఁగొనియేలె దెపుడు।
కూర్ములకుఁ బుట్టినిండ్లు మీకొలమువారు।
గాననీకిదియుచితంబె కాతలంప॥

క॥ అవదాతగుణమయాత్మక।
కవులను భరియించుటొకట ఘనతయె నీకున్।
భువనంబులె భరియించెద।
నవిరతమును నధికతరమహత్త్వముననన్॥

క॥ ప్రమోదకరదనీకి దేతల్లీ।
ప్రమోదకరద శ్రితలోకకల్పభూరుహవల్లీ॥
ప్రమోదకరద నమృతపువెల్లీ।
ప్రమోదకరద స్రోతస్వినీసమూహమతల్లీ॥

ఆ॥ అనుచుఁ బొగడిపొగడి యాసేచనకమైన।
యాస్రవంతిమహిమ మాళిజనుల।
కెల్లసారెసారెకెరుఁగంగఁ జెప్పుచుఁ।
దన్నదీతటీపథమునఁ నరిగి॥ [నొప్పు।

సీ॥ చాయామధూమాక్తంబు లుటజముల్ కప్పుటాకట్టుదద్దడముల కరణి
మునిసన్నిహిత శివమూర్తులో యనఁగ వ్రేలిమి బూదిప్రోవు లెల్లెడలఁ [దనరఁ।
దడుపుతాల్పులు సెప్పుమిడియలసారములు శ్రోతలమమలకు సొగపుఁ [గూర్ప।
శుకశారికాది పక్షులు సంతతశ్రుతిసంస్తవంబునఁ బనసల్ పఠింపఁ।
బుట్టుటీల్గుటయును లేని యట్టిమనికి।
కనుపులెసు వెలుఁగఁ దపోధనాశ్రయంబు।

గోరివద్ధియుండినముముక్షులప్రచార।
మెసఁగనొప్పారు ఋషివాటినింతికాంచె॥

చ॥ పదములుకొందఱున్ మఱియుఁబ్రాహ్మణమింకొకకొందఱున్ క్రమం।
బొదవఁగ్రమంబుఁగొందఱును నొప్పగసంహితగొందఱున్ లస।
త్పదమలబుద్ధినైనుపనిషత్తులు కొందఱు శ్రద్ధధానులై।
చదువుచునుండ్రొక్కనిమిషంబునుమానక బాలురచ్చటన్॥

క॥ పతియొకఁడె దైవమనుచుఁగు।
స్మృతిలేనిమనమున విశ్వసించియవస్థా।
త్రితయమున సాధ్వులుకరణ।
చతుష్కమునఁ బతిసపర్యసలుపుదురచటన్॥

సీ॥ ఉటజంబులే కాని యుండమంజులసంజవనములులేవని వనరరెపుడు।
కట్టవల్కలంబులేకానిమృద్వంబరములులేవనుచుమూతిముడవరెపుడు
కాయగడ్డలె కాని గ్రసియింపశాల్యోదనమ్ములు లేవనినవయరెపుడు।
పూలుపూసలెకానిభూషింపరతనంపుఁదొడవులు లేవనిమిడుకరెపుడు।
ప్రాణనాథునందుఁ బరమేశ్వరునియందుఁ।
గాఢతుల్యభక్తిగలిగివారి।
సమ్యగర్చనంబె జన్మవ్రతంబుగా।
మెలఁగుచుందురచటి మిందుబోండ్లు॥

వ॥ అరిషడ్వర్గముఁగెల్చి రాగమమతాహంకారముల్ లేకదు।
స్తరకష్టావసరంబునందయిన సత్యంబున్ దయన్ వీడరు।
ర్వరలోష్టంబున హేమమందున సమభావంబొప్పవర్తింపుచున్।
బరమైకాయనమానసంబుదనరున్ బాడబ్యమాపల్లియన్॥

వ॥ అందుఁ బ్రవేశించి॥

శా॥ కావ్యంబుల్ ఘననాటకంబులు నలంకారోల్లసద్గ్రంథముల్।
శ్రావ్యస్వాననిగమమ్ములంగములు షట్శాస్త్రంబులున్ సంవిదా।

దివ్యాళాన్వయనాథులై చనవు ధాత్రీదేవమాణవ్యమున్ ।
గ్రవ్యాదాంబురుహాక్షిగాం చె మదిలోఁ గౌతూహలంబొప్పఁగన్ ॥

సీ॥ జమ్మేటియసటి పెక్కొప్పున్నరిండ్లఁను గ్రొచ్చి ప్రాఁబడెననితీసి పారవైవ ।
స్వచ్ఛమౌక్తికములసరి బేసులాటాడి పనికిరావికనని పరిహరింపఁ ।
బెనుముగిఱాలనచ్చనగాయలాగినాడిసభువవ్యోనివియనిసంత్యజింపఁ ।
గాంగేయసృదువాలుకను దెచ్చి గూఢమణులుకొంత సేపాడి కలయఁ

దబిసికన్నెలు కనకరత్నమయభూష । [జల్లఁ ।
ణములఁగ్రై సేసిరొకొ్రయనంగఁదగుచు ।
పొంపలరుచున్న వీధులఁజూచియలరె ।
నచటియామాణవకని స్పృహాతకునతివ ॥

ఉ॥ బంధములేక స్వైరముగఁ బచ్చికఁగుత్తుకబంటిమెక్కి రో ।
మంథమొనర్పుచచ్చటిక్రమంబులనీడల దీర్ఘసాస్నలొ ।
కంధరలొప్పఁబండికొని కన్నులపంతువు సేయుచున్నత ।
న్కంధములౌశకృత్కరులఁగన్గొనెనింత మనోజ్ఞమూర్తులన్ ॥

ఉ॥ ఆశరసార్వభౌమసుతయారుసికుప్పము నెల్లఁజూచిత ।
త్క్రోశదవిష్టమైనయొకతోఁపునఁగశ్యపుఁడాసురాపగా ।
భ్యాశమునందుఁ బ్రాంచితతపంబుననుండు టెఱింగియుత్తప ।
స్వీశునిదర్శనంబునకు నేగెఁ బ్రియాళ్యనుగమ్యమానయై ॥

సీ॥ బొబ్బమెకంబులుగబ్బుచెంపమెకంబుఁగంమలతోఁ జెలగాటమాడ ।
నేడికబాలెంత కెరదెచ్చిముద్దన్నె మెకముగారామున మేఁతవెట్టఁ ।
గూనదిల్వాల కెంద మేనసోఁకకయుండఁ బురివిచ్చినట్టునవపులుఁగులోముఁ
గడుపారనిండు క్రేఁకటికాకి నెలఁతకుఁ గోటఁడామెతఁదెచ్చి కుడువ

సాజపుఁబగల్విడిచిసత్వచయము మెకలసి । [నొసఁగ ।
మెలసియుండుటగనుగొని మిపులఁదాప ।

సాగ్రణితపోమహిమమునకబ్రపడుచుఁ ।
గశ్యపుతపోవనము సేరెఁ గ్రాలుగంటి ॥

క॥ ఆధునికబుధపురాతన ।
సాధునికరవినుతిపాత్రచరితుఁబరిత్రా ।
శ్లాఘునిఁగశ్యపునాగం ।
గాధునిదరిఁగాంచె నొకక్రముకముక్రిందన్ ॥

సీ॥ ప్రణిజనార్ఘ్యంబైన వైయాఘ్రముకృత్తిపైఁబద్మాసనస్థుఁడైపరగువాని ।
నామ్రపల్లవలోహితాంచజ్జటాపటల్య పిహితచరమాంగుఁడైనవాని ।
ఘూరాక్తసర్వవిగ్రహుఁడయి నివుఱుగప్పినకిత్తివోలె శోభిల్లువానిఁ ।
గనుదోయి మోడ్చినాయునిరోధియైగాఢతన్మయావస్థచేఁదనరువానిఁ ।
గశ్యపమునీంద్రుఁగన్గొని కమలనయన ।
భూరిభయభక్తిసమ్మదాభ్యుదితరోమ ।
హర్షమై జోతలొనరించియాళిజనము ।
లెల్లరకు మెల్ల మెల్లన నిట్టులనియె ॥

క॥ ఎడగలుగఁబోయినిలుతము ।
జడదారులతోఁడుతపము చాలించినవేం ।
బడినేమనమితనికంటన్ ।
బడుటయరయమిత్తినోటఁబడుటయె కాదే ॥

ఉ॥ అల్లదె కాననంబొకటి యబ్బురమైనప్రసూనసౌరభం ।
బెల్లదెసల్ లలిన్ బరవనెంతయునొప్పెడు నేత్రపర్వమై ।
చల్లనిమ్రానినీడలను శ్రాంతిదొలంగఁగవిశ్రమింతమం ।
చల్లనిశాచరేంద్రతనయామణియానతియీయనందఱున్ ॥

క॥ మందిదియని యావనికిన ।
మందలగతినరిగియందు నందములరని ।

ర్మించిన యొకజగతిపయిన్ ।
మించినతమిఁ గొంతవిశ్రమించి యటుపయిన్ ॥

క॥ సుమనోపచయము గోరుట।
యమరాహితజాతికుచితమౌఁగదయనిపోఁ ।
కుమడంతులొండొరులఁగూ ।
రిమి వెనకొల్పుచుఁ దొడంగిరివిరుల్ గోయన్ ॥

* లయగ్రాహి *

ఎమ్మెలెసలారఁ బ్రియకమ్మలును మేల్పనుపకమ్ములును సత్కురవక
[మ్ములుఘనాళో ।
కమ్ములునురు చ్యతిలకమ్ములునుహారికనకమ్ములునులోనైనక మ్మవిరులోలిన్
జుమ్ముమనిదుండగపుఁదుమ్మెదలు పైపయిఁ నిగ్రమ్ముకొనిమూఁగితుముఁలమ్ము
[వచరింపన్ ।
గమ్మవిలుకాని బలఁగమ్మనఁగనొప్పునిసి ద్రిమ్మరికొలంపు లెలకొమ్మగమి
[కోసెన్ ॥

ఉ॥ ఒక్కమెఱుంగుబోఁడి తనయొద్దివెలందిని వెన్కపాటునన్ ।
జక్కలిగింతవెట్టుటయుఁ జయ్యననయ్యెడిచూడిచూడుమా ।
చక్కటి దిట్టయంచు వెనఁజల్లెను పుష్పొడి దానికన్నులన్ ।
బక్కననవ్వి రాఁదగినపాడితమయ్యెనటంచు నందఱున్ ॥

చ॥ కురవకమన్ బ్రసూనమునకున్ జిగురుందియొకర్తె యొక్కబి।
త్తరికదిచూడనప్పు పరిధానమునందుఁదగిల్చి దవ్వగా।
నరుగుమునీవుపుష్పవతివైతివిపుట్టముఁజూచుకొమ్మనా ।
నరసిసుహమ్ములో జెఱఁగునంటుటఁగన్గొనినవ్వెనా పెయున్ ॥

గీ॥ పొన్నపూవులుగోయుపూబోఁడిఁజూచి ।
నీమగఁడెటిఁగెనేని వండింపకున్నె ।

యన్యపురుషసమాగతవైతివిమగ ।
నాలవయ్యునటంచోర్తు మేలమాడె ॥

ఉ॥ శింధురయానవెంతపనిజేసితెకొంకకతత్కుమారక ।
సర్కంధముమీదఁజేయిడిగికాగికనప్పుచు నుంటివే మెనీ ।
బంధులువిన్నసైతురటెబాగుకుమారికి వీవునాటనం ।
బంధముమంచిదబ్బెనని పాటనసేయవొ వారికూటముల్ ॥

గీ॥ తనదువిరజాజిపూవుగోసినకతమునఁ ।
దేఁటినిన్నువెన్నంటియే తెంచుచున్న ।
దదిగొయోహోహోమఱవితిభృంగానుసరణ ।
మెప్పుడునునీకుఁబరిచితమేగదె చెలి ॥

క॥ రమణీతనబ్రహ్మణ్య ।
త్వముస్గ్ధముగానుక్రముకతరువులతావ్యా ।
జములగుచేతులనయ్యావ ।
తిమణిపయఁటచెఱఁగువట్టిటిగిచెషుఁగంటే ॥

ఉ॥ చేడెరొపూలకై మొగలిచెట్టెగబ్రాకిన ముండ్లుపెకల్చఁగా ।
జోడునఁగ్రుచ్చుకొన్నవస్తుచుఁగా మృషలాడెదవేమె యెవ్వరుఁగా ।
జూడనియోలమందుఁ బురుషుండెవఁడో సమకూఱవానితో ।
గూడితివివ్వియానసరసుగోరులనొక్కలికేలదాఁపఁగా ॥

క॥ అనుచువివిధపరిహాసవ ।
చనరచనలతో సుమాపచయముసలిపియ ।
వ్వనరుహవిలోచనలుత ।
ద్వనమునవిహరించిరెలమి దైనారంగా ॥

సీ॥ జేజేలతెరువంటిదిబుతమొయిళ్లనితోఁచఁబూవుంమొగ్గు రేఁదిరేఁది ।
పంఫుప్రాగీటి[illegible]ర చాలుపులుపన్నిగంబులుపచరించిదాఁటిదాఁటి ।

యలరు తావులకుఁ దావులగుచు నలరారు తోరంపుటీరముల్ తూఁటి
[తూఁటి ।
తేనియలను గ్రోలు తేఁటులనదలించి కోసిపూల్ కుప్పలువోసిపోసి ।
చేడియలరూపుగొని చెరలాడుచున్న ।
పూలకోరీవజీరు తేజీలనంగఁ ।
గరముసంతసమొలయనకాననలోన ।
విచ్చలవిడిగఁ జెరలాడిరచ్చెలువలు ॥

శా॥ ఈలోనయ్యసురేంద్రపుత్రి మునిలోకేశుండనుష్ఠానమున్ ।
జాలింపన్ గనితద్వనీవిహృతులన్ జాలింపనేమించియ ।
య్యాళీబృందము వెంటఁబెట్టుకొని యొయ్యారంబునన్ మునిశా ।
ర్దూలుఁడుండినచోటికిన్ నడచుచున్ దూరంబునన్ జూచుచున్ ॥

చ॥ సురహరిమధ్యలో మనుజసుందరులో ఫణికన్యలో నిశా ।
చరపరసీరుహేక్షణలో జక్కులక్రొందలిరాకుబోఁడులో ।
తరుణులు సానదీరిచిన దర్పకువాలికతూపులట్టిరీ ।
తెరువుననువట్టియేయరుగుదెంచెదరెవ్వరొ సుందరాకృతుల్ ॥

క॥ అనుచతఁడు చూచుచుండం ।
గనె సురసాగ్రేసరంబుగాఁ జనివనితల్ ।
వినతోత్తమాంగలై మ్రొ ।
క్కిన్ నగ్గైకొని దీవనలొసఁగి మునీంద్రుఁడనున్ ॥

ఉ॥ ఎవ్వరుమీరు సారసదళేక్షణలార భయంబులేకయి ।
ట్లివ్వనికేలవచ్చితిరొ యిందఱిలో నెఱయందకత్తెయై ।
పువ్విలుకానియక్కజపు మోహనబాణముపోల్కి నొప్పునీ ।
జవ్వనిమిన్నయెవ్వతెయొ సందియమొందక తెల్పుడీయనన్ ॥

క॥ ఆసురస కశ్యపునకుధ ।
రాసురసత్తమునకుత్తరంబొసఁగుటకై ।

యాసన్నకోకిలచెలికిన్ ।
దాసన్నయొనర్ప నాసుదతి మునికనియెన్ ॥

చ॥ కలనిజమిట్లుముమ్మునఁడుగన్ వలెనేపదునాల్గువిష్టపం।
బులఁగలసర్వచేతనులభూతభవిష్యదుదంతముల్ నిర।
ర్గళమగుదివ్యదృష్టినెఱుఁగంగలజ్ఞానులరైనమీకెదన్ ।
దెలియనిదెద్దిమేనిగలదే నిజమాగయఁదాపసాగ్రణీ ॥

క॥ తరుణహరిదశ్వతేజయ ।
సురేంద్రుఁడనుకర్బురునకు సుతయీనవలా ।
సురసయనుపేరఁబిల్తురు ।
వరసకలకలాకలాపవతినీయువతిన్ ॥

క॥ పలికిమాకసురేశ్వర ।
బాలికయీయర్థశుహీనభానుసుదిబిం ।
బాలికయోనారదజా ।
బాలికపిలముఖ్యర్షినుతభవ్యచరిత్రా ॥

క॥ ఈవనితవొపుడుఁద్వత్పద ।
సేవనితరవాంఛలేక సేయఁదలఁచియే ।
గోవానిన్ బెండ్లాడదు ।
మావాసిన్ రూపవిజితమన్మథునైనన్ ॥

ఉ॥ నాపుడుఁగశ్యపుండనియె నాతుకరో యఖిలోకరూపధా ।
గ్యావతరత్నమీయువతికర్బురపుత్రికపోలికన్నదం ।
దీవరకేతలంబిటిఁజూమీ పదియాలవవన్నెజాళువా ।
ఏవియుతోడనుద్దియగు దీనితనుద్యుతిఁజూచినంతటన్ ॥

వ॥ అనియాసురసంజూచి ॥

చ॥ అడవులఁగందమూలములు నాకలముల్ తినుచుండికాలమున్ ।
గడపెడువారికాంక్షలకుఁగన్నవిమృష్టపదార్థజాతముల్ ।

కుడుచుచు రహస్యహర్మ్యములలో విహరించెడు పూవుబోఁడ్లకున్ ।
మడఁతిరో సంగడంబు ఘటమానము కావుట నీ వెఱుంగవే ॥

క॥ పసిగలతాంగి యీయెు ।
స్వనితలఁ బేమిటికిఁ బోము భవనమునకు నీ ।
సనఁ జననాథుఁడగు మునికా ।
వనజనయన యసియె మంజువాచాప్రౌఢిన్ ।

సీ॥ అనఘ లోపాముద్ర దయనుహిద ర్భేశ్వరతనయఁ జేపట్టఁడే పనఁటఁ చూలి ।
సృంజయరాజపుత్రిక సుకుమారి వరింపఁడే పోరుటో రెంపుఁదబిసె ।
సంయాతినృపతనూజాతయైన సుకన్య వరియింపలేఁడె చ్యవనమహర్షి ।
నాగాలయరి నృపతనయ నింద్రసేన యను దరుణిఁ జేకొనఁడె మౌద్గల్యమౌని
వాత్రిపీఠిఁ జేరొఁన నేలమీ రైకాద్ర ।
వేయునైనేల మనుజాదిదేయముఖ్య ।
జాతిజననాద్రికారణభూతులైన ।
యించుబోఁడులను పరిగ్రహించలేదె ॥

సీ॥ తనక శేరుకఁడీసి దంభోళిగాఁ జేసి ఋభులోకనాథునకిచ్చె నొకఁడు ।
నీర్వామిలోఁ గలనీ రెల్లనరు చేతిసుంటఁ జేరిది గ్రుక్కొనియె నొకఁడు ।
నాళీకయోనియంతస్సమస్తమునోందసృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసె నొకఁడు ।
జగదుత్పత్తిస్థితిసంహారకర్తలఁ బిడ్డలుగాఁ గనిపెంచె నొకఁడు ।
మఱియు నెందఱొ నియమసంయమిపగాఢ్యు ।
లెంత లెంతలో గాటపుపింత చెయ్య ।
లశ్రమంబునఁ జేసి ప్రఖ్యాతులైరి ।
తాపసోత్తములకు నసాధ్యములు గలవె ॥

మ॥ ప్రతిలోకోత్తమ నిస్పృహాత్ములకు సర్వంబున్ తృణప్రాయమౌ ।
కతనన్ గోరుగాక మీరు మదిసంకల్పించుచో నెల్లనై ।

వతసంఘంబులనేలువజ్రితనసర్వస్వమ్మునోవద్బిసం।
తతమున్ ద్వాత్పదపంకజద్వయముచెంతన్ గాఁపురంబుండఁడే॥

క॥ పుడుకురతనమ్ముబెట్టుం।
దొడుకును వెలిగ్రామఁకుశైదునున్ గలిగియొసం।
గెడుకులిశధరుఁడుకూరిమి।
కొడుకుసములుగలరె మానికుంజరనీకున్॥

క॥ పుట్టుగు నెంజెలిమానుపు।
నట్టిమనికి కనుచు తాపముగునీయడుగుం।
బట్టుకొనునంతభాగ్యము।
నెట్టికసీలలకుఁగాక నృజులకొదవునే॥

సీ॥ మతిశాలియహిలోకపతియొకకొడుకువసుంధరాచక్రధురంధరుండు।
ఉత్తమాజశ్శాలి యొక్కతనూజుండు జగతీప్రవృత్త్యర్థసంచరణుఁడు।
ప్రకటవైభవశాలియొకతనూజాతుండునాకలోకైకాధినాయకుండు।
అతిలోకబలుఁడొకసుతుఁడనిఁబఓకివెన్నికవెన్నిఁకయొండిద్బినఘుఁడుఁ
డొకఁడొకఁడుగాగనొక్కొకఁ భువన।
మేలుసుతులనుత్పాదించి యొంతయుంబ్ర।
ధనుపడసినట్టి మీకొరుల్ తాపసుల్స।
మానులగుదురె కశ్యపమునివరేంద్ర॥

ఉ॥ ఓదనుజాప్సరోదితిసుతోరగనాకచరాద్యవేకవం।
శోదయమూలకందనుపయోరుహగర్భమహాత్వసేవధీ।
నీదుపదాంబుజంబులసనీడనివాసమనేకజన్మసం।
పాదితపుణ్యరాశులు శుభంయులుగాకొరులొందనేర్తురే॥

సీ॥ అజ్ఞతాదైన్యసమాక్రాంతులకు నీదుసన్నిధియొకొలసన్నిధియగుఁ।
గృత్రపంతమసనంవృతులకునీశుభానుగ్రహమహిమభానుగ్రహమగుఁ

దుష్టాధితర్ష్ఠార్తితులకునీమధురానులాపముల్ మధురామలాపములగుఁ।
బాపధూస్తాపధూపాయితాత్మకులకునీ దయవర్షుకాబ్దోదయమగుఁ।
బెక్కునుడువు లేల నిక్కఁపుఁబత్తితో।
మీయుపాసనమ్ము సేయనబ్బి।
నట్టిపావనులకు నపునరావృత్తిశ్రే।
యమరచేతిలోనియదియ కాదె॥

వనమయూరవృత్తం॥ ఆదిగృహమేధిమహిమాఢ్యుఁడెపుడున్నీ,
పాదయుగళింగొలిచి బాగుపడవేతున్।
గాడనకదీన్యనుకంపమయిఁబూర్ణా।
మోదముననేలికొని ప్రోవఁగదెనన్నున్॥

శా॥ సారస్త్రీస్పృహణీయభవ్యతరచంచద్రూపలావణ్యయా।
నారక్షోలలనావతంసమటులభ్యర్థింపఁదన్మోహనా।
కారాలోకనకించిదంకురితరాగస్వాంతుఁడామానిచూ।
డారత్నంబు స్వసన్నిధానముననుండన్ మైకొనెన్ సుందరిన్॥

చ॥ తెలతెలవాఱునప్పుడు తదీయనియోజ్యులకంటెముందుగా।
నలయక లేచి ప్రాస్ణావిధులన్నియుదీరిచి యత్తపస్విపు।
ష్కలునిశివార్చనాదులకుఁ జందనపుష్పహవిఃపయోక్షతా।
దులుసమకూర్చియుంచు నలతొయ్యలిమస్కరికాంచి మెచ్చఁగన్॥

మ॥ నలినాక్షీతిలకంబు వన్యములుకందంబుల్ శలాటుల్ ఫలం।
బులుఁదెప్పించి యుపస్కరాన్వితముగాఁబొల్పొందు కారమ్ముతో।
గలయన్ జుక్రము తైలపక్వముగఁజక్కన్వండి నీవారతం।
డులసృష్టాన్నముతోడఁజేమనముబెట్టున్ మానికిన్ బ్రీతితోన్॥

ఉ॥ జేమనమాచరించిమునిసింహుఁడొకించుకవిశ్రమింపఁద్రు।
ణ్యామయమాపవిత్రశయనంబుపయిన్ వెనువాల్చుచున్ దవీ।

యామలపాదయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి కేల్గవన్ ।
గామిని యొత్తు మానికఁ బుఁగాజులు వీనుల విందు సేయఁగన్ ॥

సీ॥ చక్కెరబుగడలు చాపట్లు నీరువత్తిగలు బటాసాలు తేనెతొనలు ।
పోళీలు పేణీలు పూరీలు మండెగల్ గరిజకాయలు లడ్డుబరిడెగవ్వ ।
లప్పముల్ గారెయలరిసె లేలకికాయలఁ గరొల్లెలు సోగులామవడలు ।
సరడాలు జెడదపు పారెసత్తులు పూసకజ్జెము నిమకుడకలు సుకీయలు ।
వెన్నమెఱుఁగులు ముక్కగుపిండివంట ।
స్వాదుభక్ష్యముల్ చేసియాజలజనయన ।
పారికాంక్షికి నచ్చటివారలకును ।
గుడువఁబెట్టు వారబ్బురంపడిభుజింప ॥

ఉ॥ ఇమ్ముగ నింటఁ గల్గుపను లెల్లనుఁ దీరిచి యున్న వేళ రే ।
ద్రిమ్మరి వంగడంపు యువతీమణి యూసురసాఖ్య యూసను ।
పమ్మనమున్న లేనునుపుపచ్చిక తన్మని హాహానుధేనువ ।
ద్సమ్ములకున్ ఘనంపు తెలసమ్మెసఁగన్ డనిపించుఁ జేతతోన్ ॥

చ॥ పరపగు నాకుటింటి పరిఁబంచిటఁ బండిన గృహ్యాకంబులో ।
హరిణములన్ నిజాంఘ్రిపీఠికి టావనిఁ జేర్చి నిషణ్ణయై సుధా ।
కరముఖి బెట్టు నామెతలు కాంతత్వదీక్షణలక్ష్మికోడినిన్ ।
శరణముఁ జొచ్చె లేళ్లనుచు సంయమికన్యలు మేలమాడఁగన్ ॥

వ॥ పరగన్ గావ్యుఁడు మున్ను శిష్యులకుఁ జెప్పన్వింటచే నయ్యను ।
త్తర మేధావతి దైత్యకన్య స్వరితోదాత్తానుదాత్తాదులో ।
* స్వరముల్ దిద్దుచునుండ శ్రోతలకు నాశ్చర్యంబుగా నమ్మునీ ।
శ్వరుశ్శైక్షుల పనసల్ రువించునపుడ వ్యాఖ్యాంబులన్ దప్పినన్ ॥

* స్వరముల్ దిద్దుచునుండుఁ గావ్యునిశైక్షుల్ వేదపాఠంబులన్ ।
పనస [illegible] రువ్వడు వెట్టుచున్న యపుడు వ్యాఖ్యానంబులం దప్పినన్ ॥

ఉ॥ సింధురయానుకారులయి చిత్రవచోర్ఘురమల్ చెలంగనా।
సింధురయానపాఠములు చెప్ప నలంకృతికావ్యనాటక।
గ్రంథములత్తపోధనశిఖామణి శిష్యులకెల్ల వారుఁబు।
ప్పంథయవేణి యంతప్రతిభావతియాటను విస్మయంపడ౯ ॥

తరల॥ జగతిపైవిహరించు పల్కులచానయే మొకదాయన౯।
సొగసుకత్తె విపంచిమీటుచు శ్రోత్రకర్ణరసాయనం।
బగుమనోజ్ఞకలస్వనంబొలయంగనచ్చటిబాసవాల్।
చిగురుఁబోండ్లకుఁబాటపండువు సేయుఁదీరికవేళల౯ ॥

క॥ ఈరీతిగనారత్నో।
నారీతిలకము మునీంద్రునకుఁదచ్ఛిష్యులా।
వారికిఁదలలోనాలుక।
వైరహితవర్తిలుచుఁ గతిపయదినములుండె౯ ॥

వ॥ ఆసమయంబున॥

సీ॥ త్రిభువనిమీఁదనెత్తిచన౯ బయనమైనస్మరసాంయుగీనునిశస్త్రిమార్గుఁ।
డభినవతారుణ్యయగువనలక్ష్మికి సముచితనైపథ్యసంవిధాత।
ప్రణయకోపప్రసభనిరుద్ధహృదయులౌ తరుణజంపతులకుఁదాపికాఁడు
దీర్ఘకాలపు మూఁగతెగులుగొంట్లయియున్న కెంపుకంఠులకుఁ జికిత్స
నగుచు నిశ్శేషమానుష్యకాంతరంగి। [కుండు।
కన్యథావకరాత్ముల్లకప్రవర్త।
మానసమార్జనీభవన్మలయమారు।
తుఁడగునామనితేఁడు ప్రాదుర్భవించె॥

ఉ॥ తారివసంతుఁడానతిముదంబుననీఁజిగురాకువిండిసీ।
కారులువాడు పాటలెసఁగ౯ బహుమానసటుంటుకానయ౯।
చేరిజఁజూపటుల్ వొంగడఁదీవియపాతరల౯ బ్రసూనభూ।
షారుచిరంబుల౯ ననుసంబులనాడఁగఁజేసెనన్యజ౯ ॥

చ॥ అవసరధాత్రరాష్ట్రుఁడు క్రమమావళిపార్శ్వదినిల్వఁబెట్టికో ।
టవినొౕనరించుపూనికఁగడంగి దళాంశుకముల్ తొలంపమా ।
ధవుఁడతఁడర్మిలిన్ మగుడఁదాల్పనొసంగె వెసన్ వినూత్నప ।
ర్ణవసనకోటినచ్చటిఘనద్విజబృందము మోదమందఁగన్ ॥

క॥ విరిసెఁదఱచు గురవకములు ।
కురిసెన్ విరితేనెసోనకోనలలోనన్ ।
మురిసెన్ విల్లెక్కిడిమరు ।
ఉరిసెన్ దద్దయును విప్రయోగులమనముల్ ॥

వ॥ అట్టివసంతసమయంబున ॥

చ॥ చిలుకహుమాయురావుతను శిక్షితశిల్పిచమద్వికీర్ణుఁడై ।
చెలువుటురంబునందినుపచీలలఁబఁగరుబొంగరమ్ములన్ ।
మెలపుననాటెనోయనఁగ మేచకచూచుకమంజులమ్ములై ।
వలిపపుపైఁటలోనఁ బిగివట్రువచన్గవ గానుపింపఁగన్ ॥ [దానిఁ ।

సీ॥ తొల్లింటికంటెముద్దులుగులుకఁజగదేకమోహనాకృతితోడఁ బొలుచు
బొడగన్నమువ్వేలుపులనైన వలవంతపాలుజేసి యలంపఁజాలుదాని ।
నమ్మైపనులువూని యచటివారేగుట నొంటిపాటుగనింటనున్నదానిఁ ।
దలిరాకుదిండ్లకు త్తలపాటుఁదలకొల్పురమణీయకంఠస్వరమ్ముదానిఁ ।
గంధరాభిధానముసార్థకంబుగాగ ।
నెందుమోడులుక్రొన్ననలెత్తునట్లు ।
సరసశృంగారరసవృష్టిగురియుగుతిక ।
యొప్పఁగీతముల్ పాడుచునున్నదాని ॥

క॥ ఆకస్మికముగఁగశ్యపుఁ ।
డాకేన్ దిలకించియాశయమునఁ బలింపన్ ।
లేకయనన్యజశితనా ।
ళీకనిహతిబాధసంచలితమానసుఁడై ॥

సీ॥ జక్కవకవకఱ్ఱసంబు పొందికగల్గఁ జేయకరొడబాపు చెడ్డతనము ।
పౌర్ణమాసీశీతభానుబింబమునకుఁ జిహ్నంబుగల్గఁ జేసినజుగుప్స ।
దొండపండునకు మాధుర్యంబుగల్గఁజేయక చప్పదనముంచినట్టిరట్టు ।
పదియాఱువన్నియబంగారమునలబ్ధసౌరభంబుగఁజేయునేరమియును
బాపుకొనఁబద్మయోనియీపంకజాత ।
దళవిలోచనారత్నము స్తనముఖౌష్ఠ ।
గాత్రములనిట్లుకల్పించెఁగాక యిట్టి ।
యద్భుతాకారరేఖలెంతైనఁగలవె ॥

చ॥ చిదిపినఁబాలుగాఱు సరసీజదళేక్షణదళ్కుఁజెక్కిళుల్ ।
సదమలలీలచే భువనజాతములన్ సరిచూడరాదహా ।
పదయుగళంపురీవికి సెబాసవలగ్నసమానవస్తువున్ ।
వెదకుదమన్నఁదోఁచక దివిన్ దిలకించుచునుండఁగావలెన్ ॥

గీ॥ నెమ్మొగము వర్ణనముసేయ నెలయుగుంగ్రు ।
శావలగ్నమువొగడఁకునాయనమగుఁ ।
తత్ప్ర వేణినుతింపనబ్జంబగుఁబద ।
ములనుశ్లాఘింపఁదొరకొనఁబువఱ్ఱరమగు ॥

సీ॥ ఉడుపుష్పవల్లుతనొప్పునీయొలనాగనఖరములనుప్పదంతవసనంబు ।
చక్రిధరోపమజానొప్పునీయింతిబటువుచన్దోయియుఁగటియునారు ।
సాగసశ్రీసద్రుశతమించునీచెల్వకనులుజానుగులుమొగమ్ముతళుకు ।
మధుకరజాతోపమానతనొప్పారువచనములూరువుల్కచభరంబు ।
చేతినేర్పుమెఱయసృజియించినాడుకాఁ ।
బోలునీపొలంతిమేలుబంతి ।
నబ్జభవునిఁబెద్దయన్నయ్యవీవటుం ।
డుమనియోసరించి సుమశరుండు ॥

సీ॥ తప్తకాంచనకపీతనపటీరమిళిందనీహారదీధితీందీవరములు ।
తిలసూనకుందకుట్మలబంధుజీవకశష్కులీదర్పణశకలములును ।
దరమృణాళాంబుజస్తబకకాలభుజంగవిష్ణుపదభ్రమపీఠికలును ।
సైకతకదళికాస్తంభతూణీరరక్తకల్హారవటఫలకమఠములునుఁ ।
బొంమపడఁగూర్చి యయ్యరవిందభవుఁడు ।
తనవలంతితనంబెల్లఁ ధరణీబయలు ।
పడఁగనీకన్నెమిన్న నేర్పరచెనేమొ ।
కలరెయిట్టిరుసౌందర్యఖనులుమహిని ॥

క॥ అజరాజనిమరణులన ।
య్యజరాజకిరీటకైటభారులనైనన్ ।
గజరాజగమనయిదియం ।
గజరాజదమోఘసాయకంబై యలఁచున్ ॥

శా॥ సారంగోపమనొప్పనీ రమణిరాజద్యానమేతత్సుమ ।
ధ్యారోమావళిశంకరాభరణ సామ్యంబందునయ్యారెయీ ।
నారీరత్నమునాభి పెంపు మృదుపున్నాగోపమంబీసువ ।
ల్లీరుచ్యాంగిప్రవేణియందము వరాళిన్మీఱుఁజింతింపఁగన్ ॥

గీ॥ సరససంగీతరూపనీసరసిజాత ।
నయనఁగన్నారఁగన్నఁబన్నగవిహగమ్ము ।
గంబులకునైన రాగంబుగలుగునిట్టి ।
గానవిద్యానిధిని భూజగానఁగాన ॥

మ॥ తలఁపన్ జిత్తమునన్ జతుర్దశజగత్తన్వాంగ్యసాధారణం ।
బులుచంబులునైన దనిలలితంపుంగానమానోజ్ఞకం ।
బులహంపుల్కపుష్పకప్రాదికొన్నయవిగాఁబోలున్ బళీవిష్టపం ।
బులనెల్లన్ దమశక్తినోరిది వ[illegible]బుల్ జేసి గైకొంటకున్ ॥

ఆ॥ అనుచు మోహవిహ్వలాత్ముఁడై కశ్యప ।
తాపసేశ్వరుండు దానిసోయ ।
గమ్మవొగడిపొగడి యన్మగువను జేరఁ ।
బిలిచి యిట్లువలికెఁ బ్రీతిదనర ॥

ఉ॥ నీమవపుర్విలాసమును నీమసుదభ్రతరావలగ్నముల్ ।
నీదరహాసవక్త్రమును నీబిగిశిబ్బెపుఁగబ్బిగుబ్బలున్ ।
నీమసలీలయానమును నీహొంయలున్ దిలకింపఁజిల్కబా ।
బాదొరకైనఁజిత్తధృతిపాయుఁగదే భువనైకసుందరీ ॥

సీ॥ అదితితోఁగూడితి నదితిన్నదనమున నీయంతవలపింప నేరదయ్యెఁ ।
దితిఁగూడినాడ నదితిరంపుఁగూరిమి నీయంతవలపింప నేరదయ్యె ।
మునియనునింతికాముని ముల్కి యదియును నీయంతవలపింప నేరదయ్యెఁ
గ్రమవు మోహనాకద్రువయ్యును నదినీయంతవలపింప నేరదయ్యె ।
నింతెగాక సురభియు సింహికయుఁదనువు ।
వినతయు ననాయువుఁ గాలయును మొదలగు ।
కాంతలఁ బరిగ్రహించితిఁగాని నన్ను ।
నింతవలపింపలేరైరి యింతిమిన్న ॥

క॥ అన్నులమిన్ననునిను నే ॥
గన్నులఁగాంచినది యాదిగానుద్ధతుఁడై ।
కన్నులవిలుకాఁడదయత ।
నన్నులలినలంపఁజొచ్చె నలినదళాక్షీ ॥

సరసాంకవృత్తము॥ జగజెట్టిపూవిలుతుహింసకునోర్వఁజాలన్ ।
బిగియారుకౌఁగిలికిసిబ్బెపుఁగబ్బిగుబ్బల్ ।
జిగిమోవియానుటకు నిచ్చరతోత్సవాప్తిన్ ।
జిగురాకుబోఁడి సఫలేప్సితుఁజేయు నన్నున్ ॥

చ॥ వలసిన నెట్టి మర్త్యభవవస్తువునై ననునీకుఁ దెచ్చియీయఁ
గలుగుముఁగానఁ గాయలునుఁగడ్డలు మెక్కుచునుండఁ పుట్టగోఁ
చులజడదారిఁగూడుమనె సుందరగాత్రినటంచ హాంక్రియా
కలన నిరాకరింపకుము గంధగతంగజరాజగామినీ ॥

గీ॥ అనుచతఁడు వల్కటయుఁదరహాసహవన
తాస్యమునకొకవింత చెన్నలవరింప
రమణి మందాక్షమందాక్షరమ్యలైన
మధురవాగ్గుంభనములఁ గర్మందికనియె ॥

క॥ అలవియగునె నిక్కమగు
నలవియదలకునకునైన నామ్నాయాద్యా
ఖిలవిద్యానిలయపిచం
డులను నిరాకృతులఁజేయనుతమహింనిధీ ॥

ఉ॥ మోదముమీఱఁగా నదలిముఖ్యలతోఁబహుదివ్యచంపకా
మోదలతోనసేకయుగముల్ విహరించినుత్మపుష్టలైనమీ
కీదయతీయపైఁగరుణయిట్టిదిగల్గుట నేకజన్మసం
పాదితపుణ్యకర్మ పరిపాకముగాదె తపోధనాగ్రణీ ॥

శా॥ వాలాయంబయి నీయనుగ్రహము నిర్వ్యాజంబుగానాపయిన్
గ్రాలన్ సమ్మదమందియాఁకొనకిత్వత్కారుణ్యసంప్రాప్తిల
క్ష్మీలాభోన్నతిదూరనై చెడుమనే శ్రీతానవచ్చే తేరమోఁ
కాలడ్డంబిడి త్రోచిపుచ్చుజడుఁడొక్కండేనియున్నే ధరన్ ॥

మ॥ శమవన్ముఖ్యభవత్పవిత్రతనుసంస్పర్శాగ్నిలోఁగ్రాఁగియా
త్మమలశ్యామికవీడిశుద్ధనయిమీఁదన్ జాతరూపావతం
సమునై నిర్జరసుందరీమణులు రిష్టంబందఁదద్దేవతా
రమణీమాళిపదంబునన్ నిలువనే ప్రాజ్ఞేడితాభిఖ్యతోన్ ॥

మ॥ హావతీర్థోత్తమయానదేవవరివస్యాగుప్తదానాదిక ।
ర్మవిశేషంబులఁబొందరానిపదమున్ బ్రాపింపఁగల్గున్ గదా ।
భవదాకృత్యవలోకమాత్రములభింపన్ దర్శనాదేవసా ।
ధవయంచార్యులువల్కువాక్యముయథార్థంబౌనె యెనాటికిన్ ॥

ఉ॥ అట్టిమహానుభావతకు నాస్పదమై తనరారుచున్నమీ ।
యట్టితపోధనాగ్రణులకాదృతిపాత్రమునౌటఁజేసినా ।
చుట్టలకెల్లఁబూజ్యననుచున్ బలుకన్ ఘనమేపులోమజన్ ।
దొట్టిస్నుశాళిచేఁదగుపనుల్ గొనునత్తతనంబెచేకుఱన్ ॥

క॥ మిమ్ముఁదనుపుట యీత్రైలో ।
క్యముఁదనుపుటకెఱుఁగఁడగుఁద్వదాజ్ఞకువ్యతిరే ।
కమునొండివినె నుభయలో ।
కములకు వెలియగుదునయ్య కారుణ్యనిధీ ॥

ఉ॥ కావునఁగాయవాఙ్హృదయకర్మచతుష్టయమున్ ద్ర్యవస్థలన్ ।
దేవరపావనాంఘ్రులయధీనముజేసితికాదెమున్నెయీ ।
కైవడి మత్సమాధినడఁగన్ వలెనే భవదీయచిత్తమో ।
దావహమావిధంబున సుఖానుభవంబొనరింపుఁడర్మిలిన్ ॥

గీ॥ స్వామి వెఱచుచునొకఁ విజ్ఞాపనంబు ।
సేయఁదివురుచున్నది యీభుజిష్యయాగ్ర ।
హంబుసూపక యనుకంపనాదరించి ।
తన్మనోరథసంసిద్ధిసలుపవలయు ॥

ఉ॥ కన్నియసుందరున్ దరుణుఁగాంతునిఁబెండిలియాడఁగోరుసం ।
పన్నునిఁగోరుఁ దల్లిప్రతిపన్నవిచక్షణుఁగోరుఁ దండ్రిప్రాం ।
చన్నతవంశజాతుఁడగుసద్వరుఁబంధులుగోరుచుండ్రుప ।
క్వాన్నముగోరుచుండ్రితరులన్నుడిన్ మదిలోఁదలంపుడీ ॥

వ॥ అనికృతాంజలియై సవినయంబుగాఁబలుకుటయు ॥

చ॥ అమలినగాత్రి నీమహృదయస్థితమున్ గనుఁగొంటినింతమా
త్రమునకు నింతశంకగదురన్ వలెనేయిదెచూడునీమది
త్తమునకు మెప్పువుట్టెడువిధంబున నిన్నలరించి వాంఛితా
ర్థములొనగూర్పఁజాలుమునదద్భుతపోమహిమంబు పెంపునన్ ॥

అనిపలికి॥ క॥ అక్షిమీలన మొనరింప నాజ్ఞయొసఁగి
తనకమండలువుననున్న ఘనరసమునఁ
దోయజేక్షణకనుదోయిఁదుడిచిచూడ
వచ్చుననియాతఁడానతియిచ్చుటయును ॥

చ॥ చలువలఱేఁడునున్ గుసుమసాయకుఁడున్ ధనదాత్మజాతుఁడున్
బలరిపుసూనుఁడున్ సొబగుపట్టునఁగొప్పమతాబుక్రిందిది
వ్వెలవలె హీనకాంతులయివె వ్వెలబోఁదగియున్నయవ్వుతో
జ్వలమహనీయమూర్తిని నిశాచరసుందరిచూచెముందటన్ ॥

క॥ కనియమ్మునిశక్తికిమన
మునవింతింతయనరాని మోదమునద్బం
బునుఁగమరమొకెఁనతనికిఁ
గనుఁగవనానందబాష్పకణములుతొరుఁగన్ ॥

ఆ॥ ఆతరుణీలలామమును నాజటిలోకవతంసమున్ స్వసం
కేతితదేశకాలములఁ గేవలకామసుఖానురక్తులై
రాతురులెల్లనింపలర రమ్యములై నవిహారభూములన్
నూతననూత్నరీతులమనోభవలీలలఁదేలిరిద్దఱున్ ॥

క॥ ఈతీరునఁగణరాత్రము
తీతంబగుటయును నొకఁదివసంబుననా
శాతోదరి తెలఁగారసి
పూతచరిత్రుండుమానిపుంగవుఁడనియెన్

ఉ॥ కన్యవకానవిన్నుతించి కామవికారమునాకుఁగల్గఁగా ।
కన్యవధూటివేనినిను నాకృతిఁగన్నవయొత్తిచూతునే ।
జన్యతలాంతకత్రయము సత్యపరాక్రమనిర్జితారిరా ।
జన్యముఁనొటకోపుతనుజత్రయమున్నది నీదుకడ్పునన్ ॥

చ॥ వియదవలగ్న నీజనకువీటికిఁబొమ్మికనందువత్సర ।
త్రయముగతించినంతటను దారబలాఢ్యమునీకునాత్మజ ।
త్రయముజనించువారలకతంబునఁద్వాజ్జనకాదిదైత్యసం ।
చయమునకాపదల్ తొలఁగు శంకరదేవునను గ్రహంబునన్ ॥

క॥ వారలలో మధ్యముడు ।
ర్వారపరాక్రమముచేఁబరాజితుఁజై శ్రీ ।
నారాయణాదులమరులు ।
గౌరీశ్వరునాశ్రయింపఁగలరతిభక్తిన్ ॥

ఉ॥ ఆపరమేశు తేజమున నచ్యుతవజ్రధరాదిరక్షక్రృ ।
త్యాపటువిక్రముండొకమహాపురుషుండుదయించిసర్వలో ।
కాపకృతివ్రతాచరణమందవకీర్ణితలేనిదైత్యులన్ ।
రూపడఁగించినీసుతులఁద్రుంచు భయానకసంగరస్థలిన్ ॥

గీ॥ సుతులయాచ్ఛైర్యదశనె నీవుచూతుగాని ।
వాంద్రముగియుకచూతవు వారిజాక్షి ।
కడదిదేవరహస్యంబుగానఁదాని ।
దెలుపవలదెంత ప్రాణతుల్యులకునైన ॥

క॥ నావుడు నానుడివినిరా ।
జీవాయతనేత్రితనదుచిత్తంబునయం ।
దావహిలమోదఖెదము ।
లావాచంయమునకప్పుడనెఁబ్రాంజలిమై ॥

చ॥ పరమమునీంద్రనీదయకుఁ బాత్రమునయ్యెడుభాగ్యమబ్బుటన్ ।
దిరమనుకొంటినీపత్రియతదివ్యపదంబులచెంతనుని౯్ని ।
మ౯రుణముదైవమిట్లుచిరకాలములోనె భవత్పదద్వయీ ।
విరహముకల్గఁజేసివెతవెట్టుటెఱుంగకపోతినక౯టా ॥ [తునెట్లు ।

సీ॥ అమృతోపమములు హవ్యములు సాపడునోటఁజెడునల్లనంజుడుల్ కుడు
వేదాంతమర్మముల్ వినుచుండుచెవులతో వెకలిరక౯సినుడుల్ వింద
[నెట్లు ।
దేవరమహిమము ల్తిలకించుకనులనిష్ఠురదైత్యకృత్యముల్ చూతునెట్లు ।
మేథ్యర్షి వాటిలో మెలఁగునెమ్మేనితో మఱలుచసోఁకులపొంత నిలుతు
దనుజునకెపుట్టి పెరిఁగినదాననయ్యు ।[నెట్లు ।
నేవమైతోఁచుచున్నది యిపుడునాకు ।
నసత్రుపులతోడిపొత్తు మీయడుగులకడ ।
నుండుటకనుగ్రహింప వేయోమహాత్మ ॥

క॥ నావిని నీకును నాకును ।
దైవవిహితఘటనమింతదనుక నెయీపై ।
నీవొకనిమిషంబునునిక ।
నీవాటికనుండవలవ దేగుముతరుణీ ॥

క॥ నాయానమాటువల౯కు ।
మీయనివాకుత్రిచ్చుటయుమునీంద్రుఁడలుగునే ।
మోయనియేమియుననలే ।
కాయుమ్మలియుండెఁగదలకాలేఖ్యమొనాన్ ॥

ఉ॥ బమ్మెరనోయియిట్లుకులపాలికయా సురసాఖ్యయ స్తటెన్ ।
సొమ్మకునగ్గమై తెలివిచొప్పడదెప్పిరివంతపెల్లిదం ।
బిమ్ముకొనఁ మదిన్ దబిసియింతులచెంతకు వేగికశ్యపుల్ ।
పొమ్మనిరింకమిమ్మెడసి పోవలసెన్ దయయుంచుడాత్మలన్ ॥

చ॥ ఎఱుఁగకయో యెఱింగియో యేనొనరించిన తప్పులుండినన్ ।
మఱది యనుగ్రహింపుఁడు సమస్తజనస్తవనీయలార మీ ।
చిఱుతలె వేని నేరములు చేసిన సైతుర కాదె నన్నెదన్ ।
మఱవకుడమ్మ మీకివె నమస్కృతులేనికఁ బోయివచ్చెదన్ ॥

క॥ అనవుఁడుఁ దపోధననితం
బినులెల్లరు మిన్నువిఱిగి మీఁదఁబడినచా ।
ద్పున వెత పెల్లునఁ బొగులుచు ।
ననిరాపాలదిండి తేనియనుఁగుతనయకున్ ॥

ఉ॥ అక్కటయెంతమాటవిననయ్యె నిదెంతటివిమర్దినంబొకో ।
తెక్కరపుంబిడారతెక తేరనుషుల్ చదియింపవెన్నఁడున్ ।
రక్కసిచూలి వెట్లయితొ ప్రాణసమానను నిన్నుఁ బాసి మే ।
మెక్కరణిన్ భరింతుమిక నెట్లునయింతుము భావికాలమున్ ॥

సీ॥ ముద్దైనసారముతోఁ బద్దెముల్ చదివియే చెలియ యర్థములికఁ జెప్పునమ్మ ।
పలురకంబుల శిల్పములు చేసి యింకనే చేడె వినోదింపఁ జేయునమ్మ ।
వీణ చేకొని మేళవించి యెవ్వతె శ్రోత్రపర్వంబుగా నికఁ బాడునమ్మ ।
బహువిధంబులవింత భక్ష్యముల్ చేసియే వెలఁదుక యికవిందు వెట్టునమ్మ
పుట్టిబుద్ధియెఱింగి యొప్పుకునెఱుఁగని ।
బవిసిమూడునాళ్ళనుభవింపనొనగూర్చి ।
యూవదసుధారణంబు గానతలుఁజిచ్చు ।
దరికొలిపిపొవుచుంటివే తల్లిమాకు ॥

క॥ నీగుణరత్నసమృద్ధియు ।
నీగొనబును నీమపనుల నేర్పరితనమున్ ।
నీగానవైదుషియు నే ।
లాగుమఱచిపోదుమమ్మ లావణ్యనిధీ ॥

సీ॥ ఈవేదభాష్యంబవేక్షించినపుడైన లలనన న్నెదలోఁ దలంతువేమొ।
యీసాంకవమువాడఁదీసినయపుడైన నింతిరో నన్ను స్మరింతువేమొ।
నాతియీసాంగాజినముఁజూచినపుడేనియునునన్నుఁ దలఁపున నుంతు
[వేమొ।
యీగండసాడియుపయోగించునపుడైన వనితజ్ఞప్తికి నేను వత్తునేమొ।
యంచుఁదమకున్నవానిలో మంచివియగు।
వస్తువులనేరియిచ్చి యవ్వనితలామె।
గ్రుచ్చికాఁగిళ్ళఁగదియించి గ్రుడ్లనీళ్లు।
గ్రుక్కుకొనుచెట్టకేనిపీడ్కొలిపిరపుడు॥

సీ॥ కాకయూర్పులచేసొగసువడ్డమోవితోఁ గడువిన్ననైన మొగంబుతోడ।
గాలకులనశ్రువుల్ కురియుకన్దోయితో వడఁకుచేఁదడవాడునడకతోడ।
మేననెల్లెడలఁగ్రమ్మినగగుర్పాటుతో నూఁగాడుపేదకాఁదీఁగతోడ।
వనటచేఁగలగుండువడిన డెందంబుతో మునుపటివలె లేనితనువుతోడ।
వచ్చియాపారికాంక్షిప్రవరునకుఁబ్ర
దక్షిణమొనర్చి సాష్టాంగదండవత్ప్ర
ణతులుగావించి యాతఁడానతియొసంగఁ।
బయనమైపోయె ఋషివాటిఁబాసిసురస॥

వ॥ అనిసూతుండుచెప్పినఁదరువాతివృత్తాంతంబేమని మునులడుగుటయు॥

* తోటకవృత్తము *

కమలాసనసన్నుతకామహరా।
విమలాశయరక్షక విష్ణుశరా।
యమవర్జనసేవిత యద్రిచరా।
హిమవత్తనయాధవ కృత్తిధరా॥

* మందారమాలావృత్తం *

సౌవర్ణశైలోల్లసత్తుంగచాపా।
వైవస్వతాంభోదవాయుప్రతాపా।
కైవల్యసంధాతృకల్యాంఘ్రిదేశా।
శ్రీవారణాశీపురీసన్నివేశా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాధశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు ద్వితీయా
శ్వాసము.

———:o:———



శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీపరిబృఢకమలాసన ।
గోపాలముఖాదిత్రేయకోటీరమణీ ।
దీపితపదపంకజకా ।
శ్రీపుటభేదననివేశ శ్రీవిశ్వేశా ॥

వ॥ అవధరింపుము శౌనకాదిమహర్షులకు రోమహర్షణప్రసూతుండగు సూతుండిట్లని చెప్పందొడంగె ॥

ఉ॥ ఆరమణీవతంసము నిజాళులతోడుతమున్నచన్నయా ।
దారినపోయిపోయి తనతండ్రిపురిన్ దఱియంగఁబ్రోలికిం ।
లారులువారిఁగాంచి యవిలంబితయానములొప్పనేగితే ।
వారికిఁ మ్రొక్కి నిల్చి సుతయాగమనంబెఱిఁగించినంతటన్ ॥

మ॥ ప్రతిఘస్రంబున నేకసైరిభతుభోరభ్రాదికప్రాణభృ ।
త్తతిభూయిష్ఠతరాస్రమాంసములచేతంగాని పూరింపరా ।
నితమిస్రాచరపీవరోదరమునన్ హృద్యాత్మజాస్వాగత ।
శ్రుతిజంబైన మహాప్రమోదమిముడన్ జోటబ్బదర్యోన్ బళీ ॥

గీ॥ ఇట్లు నిర్భరసంమోదమెసకమెసఁగ ।
నర్మసత్కృతిసందేశహారులఁదన్పు ।

కొలువు చాలించి దైతేయకుంజరుఁడవ్వు ।
డొకఁడయుత్తమాజానేయ మెక్కి వెడలి ॥

చ॥ స్థిరపరిణాహమైన పుటభేదన మెల్లనలంకరింపఁగిం ।
కరులకు నాజ్ఞయిచ్చి శిబికల్ తగఁగొన్నిటి వెంటఁగొంచున ।
త్వరగమనంబుగానరిగె వల్లవబాలకదగ్ధ్యమానమా ।
తెరువున నాత్మజాముఖదిదృక్షయనశ్వదిదృక్షుఁ జేయఁగన్ ॥

చ॥ తనకెదురేగుదెంచు క్షణదాచరవల్లభుఁ డవ్వదవ్వులన్ ।
గని హృదయంబునందధిక కౌతుకముం బెనునానయుం బెనం ।
గొనఁగమనంబు దొట్రువడఁగుంచిత చారుముఖారవిందయై ।
జనకుని చెంతకేగి భుజిఁ జాఁగిలి మ్రొక్కె మహావినీతతోన్ ॥

* పంచచామరము *

రయంబునన్ హయంబుడిగ్గి క్రవ్యభుక్పరేణ్యుఁ డా ।
ప్రియాత్మజాతఁ గ్రుచ్చి యెత్తి బిగ్గ కౌఁగిలించిన ।
క్షియందుఁ గూరుచుండఁబెట్టి దీర్ఘకేశపాశమున్ ।
శయంబునన్ నిమురుచున్ మనార వేణికట్లనున్ ॥

* మత్తకోకిల *

జంటలేకకుతో భయుండును జంటకోవనిచోట్లకున్ ।
గంటుచావున నిన్ను సీమలు కానిసీమలకింపి వా ।
కొంటకున్ గరుపాటు గూరుచు గోడుసీకొదవించియి ।
ట్లింటవాయిగనుంటిఁ గుల్కుచు నేను నీకొకతండ్రినే ॥

ఉ॥ శత్రులచేతఁ జిక్కి యరసచ్చిన నైవడినున్న నన్నుఁ దా ।
మిత్రులనిచ్చి మార్తురఁ జయింపఁగఁ జేసి పునస్సుఖాప్తికిన్ ।
బాత్రునిఁ జేయఁ జాలితి సెబా సఖిలస్తవనీయ నీవుమ ।
స్వాత్రిణె మతల్లి తత్పుణ్యఫలంబవు గాక యావయన్ ॥

ఉ॥ ఉత్తమవంశజాతలు నియోజ్యలు పెక్కురుకన్నసన్నలన్ ।
జిత్తమెఱింగియేమఱక సేయుపనుల్ గొనుదానవీవుజా ।
గ్రత్తయొకింతదప్పకలకశ్శ్యపసూనుకరిచెంతఁదన్మనో ।
వృత్తియెఱింగి సేవయొనరింపుచు నాకయియెంత నొచ్చితో ॥

సీ॥ తెలియంచమూదిపాన్పులఁబండు నీవుత్త నేలఁబండుట కెంతనెగులువ [డితో ।
నేరాజువల్వలూనెడునీవు నారచీరలుకట్టుటకు నెంతతలరినావో ।
వరమణిప్రాసాదవాసినినీవాకుటింటనుండుట కెంత యేవపడితో ।
రాజార్హభోజ్యముల్ ప్రాశించు నీవాకలములు మెక్కుట కెంతకుమిలి [నావో
యకటాభాగ్యహీనుఁడనైననాము ।
గర్భమందుఁజనించినకతననతివ ।
లెందునేనాఁడునుం బొందియెఱుఁగనికడ ।
గండ్లువడిపెద్దనొచ్చితికదవెతల్లి ॥

వ॥ అనిననాసురస సురసపత్నినకిట్లనియె ॥

ఆ॥ తండ్రియెడఁడఁ బెడఁదఁదలఁగ లేనియపత్య ।
మున్ననేమి లేకయున్ననేమి ।
పిత్రహితులుసుతులు పిండతాస్థితియందె ।
డిగ్గఁబడుటచాలలగ్గుగాదె ॥

ఉ॥ స్త్రీలు నిసర్గభీరులనిచెప్పుటసత్యమెకానఁదండ్రినే ।
జాలవియారినయ్యు నటఁజల్పిననాదుస్వతంత్రవృత్తికిన్ ।
హేళనపాత్రమామనని యెంతయుసిబ్బితినొందుచుండితిన్ ।
బ్రోలుపౌరల్ స్వబంధుజనముల్ దిలకింపనుగూడనోడెదన్ ॥

క॥ నగరమునఁజొచ్చినలువురి ।
మొగములు నే నెవ్విధమునఁ బొడగాంతునటం ।

భగధీరనామనంబున।
వగపెద్దయుఁగలిగెఁదుర్నివారంబగుచున్ ॥

ఉ॥ నావుడువాతఁడిట్లనియె నాయనుఁగుంబసి వెట్టిభూనవీ।
కీవెడఁగుందలంపుమది నేటికిఁబుట్టినదమ్మదైత్యలో।
కావనకర్త్రి వౌనినుఁజయధ్వనులొప్పవరప్రదాత్రివౌ।
దేవతగాఁదలంచుచునుతింపరె నైగములెల్ల నెల్లెడన్ ॥

క॥ పొరబడితికాకయస్మ।
త్పురివారలలోన నోలమునసైననినున్।
బరిహాసోక్తులుప్రేలెడు।
వరాకులుండమినిజమ్ము వగవకువ్యధగాన్ ॥

చ॥ అమృతమయూఖశేఖరమహాత్మునిఁగశ్యపుఁగొల్చితత్ప్రసా।
దమహితభాగ్యముంబడసితద్దయుఁదైన్యదశానుభూతిక।
గ్గమయినదానవాన్వయముఁగాచుటకైపనిబూనిపుట్టెనీ।
యమయవతారమూర్తియనియందఱునందురువింమముందటన్ ॥

క॥ ఎక్కెనదె ప్రొద్దుచాలఁగ।
ప్రొక్కుముసీయిష్టదైవమునకు నెలమితో।
నెక్కుమిదె కనకశిబికను।
తక్కుమికను లేనిపోని తలఁపుమనమునన్ ॥

వ॥ అనియ నేకవిధంబుల ననూనయించి తనూజాప్రియవయస్యల నుచితయాప్యయానంబులనధిరోహింపం జేయించి తనయనుంగుతనయనొ కయనర్ఘకనకమయపల్యంకికనధిరోహింపం జేసి తానును వినీతంబు నెక్కి యర్హమైభవంబుతో నగరంబునకుంజని యారాజన్యకన్యాతిలకంబునుస ముచితప్రకారంబుననంతఃపురప్రవేశంబు సేయించి సుఖంబుండునంత ॥

క॥ పొలదిండికొలమునంగల।
తలిరాకుంబోండ్లుకెల్లఁదలకట్టగున।

న్నెలఁతుకకుఁగర్భచిహ్నం।
బులుక్రమముగనవియవ్యక్తములుకాఁదొడఁగెన్ ॥

చ॥ అనుదినముష్ణభానుఁడుదయంబునఁదోఁచకమున్ననిద్రమే ।
ల్కనిరదధావనాదివిధులన్ క్రమమొప్పఁగఁదీర్చి గంధముల్ ।
పనిగొనిచూచుచుండు శుభలక్షణప్రోద్దోకకాంతయెక్కుడాఁ ।
కనిదురనుండిమేల్కొనమ గర్భభరాలసయాకతంబునన్ ॥

క॥ మునుపెన్నఁడుఁ బద్దకమనఁ ।
గనెట్టిదోయెఱుంగనట్టికాంతామణికిన్ ।
బనులయెడమునుపటిచుఱుకు ।
తనమంతయుఁదగ్గిచుండితనమపుడొదవెన్ ॥

ఆ॥ స్వాదుతరపదార్థజాతంబు నేనియు ।
వ్రేలఁగొంతదీసి నాలుకపయి ।
రాదిచూచి పనికిరారువంటకుపీంద్ర ।
టంచుఁ గసరుచుండు నాంధసికుల ॥

గీ॥ తఱచు చిట్టుములో కిలింతలునుఁగలిగె ।
గమనమతిదీర్ఘసూత్రతాకలితమయ్యె ।
సురభిమృత్స్నాజిఘత్సయుఁగరముహెచ్చె ।
వనజనయనకుఁదౌహృదావసరమందు ॥

క॥ ఆచక్షురుత్సవకరా ।
సేచనకాకృతికిరక్కసినెలంతుకకున్ ।
మేచకములైతనర్చెను ।
చూచుకములుచనులొకింతస్థూలములయ్యెన్ ॥

క॥ ఊమియుట ప్రాయికమయ్యెన్ ,
రమణీయానూనసహజరక్తిమమగునా ।

రమణీమణివాతెఱకం।
దమయినపాటలగుణంబొందవె నయ్యదనన్ ॥

గీ॥ ఒప్పుగానాభివివరంబునుండి వెడలి।
చక్కఁగాబారుతీరిచిచనుచునున్న।
నల్లచీమలచాల్పోయనంగఁజెల్వ।
మెసఁగునూఁగారుమెలఁతుకకేరుపడియె ॥

చ॥ తఱులఁజిరాత్తసువర్ణకలితంబులరూపడఁగించెమున్నుపే।
దఱిమినయుండియుండియమిత్రద్రవిణంబిపుడబ్బినందునన్।
దెఱవవిలగ్నమారజగతిన్ నడుమంతరమందుఁగల్మిచే।
కుఱినతుటారియిల్లెయిరుగుంబొరుగుంజెడఁజూచెడుంగడా ॥

వ॥ ఇట్లు నిర్భరగర్భభరాలసయగు నాసురసకు సురసపత్నుండు తత్తదుచితావసరంబుల వృద్ధానుమతంబునఁ బుంసవనసీమంతాది శుభకృత్యంబులు మహామహంబున నెఱపి దౌహిత్రోదయంబునకుఁబ్రతీక్షించి యున్నంతవత్సరత్రయంబుపూర్ణంబై వైజననంబువచ్చె నంతనసురేంద్రాదేశంబున ॥

చ॥ క్రొత్తమెఱుంగుసున్నమునఁ గోడలకంతటవెల్లవైచిమే।
ల్చిత్తరువుల్ పటంబులును శ్రేణులుదీరిచియుత్తమంబులౌ।
నత్తరులన్నియున్ గలిపియంతటఁజక్కఁగనల్కిస్వచ్ఛమౌ।
ముత్తెపుముగ్గు వెట్టిననబొంఛ్లలరించిరరిష్టమంతయున్ ॥

క॥ ఆరాజధానిలోఁగల।
వారెల్లఁదదీయవైభవముఁగన్గొనియౌ।
సౌరభమునకునునబ్బఁపు।
సౌరునకును వెఱఁగుఁజెందసాఁగిరిపౌరుల్ ॥

క॥ పురిటికివలయుపదార్థో।
త్కరములలోనొకటియైనఁగడమపడియెనీ।

నరకనరాకుండఁగసుర ।
పరిపంథియనుజ్ఞసిద్ధపరచిరిలెంకల్ ॥

గీ॥ ఇట్టులన్నియుసమకూర్చియుంపుమీఱ ।
నెల్లవారలునున్నఁగొన్నాళ్ళుచనుడు ।
నొకశుభవాసరంబుననుదయవేళఁ ।
బ్రసవమృద్వీకినొప్పులారంభమయ్యె ॥

క॥ ఆమేలిమాటవినిపుర ।
కామినులందొకతెఱ్గైనఁగడమవడకయా ।
చామనుచూడఁజనిరిసు ।
త్రామారినిలయము యౌవతమయముగాగన్ ॥

సీ॥ సంబాధమునకిది సమయంబుగాదని క్షుద్రజాతులవెళ్ళఁగొట్టువారు ।
నల్లరిచేయువారరుగుఁడిచ్చటనుండవలదని కోపించిపలుకువారు ।
నిటనుండరాదుపొండిండ్లకునని పురుషార్భకులనుపాఁగనంపువారు ।
సందడినెవరేమిచల్లఁగాఁగాఁజేయఁగలరొక్కొ యనిదార్లుగాచువారు,
నగుచునతిజాగరూకమైయలఘుకృత్య ।
నిర్వహణదక్షమైనట్టి పూర్వదైవ ।
తేంద్రశుద్ధాంతజనముమేనెల్లశ్రుతిదృ ।
గుక్త్రిశయములైవత్రిల్లుచుండెనపుడు ॥

శా॥ అమ్మాయింకనిమేషమోర్చికొను జాతాపత్యవై చాలసౌ ।
ఖ్యమ్మొప్పన్ శయనింపఁగాఁగలవు మావ్యాహారముల్ నమ్మునీ ।
విమ్మాడ్కన్ మగవారలెల్లవినఁగా నేడ్వంగరాదామన ।
స్యమ్మొల్లన్ గడచెన్ సుఖప్రసవమా దాలస్యమేలేదికన్ ॥

మ॥ అనిహోదార్చుచుఁ బహ్వపత్యలుప్రసూత్యాభీలమందారితీ ।
రినసద్వృద్ధచిరంటులంతికధరిత్రిన్ జేరికూర్చుండిసా ।

నునయోక్తుల్ వదియింపుచున్ నడుమనెన్నోకష్టవిస్మారణం।
బునకై మోదకరంబులైనచరితంబుల్ చెప్పుచున్నంతటన్ ॥

ఆ॥ పడఁకువెడలివచ్చువెడఁదవామెకముల।
కోలముగండుకోదమచెలువుజూపు।
చప్పుడుడిఁతుఁడయ్యె నభిరామభీషణ।
మూర్తియగుచు నగ్రపుత్రకుండు ॥

క॥ కంచముఁగొనిగణగణమ్రో।
యించుచుఁగలినీళ్ళుచల్లివృద్ధాచార।
ప్రాంచితవిధానములునడి।
పించిరితత్రత్యలైన పెద్దముదుసళుల్ ॥

మ॥ లతికావిగ్రహకాపెకున్ గ్రహములెల్లన్ మంగళస్థానసు।
స్థితినొప్పారెడుభవ్యలగ్నమునఁద్వైతీయీకుఁడౌపుత్రుఁడం।
చిత్రసౌందర్యవిశేషసంహననరోచిస్స్మారితోద్యత్త్విషాం।
పతిపుట్టెన్ పొలదిండులెల్లరును సేబాసంచునగ్గింపఁగన్ ॥

క॥ అంతమతికొంతసేపటి।
కింతటితోఁదీఱెనాక్యహింతులకునెల్లన్।
వంతలనిపొరులెల్లరు।
సంతసపడఁజరమపుత్రసంభవమయ్యెన్ ॥

ఆ॥ పెకుఁలకుకష్టఁపుఁబురుళ్ళుచకఁగనెఱ।
వేర్చియటమంతుగన్నసావికయొకర్తు।
నాభిలవనాదికములువిన్నను వెలర్ప।
నెరపిపురుడులువోసెనాని సుఁగుతిగకు ॥

క॥ శయనత్రితయమునస్తవం।
ధయతతియము సౌఖ్యశాయితంబయిజ్వలన।

త్రయమోయననిజదీ ప్త్యతి।
శయమునఁదేజరిలెఁబౌరజనముప్పొంగన్ ॥ [కతె।

సీ॥ జీర్ణపాదుకజక్కఁ జెవికిఁద్వారోపాంతమున వ్రేలఁగట్టించె ముగుదయొ
పురిటిగీమునఁగాలిసోరరాదటంచు వాతాయనాంతరములు మూయునొ [కతె।
కూర్చుండిబాఁపనికూఁతురుమాలని పెండ్లామనుచనులపించునొకతె।
కుదుపైనతరువాతఁగూర్కకుండఁబగళ్ళు కతలఁబ్రొద్దులువుచ్చుఁజతు
జొత్తుపాపలు ముగురికిఁద త్తదవస [రయొకతె।
రములఁగావింపవలసినరక్షణములు।
లెన్నబోధించుచుండుఁబలిక్నియొకతె।
దితిజసుతకుఁజాతాశౌచదినములందు।
క॥ వారలయుదయమువంశపు।
వారికెతత్త్వాదృశోత్సవప్రదమైయొ।
ప్పారనసురేంద్రుప్రీతికి।
మేరయె లేదనవిశేషమేతలపోయన్ ॥

ఉ॥ అయ్యసురేంద్రుఁడప్రతిమహర్షయుతుండయిరాజభోగపుం।
బియ్యఁపుఁగూడుపచ్చడులుబెక్కులుకూరలునూరుగాయలున్।
దియ్యనిపిండివంటలును దీనజనాళికి వేనవేలకున్।
వియ్యపువారికీవలెనె నెయ్యముమీఱఁగఁబెట్టెఁదృప్తిగాన్ ॥
క॥ పేదలకుషడ్రసోపే।
తౌదనములునంశుకములునొసఁగిక్రతులకున్।
పాదులకుషోడశమహా।
ప్రాదేశనములొనరించెఁబ్రమదభరమునన్ ॥

ఉ॥ దానవరాణ్ణిదేశమునఁదాసులుతద్గ్రసూతికృత్యనూ।
ధానలుజాగరూకలయితద్దితిజార్భకతల్లజత్రయిన్।

మానవతిన్ లవంబునుఁ బ్రమత్తతనొందక స్వాపలేపముల్ ।
మానితమిస్రలన్ దివములన్ సరినాఁగయుచుండిరత్తఱిన్ ॥

శా॥ చేతశ్శీమలఁ జోటుచాలమిమదోత్సేధంబొగిన్ బాహ్యాని ।
ర్వ్యాతంబై విరబారె మేననన హీరాలంక్రియామూల్యసు ।
శ్వేతాచ్ఛాదన శేఖరాదిధరులై వీటన్ జనుల్ వర్తిలన్ ।
జాతాశౌచదినంబులెల్లఁ గడచెన్ శౌతంబశౌతంబుగాన్ ॥

గీ॥ అప్పుడసురేంద్రుఁడత్యంతహర్షమానుఁ ।
డైయనపదేశగాథభక్త్యన్వితముగ ।
బహునమస్క్రియలొనరించి భార్గవుంద ।
లంచెమనమున నట్లుతలంచుటయును ॥ [నెఱిఁగి ।

సీ॥ పొలదిండిరాయఁడప్పుడుదన్నురాదలంచుటకుంగతము తెల్పి చూడ్కి
పయనంబువినిశతపర్వవందురఁదడవుండనచ్చటననియాడించి ।
పదివాళ్ళకుంజాలుపాఠముల్ గట్టిగానొకమాఱెయెల్లశిష్యులకుఁ జెప్పి
యగ్నికార్యాదికృత్యములు శండామర్కులనుతనూజాతులకప్పగించి,
వత్తునీవెంటననికట్టువల్వకొంగు ।
వట్టుకొనికాళ్ళకడ్డమువడినదిఱుత ।
కొమరితనుదేవయాననుకుస్తరించి ।
సోఁకుడులరాచవీటికి శుక్రుఁడరిగె ॥

మత్తకోకిల॥ యోగవిత్ప్రవరుండు కావ్యుఁడు వ్యోమయానముచేతన ।
వ్లేగుదెంచుటెఱింగి యయ్యసురేంద్రుఁడ ఫలభక్తియై ।
జాగుసేయక లేచి పాద్యమొసంగియర్ఘ్యమునిచ్చియ ।
ప్డాగురూత్తముపాదయుగ్మమునందొనర్చెఁ బ్రణామముల్ ॥

క॥ దేశికునిచేతఁబదపడి ।
యాశీర్వాదంబులంది యాదైతేయా ।

ధీశుఁడుతగుగద్దియనుప ।
వేశింపన్ జేసి యనియె వినయంబెనయన్ ॥

చ॥ నిరుపమదివ్యబోధమహనీయయదీయగృహోత్తమంబుత్వ ।
చ్చరణసరోరుహద్వయరజఃకణమండితమానొయమ్మహా ।
పురుషునిదివ్యమందిరమెపోధరణీతలవైజయంతమ ।
ప్పురుషుఁడెవిష్టపత్రితయపూజ్యుఁడు మాటలు వేయునేటికిన్ ॥

ఉ॥ అంతకహంతృపుణ్యచరణాంబుజమత్తమధువ్రతాయిత ।
స్వాంతభవాదృశుండు గురువర్యుఁడుగల్గినమాకునారయన్ ।
వింతయెభద్రలాభములు వీరలెసుమ్ముభవత్ప్రసాదరూ ।
పాంతరభూతులైనసురసాత్మభవుల్ ఘనబోధశేవధీ ॥

మ॥ అనుచున్ జొత్తునిసుంగులన్ మువురనెయ్యంబొప్పఁదెప్పించియ ।
ద్దనుజాచార్యునిపాదపద్మములమీఁదన్ వైచినన్ జూచియు ।
మ్మునిశార్దూలుఁడునెత్తియాస్తనపులన్ ముద్దాడిదీవించెనిం ।
పునదైత్యేంద్రుఁడువేఁడె నామకరణంబుల్ వారికిన్ జేయఁగన్ ।

వ॥ అప్పుడొకశుభముహూర్తంబున ॥

ఉ॥ పండితలోకమండనుఁడు భార్గవుఁడాద్యునకుంచె ఘూరప ।
ద్ముండనుపేరు రక్కసులమొత్తముతొద్దయుమోదమందఁగన్ ।
రెండవవానికాఖ్యయొనరించెను తారకుఁడంచు సింహవ ।
క్త్రుండనుపేరువెట్టెఁగడగొట్టునిసుంగునకెల్లరానన్ ॥

గీ॥ ఇట్లు వారలకున్ బేరు లేరుపరచి ।
దితిసుతాధీశ్వరుండుప్రార్థింపఁగొన్ని ।
నాళ్ళుతద్దైత్యపుటభేదనమునునుండి ।
భార్గవుండేగె నూఢార్ధధూర్గవుండు ॥

చ॥ అమలినతారకాగణసమన్వితమై తనరారుశుక్లప ।
క్షమున సుధాంశుచందమునఁ గ్లానియొకింతయు లేక వాసర ।
క్రమమున వర్ధమానులయి కాశ్యపులమ్మ గురుల్ సురద్విష ।
త్సముదయదృక్చకోరకతుషారకరాయితహారిమూర్తులై ॥

క॥ అల్లారుముద్దుగా వ ।
ర్ధిల్లుచుఁ బ్రియమాణవ్యానురుదితులై పలభుక్ ।
తల్లజుని హృదయ మెంతయుఁ ।
జల్లఁబడన్ బ్రాఁకుచుండ్రు చత్వరములలోన్ ॥

మ॥ కరతాళమ్ములు సల్పి రమ్మనెడు సైగన్ జేతు లందీయనం ।
కురితద్విత్రిరదంబు లుల్బణములై గోమొప్పగా నవ్వుచున్ ।
మురుగుల్ దండకడెంబు లుంగరములున్ ముద్దొల్కుచుండన్ లస ।
త్కరముల్ చాఁచుచు లేవఁబోదు రరులన్ గౌతూహలం బందఁగన్ ॥

మ॥ వడిగారమ్మగ చప్పటుల్ చఱఁ పిల్వన్నవ్వుచున్ లేచి చి ।
ట్టడుగుల్ మెల్లన వెట్టు చేగిప్రతివిన్యాసస్ఖలత్పాదులై ।
పడియేడ్వన్ వెస లేవఁదీసి స్వేదమొప్పన్ జంద్రహారాదులా ।
త్తొడవుల్ చిక్కులుదీసి యెత్తుకొని ముద్దుల్ వెట్టుకొండ్రంగనల్ ॥

చ॥ ఉరుతరపూర్వశైలశిఖరోద్యదహర్పతి తేజులైనక ।
ర్బురసుతు లిట్లు శైశవపు ముద్దులు సూపుచుఁ గొన్నినాళ్ళు త ।
త్పురజనులన్ సురద్విడధిపున్ సరిగా నలరింపుచుండ వ ।
త్సరములు నాల్గు వోయి శుభదంబయి యైదవయేఁడు దూఁకొనెన్ ॥

సీ॥ చిడుగుడుప్పట్టి పెట్టుడుగాయ యాలంకు లల్లొనేరేళ్లు చింతాకు చుణుచు ।
బూచికన్నులకచ్చ బుడికిస్సి జికిచొప్ప బెండ్లగంచ పుటాటపిల్లదీవు ।
తూరన గోలబు దూఱు మనగ కెన పుట్టచెండ్లు డాఁగురుమూత చిందుపర్వు ।
శిరిశింగణావత్తి చీఁకటిమొటికిళ్ళు గోటదోర్లుడు కాయ కుందెనగిరి ।

మొదలుగాగలకూర్దనంబులపుడపుడు।
తోడిబాలురతోఁగూడి యాడుచుండు౹
శూరపద్మామలా రాజసుతులుముగురు।
మేలుచేతులెతమకోడిమిడుకువడఁగ॥

వ॥ అప్పుడసురేంద్రుండు గుర్వాదేశంబున॥

ఉ॥ భాసురశేముషీకునొకపండితునింబిలిపించియత్తరా।
భ్యాసమొనర్పఁజేసి తగుభంగిఁబవాకృతుఁజేసి తత్సుధీ।
శాసనమందివిద్దెలను శ్రద్ధఁబఠింపనబుద్ధపూర్వసం।
తానులనప్పగించెను సుతాతనుజాతులనమ్మనీషికిన్॥

ఉ॥ బిడ్డలులేనివాఁడగుటఁబ్రేమమునంగృతమంతునేనియాన్।
గొడ్డునుబాఁదినట్లెపుడుఁగొట్టక బోధనెసాధుఁజేయుచున్।
ముద్దులనున్ శ్రమంపడిక్రమంబునఁబ్రాజ్ఞులఁగానొనర్చుచా।
దొడ్డగురుండుపున్నియఁపుఁద్రోవకుఁబాత్రులఁజేయుఛాత్రులన్॥

చ॥ అయవిడనుత్తముండు గురుఁడప్పుడుముందుగనోఁననుశ్శివా।
యయనుచవ్రాయనుం జమవనాదటనేర్పి అఆదియుగన్ కఖా।
దియును తథాదియాదియునుఁదెల్పెడివాలుగుబళ్లు వ్రాయగా।
రయమెసఁగన్ బఠింపసుకరంబుగనేరిపె శ్రద్ధధానుఁడై॥

క॥ పిమ్మటఁ గుణితముఁ గఅపిప।
దమ్ములనొకటియుఁ దప్పొదవకుండఁగవా।
క్యమ్ములఁజదువను వ్రాయను।
ఖమ్ముగనేర్పియునుఁ బుస్తకమువట్టించెన్॥

ఉ॥ వేయుమొగమ్ములన్ జెలఁగుపీనులకంటికినుద్దియానుపా।
ధ్యాయుఁడు శ్రద్ధధానుఁడయి తత్పరతన్ జదివింపఁబాలరా।
మాయణమాదిగాఁగలుగు మాణవకార్హమ్ములైన గ్రంథముల్।
పాయనిశ్రద్ధతోఁ జదివి ప్రాజ్ఞతనొందిరి కశ్యపాత్మజుల్॥

ఉ॥ ఆపలలాశిరాట్పృథుకులట్లుపలబ్ధివిశేషమొప్పన ।
ధ్యాపకుఁడెంతనిష్ఠురతరాంశముఁజెప్పిన నంతలోనెని ।
ద్ద్యాపరులై గ్రహింపుచుఁ ధరాజను లెల్లఁగుశాగ్రబుద్ధులీ ।
పాపలటంచుమెచ్చుకొనఁ బాఠముచేసిరి గ్రంథజాతముల్ ॥

వ॥ మఱియు ఋగ్యజుస్సామాథర్వణంబులను నామ్నాయచతుష్టయంబును శిక్షావ్యాకరణఛందోనిరుక్తజ్యౌతిషకల్పంబులను షడంగంబులును మీమాంసా న్యాయవిస్తర పురాణ ధర్మశాస్త్రంబులును నాయుర్వేదంబును ధనుర్వేదంబునుఁ గాంధర్వంబును నర్థశాస్త్రంబుననఁ బ్రసిద్ధంబులైన యష్టాదశవిద్యల నామూలచూడంబుగా నవగతంబులుచేసికొనియంత స్తంత్రంబను పేరంబరఁగు పూర్వమీమాంసయుఁ బ్రాచీనతరంబును నుత్తరమీమాంసాపరనామకంబగు వేదాంతశాస్త్రంబును నక్షపాదకృతంబయిన నవీనతరంబునుఁ గపిలకర్తృకంబైన యోగశాస్త్రంబును లోనుగానఖిలశాస్త్రంబులునుఁ దుదముట్టనధ్యయనంబుచేసి గదాయుద్ధనియుద్ధంబులయందు మేలుచేతులయి యసిముద్గరతోమరప్రాసపరశ్వధశతఘ్నికాది వివిధాయోధనసాధనంబులనుపయోగించువిధంబులున మర్మకంబుగా నెఱింగి తూకలమదకలాదుల నశ్రమంబున నాశ్రవంబులుగాఁజేయనేర్చి శింధుర గంధర్వాద్యారోహణంబుల యందతిప్రవీణులై చతుష్షష్టికళలయందునప్రతికృతులై నిజమాతృవంశసముచితంబగు శాంబరియందప్రతిబింబత్వంబునొంది షోడశసమావయస్కులయి షోడశకళాపరిపూర్ణకళానిధులచందంబున రాత్రిచరబృందామందానందధుష్ఠూలల ఝులై వర్తిల్లుచుండిరంత ॥

గీ॥ అఖిలవిద్యావిశారదులధికబలులు ।
నైనమనుమలఁగనుఁగొని యమరవైరి ।
పంకజాక్షాదులెల్లరు నింకఁదనకు ।
లెంకలని పొంగుచుండెను శంకదక్కి ॥

క॥ అతిలోకశుష్మవిద్యా।
ప్రతీతులగు రాజసుతుల ప్రథవిష్టపవి।
శ్రుతమైతనరఁగనగర।
స్థితులు వికుర్వాణులై నుతించిరి సురసఁ॥

* ఉత్సాహావృత్తము *

శూరపద్మతారకులను సూనువరులువిద్విష।
చ్ఛూరపద్మపద్మివరులు సుదతినీకుఁగల్గుటఁ।
వీరమాతవైప్రశిద్ధివెలసితీవు జిష్ణుదే।
వీరమాతలోదరులకు వెతలుపొసఁగునట్లుగఁ॥

చ॥ అమృతమయూఖశేఖరమహాత్ముఁనిఁగళ్యపుఁగొల్చితత్ప్రసా।
దమహితభాగ్యముం బడసి తద్దయుఁదైన్యదశానుభూతిక।
గ్గమయిన దానవాన్వయముఁగాచుటకై పనిఁబూనిపుట్టెనీ।
యమయవతారమూర్తియనియందఱు నిన్ను నుతింతురెప్పుడుఁ।

క॥ అనిశ్లాఘించెడు స్థానీ।
యనితంబినులఁ దిలకించి యాశరవనితా।
జనతారత్నము వేదాం।
తనిశ్చలార్థవిదురతగనిట్లనియెన్ ॥

వ॥ భవత్సంశ్లాఘ్యమాన విషయంబునందు మత్ప్రయోజకతాల వంబును లేమింజేసి మీయొనర్చు ప్రశంసావచనంబులకు నణుమాత్రం బును హర్షమాణత్వంబునొందనోపనేమనినఁ గాత్రధారి సూత్రధారిచేతి జంత్రంపునాట్యపాత్రంబులాగునఁ జగన్నాటకసూత్రధారుండగు నీశ్వరు నిదగు నిచ్ఛాశక్తిత్రిప్పులం దిరుగునకాని చేతనునకు స్వాతంత్ర్యంబుసిద్ధా ర్థబీజమాత్రంబును లేకుంటసిద్ధార్థంబు సర్వంబును నీశ్వరసంకల్పనాధ వంతంబకాని యొండుగాదభీష్టకృత్యంబులు నిరంతరాయంబుగా నెఱవే ర్చికొనియు ననిష్టక్రియాకలాపంబు దూరాపాస్తంబుగా నొనర్చియు ధ

న్యులగుట జన్యులకు శక్యంబగునట్టివియె కావునఁ బ్రాజ్ఞులగు వారజ్ఞానమూలకంబులగు మమతాహంమతులను మొదలంటవిడిచి పురాకృతకర్మవశ సంప్రాప్తంబులగు సుఖదుఃఖంబులకు మోదఖేదంబుల నందక ద్వంద్వసహులై నిత్యతృప్తులగుచుఁ గాయంబులు జలబుద్బుదప్రాయంబులగుటనైహికసుఖాసుఖంబుల చిరరాత్రానుభావ్యంబులని యెఱింగి వానిఁ గణింపక యపునరావృత్తికసనాతనానందసంధాయకుండగు గూఢచరణాభరణు చరణారవిందంబుల న్వాహోరాత్రంబును నవ్యాజభక్తిమత్త్వంబున నుపాసించుచుఁ దేహయాత్రగడపుట యశరీరధారిక వశ్యానుష్ఠేయంబు స్వకృతంబులగు సుకృతదుష్కృతంబులె పుణ్యపాపలోకానుభవహేతుభూతంబులగుంగాని కొడుకులు నన్నేమియుద్ధరించెదరు నేను కొడుకుల నేమియుద్ధరింపనేర్తు నీజనయిత్రీత్వపుత్రత్వాది సంబంధంబు లాభాసమాత్రంబులుకాని వాస్తవంబులుకావు కావున నింతమాత్రమునకై మిథ్యాప్రశంసనములనన్నేలయభినందించెదరు. వలదుపొండనిన నశ్రుతచరంబగు నాసురసపరిజ్ఞాతృత్వంబునకచ్చెరువడి యప్పురపురంధ్రులు నిరంతరంబు నుఁదదంతేవాసినులై ధర్మసూక్ష్మంబులెఱుంగుచుఁ గృతార్థలగుచుండి రిదియిట్లుండ ॥

ఉ॥ బుద్ధిబలంబుఁ దేహబలముం సహజన్ములకంటెఁ బాధసం।
వృద్ధములై యెసంగఁగులజేడితశౌర్యుఁడు తారకాసురుం।
డిద్ధపరాక్రమంబునరమేశ్వరముఖ్యులచేత నేనియుం।
యుద్ధములం జయింపఁబడకుండ వరంబులనందఁగోరుచుం ॥

ఆ॥ సర్వవిద్యలకును సర్వభూతములకు।
హరుఁడె యీశ్వరుండటంచు శ్రుతుల।
నొప్పెఁబడుల మొదటనుపసర్జనంబగు।
నోంనమశ్శివాయ యాదిలేమయ్యె ॥

ఉ॥ కావున నెల్లవేలుపులకంటె నితాంతగరిష్ఠుఁడమ్మహా।
దేవుఁడె యట్టిసర్వజగతీపతియౌ పరమేశ్వరుం శివుం।
భావమునందుఁగొల్చుచుఁ దపంబొనరించెదఁగాన కేగియం।
దావిభుఁడెన్నియబ్దములకైనఁగనంబడుదాఁక నిష్ఠతోం॥

మాలినీవృత్తము॥ అనియవవివికిత్సస్వాంతుఁడై కానకేగం।
జననివలన నిర్దేశంబునుం బొందుకోరిం।
జనిజననిపదాంభోజాతయుగ్మంబుఫాలం।
బుననొరయఁగసోఁకం మ్రొక్కి యిట్లంచుఁబల్కెం॥

శా॥ తల్లీకానకునేగి సర్వజగదాధారుం శివుంగొల్చుచం।
చల్లీలం దపమాచరించుటకుఁ దర్థంబూనితిం బూర్ణమౌ।
నుల్లాసంబుననీశుచేవరము ప్రత్యూహంబు లేకందిశో।
భిల్లం దీవనయిచ్చి శెల్వొసఁగి సంప్రీతిననుం బంపుమీ॥

క॥ ఇచ్చటనున్నట్లుగవే।
వచ్చెదఁ బూర్ణప్రతిశ్రవమునముదలనీ।
విచ్చిన నళికాక్షునిచేఁ।
జెచ్చెరవరలాభమంది శిష్టనుతగుణా॥

క॥ అనిపలికినతనుజునిప్రా।
ర్థనముంవిని బుధపనాయితనయాతనయా।
చనియెదఁ గానలకనియెదు।
వినుఁబాసిన నోర్వఁగలనె నిముసంబైనం॥

చ॥ భయదములైనపోరుల సుపర్వులకోడి నశించుదానవా।
న్వయమునసముద్ధరింతువనినమ్మిన యయ్యసురేంద్రుఁడాత్మనెం।
తయుఁదురపిల్లఁజొట్టములుతల్లడమందగ నిట్టుదూరపుం।
బయనముసేయుయత్నమిది భావ్యమెనీకుఁగుమారకోత్తమా॥

ఉ॥ నావుడుఁ దారకుండనురణంబున లేఖులఁ గెల్చి దైత్యులన్ ।
బ్రోవఁగఁ జాలనే మొ స్వవపుర్ద్రవిణంబున నన్నశంక చే ।
దైవసహాయతం బడయుతర్షముగల్గియ కాదె యిట్లుగాఁ ।
బోవఁదలంచినాడ నహిభూషణుఁగూర్చి తపంబుసల్పఁగన్ ॥

ఉ॥ పూర్వసుధాశనాన్వయము మోపుగఁగట్టి తదీయభారమున్ ।
సర్వమునాదుశీర్షమునఁ జల్లఁగనుంచుదురంబెఱింగిత ।
ద్దుర్వహభారనిర్వహణధుర్యతమున్ దగియుంట కేకదా ।
గుర్వతికష్టకృత్యమునకున్ గడఁగన్ మదినిశ్చయించితిన్ ॥

ఉ॥ ఖ్యాతిమహాలవాలమగు కర్బురవంశముఁ గొంతనిర్దయా ।
రాతులుఁ గ్రొచ్చిరంచు వినఁ గ్రాఁగెడు నాహృదయంబు వైరని ।
ర్యాతనమాచరింపమిపరాసుతకంటెనుఁ బెద్దయంచమ ।
న్యాతిశయప్రచోదితుఁడనై పనికింతటికుద్యమించితిన్ ॥

గీ॥ శత్రులకుఁ గుండెగాలమై సర్వవేళ ।
లంమనెచ్చటఁ జూచిననచటఁ దానె ।
యగుచుఁ గన్పట్టువిధమున మగఁటిమిఁగను ।
బరుపలేనిజీవన్మృతుఁ బ్రతుకు బ్రతుకె ॥

గీ॥ శ్రమలవము లేని సుఖతరాసనమొకటియుఁ ।
బుధులకున్ గంటకుఁడఁగాక పొదలుటొకటి ।
యును గనీవిప్డు నాదుసముద్యమమ్ము ।
మేకొనకయుంటె మూడవ మేలు నాకు ॥

క॥ మగఁటిమివిపక్షహృదయా ।
వగతము సేయఁదగనేని వర్షధరుఁడనై ।
నగరుననవరోధమునన్ ।
మగువలకాడంగిపనులొనర్చుచునుందున్ ॥

చ॥ శ్రితజనవత్సలుండయిన శీతమయూఖకలాకలాపుఁగూ
ర్చితపము సేయ నేగుటకె చింతిలి యొప్పనిదాన వెట్లున।
వ్రతిలుమువమ్మ రేపు పలుమానిసిదిండ్లనుమన్నిగొన్నయ।
చ్యుతమఘవాముతో కడిఁదిజోములతో నెదిరింపఁజంటకున్॥

గీ॥ తనయుతినయుక్తికసమాహితముగనిట్లు।
నొడువునొడువులనాసోఁకుపడఁతియాల।
కించికించిదపత్రపాకృష్టిబాధ్య।
మానమానసనైయనె సూనుఁగాంచి॥

శా॥ పుత్రా నీదృఢనిశ్చయంబుఁ దెలియన్ బోవల్లు నీవంటిఁగా।
కత్రాసంబుగ నడ్డమాడుదునటయ్యా రాజవంశాంబురు।
ణ్నేత్రల్ కోరుచునుండ్రుగాదె సుతులన్ విక్రాంతులన్ నీవిటుల్।
ఫాత్రంబుం బ్రకటింపఁజూచుటకునే సంతుష్టఁగాకుందునే॥

క॥ అమలాత్మక నేనెశమన।
దమనుఁభజింపుమని చెప్పఁదలఁచియుబహువా।
రములుగన స్త్రీస్వాతం।
త్ర్యమస్వాతియనినియమింపఁదలఁచుచునుంటిన్॥

ఉ॥ తెమ్మెరదిండిపెన్ దొడవుదేవరనీకుఁబ్రసన్నుఁడైయభీ।
ష్టమ్ములొసంగు సవ్యభుజసంచలనాదికసన్నిమిత్తముల్।
నమ్మము కార్యసిద్ధిపిశునమ్ములుచొప్పడెడున్ శుభస్య శీ।
ఘ్రమ్మనుచున్ బ్రయాణమికఁగమ్ము ప్రతిశుద్ధిగనాజ్ఞయిచ్చితిన్॥

ఉ॥ ఇమ్మ భయాపవర్జనము నిమ్మఘవత్పరిపంథికోటికిన్।
దమ్ముభరింతు వీవని ముదమ్మునఁ బొంగుచునుండి రాశరుల్।
కమ్ము ప్రయాణమింకఁ గుతుకమ్మున నేను ననుజ్ఞయిచ్చితిన్।
రమ్ము పినాకి చేఁ ఘనవరమ్ములు గైకొని వైళమింటికిన్॥

క॥ సహజద్వేషణులమరులు।
బహువిఘ్నములాచరించి బాధింతురొకో।
గహనమునకు నీవగ్రియ।
సహజన్మసహాయుఁడవయి చనుముకుమారా॥

గీ॥ అతఁడు జ్ఞానబలముల నీయంతవాఁడ।
కాననన్యోన్యసాహాయ్యకమున మెలఁగు।
చున్న మీకపకృతిసేయనోడుదురభి।
యాతులు నిరంతరాయమగా మీతపంబు॥

* మానినీవృత్తము *

ఏమొవచించితినంచు మనమ్మున నెంచి యలక్ష్యముసేయకమా।
తామహుచే నపవాదముఁగైకొని తప్పక యగ్రియుతోనటవీ।
భూములకేగుము నీవసహాయతఁబోవుటయుక్తముకాదుసుమీ।
పామరబుద్ధివిగా వెదలోపలఁ బాగుగ యోచనసేయఁదగున్॥

క॥ నినుఁబొగడరాముగాకతి।
ఘనమతిలేకః పథానగంతవ్యయనన్।
వినవే యగ్రజుఁడోడుగ।
గొనియరుగుమడవికి నీకగుంభవుకంబుల్॥

సీ॥ శీర్షంబు వ్యోమకైశికుఁడు బాహాయుగద్వంద్వముచ్చాజగవప్రవేష్టు।
డుదరదేశంబుకాకోదరాభరణుండుచరమాంగముకరీంద్రచర్మధరుఁడు
కటిసీమబెబ్బులికడవసంపుండాల్పు గుహ్యాంబఖిలలోకకోటిగురుఁడు।
ఊరుజంఘలనూరుసారథిరదభేదికరపాదములు దండధరమథనుఁడు।
శిష్టనిఖిలాపఘనములు శిష్టవన్ని।
తామ్ఘతాపదానుఁడు తాపసాగ్రణీను।
సేవితచింత్యమానపదాబ్జుఁడీశ్వ।
రుండనుక్రోశభరమునఁబ్రోచుఁగాత॥

* మహాస్రగ్ధర *

అనుచున్ దీవించి యగ్రియసుతుఁబిలిచి యాయస్మత్ద్వార్త్తపర్వం।
బును నా వేదించి సాయంబుగననుజునితోఁబోవశాసించియాతం।
డునుఁబ్రీతిన్ మైకొనన్ వీడ్కొలిపె సుతులఁబాండుమ్యతిస్వచ్ఛకీర్తి।
ఘనులన్ సాధిష్ఠరత్నాకటకకలనచెఁగ్రాలగాఁజేసికూర్మిన్ ॥

గీ॥ జననివీడ్కొనియప్పుణ్యజననికాయ।
శస్త్రవిక్రములుచ్ఛ్రప్రశస్త్రసౌధ।
దేశముననున్నతాతనిదేశమంద।
నచటునకునేగిరి ఏనీతినచటులులయి ॥

ఉ॥ ధృష్టులు కూఁతుబిడ్డలరుదెంచివినీతినశేషవిగ్రహా।
శ్లిష్టమహీకులై యెఱఁగిదిత్తమునందుఁబోసంగియున్నస్వా।
భీష్టమువిన్నవింపనసురేంద్రుఁడునెంతయుహృష్టచిత్తుఁడై।
శిష్టియొసంగెవారికి విశేషపుఁదీవనలిచ్చి ప్రీతితోన్ ॥

గీ॥ మాతచేత మాతామహుచేతనట్లు।
పూర్ణతరమనసాదరమహాముదలవడసి।
రాజనైపథ్యములుడిగ్గఁద్రావితాప।
పార్థ్వవేషముల్ తాల్చిరయ్యధికబలులు ॥

క॥ శరములు నిశ్వాసములును।
దరకసములుఁగేలుదోయిఁదాల్చి వెడలిరా।
సురసాసుతులు హిమధరా।
ధరసవిధయియాసులై యుదఙ్ముఖులగుచున్ ॥

క॥ దానవరాజకుమారులు।
కానకుహరుఁగూర్చి తపముఁగావించుటకున్।
బోనుంకుటవినియాశిశు।
జీనముగావారిఁజూడఁజేరిరి పౌరుల్ ॥

ఉ॥ ఆదిలిజాన్వవాయజులకందఱకుందమపోకఁదెల్పియా।
మోదమెలర్పఁబెద్దలకుఁమ్రొక్కి తదీయములైనదీవనల్ ।
ప్రోదిగనందియుండ్లకికఁబొండనియొల్లరవీడుకొల్పియా।
సోదరులిర్వురున్ జనిరసూత్కృతపశ్చరణైకకాంక్షులై ॥

వ॥ ఇట్టుచెప్పిన సూతునిఁదదనంతరోదంతంబేమని మునులు ప్రశ్నించుటయు ॥

సుగంధివృత్తం॥ దృక్తనూనపాద్ధృతప్రతీతపంచసాయకా ।
ముక్తిదాయకా జగత్సమూహముఖ్యనాయకా ।
భుక్తలోకభీకరప్రభూతమగ్నహాలాహలా ।
భక్తలోకపాపపాశబంధమోక్షదోహలా ॥

విద్యున్మాలావృత్తం॥ గౌరీచేతఃకంజాదిత్యా ।
పారాశర్యాసాతస్తుత్యా ।
పారావారప్రాంచత్తూణా ।
వారాణశ్యావాసాయీశా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకావచయం
బునందు తృతీయా
శ్వాసము.

———:0:———

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీకాశ్యపగోత్రాంబుధి।
రాకావిధుసోమనాథ రాజద్హృదయా।
ప్రాకరచక్రాంగోత్తమ।
కాకోదరరాజవలయ కాశీనిలయా॥

వ॥ అవధరింపుము శౌనకాది చీరవసులకుగ్రశ్రవసుఁడిట్లని చెప్పం దొడంగె॥

క॥ స్థానీయజనుల కీడొఱని।
యానక్తంచరకుమారుల నవరతము।
స్థానమున ననేకసరి।
తారాననగిరి నీవృదాదికముఁగడదితుదిన్॥

ఉ॥ శౌర్యసహాయులై యరిగి సంయమిలోకకృతాధ్వరాదిస।
తార్యము నిర్జరోత్కరసుధామయశస్తతరాన్నదానని।
ర్ధార్యము సన్మహోగ్రమణితల్లజధుర్యములైన మందరా।
హార్యము నాసురారినవహార్యము లిర్వురుఁగాంచిరొక్కటన్॥

గీ॥ కాందిశమ్యాభరాధిత్యకాధరిత్రి।
కేఁగి యచ్చటఁబడపీఠశమాననోద।

నార్థ మొకపశ్రేగహినీడ నధివసించి ।
యనుజునకు శూరవర్ముఁడిట్లనుచుఁబలికె ॥

ఉ॥ ఈగిరియే నిదానముగ నింద్రముఖులోనగు సూడుకాండ్రచే ।
నేగిరి ప్రేతలోకమున కెందఱొ తొంటినిశాచరుల్ సహా ।
భోగిరిపుల్ హిరణ్యకశిపుప్రభృతుల్ మనపూర్వులీగిరి ।
ప్రాగిరిణస్థలంబున దపంబొనరించిరి మున్ను నిష్ఠతోఁ ॥

ఆ॥ అనినొడివి తదుచ్ఛ్రయముఁ బ్రశంసించుచుఁ ।
గొంచెమచట విశ్రమించిలేచి ।
తద్విశేషములను తగనెల్లెడలఁజూడ ।
వెడలి యన్నయనె యవీయసునకు ॥

ఉ॥ వాజిముఖోపమాస్య పరివర్తనచిహ్నితపాంసుముద్రలున్ ।
స్త్రీజతురాగరక్తపదరేఖలుఁ దన్మిథునవ్యవాయక ।
ణ్ణేజపమై మొసంగరహినించెడు పూపొదనెగ్గడంపుదే ।
రీజలుగంటె కిన్నరులు క్రీడలుసల్పినపొల్పుఁదెల్పెడున్ ॥

ఉ॥ పూర్వసుపర్వరాజకులభూషణకిన్నరితాపియుల్లెడన్ ।
బర్వగనిష్టకాలమునఁ బాగుగఁబూచిప్రియాళుశాఖిగం ।
ధర్వులస్త్రీలొ కిన్నరులతామరసాక్షులొ కాకయప్సరః ।
పర్వసుధాకరాననలొ పాడుటచెప్పకచెప్పుచుండెడిన్ ॥

మ॥ తలలన్ రాచినదివ్యతైలములగంధంబుల్ తనూలిప్తవ ।
స్తులనెత్తావులు నొకరుటన్ గలయఁజేతోరమ్యమై యీసరో ।
జలమామోదవిశేషమిచ్చెడినివత్స్వాయెవ్వరో ఖేచరీ ।
తిలకంబుల్ జలకంబులాడిరిటసందేహంబు లేదేమియున్ ॥

మ॥ సుమనోవల్లులు సప్తలాలతికలున్ సొంపారునీభూర్యశో ।
కములున్ మాక్షికములున్ విలూనసుమసంఘాతంబులయ్యెన్ మన

భ్రమరౌఘావృతవృంతపంక్తులగుచున్ భాసిల్లెడున్ యత్నుక ।
ర్గమమున్ జేసినగోళ్ళచే దివిజకాంతల్గోసిరిచ్చోవిరుల్ ॥

ఉ॥ చూడమెభూమిపైఁగల ప్రసూనములీవిరులెండఁబాడునన్ ।
వాడవు వేల్పుఁబ్రామని ప్రసవమ్ములుసుమ్మి వివృత్తపంక్తిగా ।
వీడిన విచ్చటన్ జిలుగ వేలుపుటింతులు చిప్పచిప్పగో ।
ళ్ళాడిరి నిస్తులాళిముఖలౌపదముద్రలె శంకదీర్చెడున్ ॥

గీ॥ సహజనివతంసమనకు సాజంపుమాలు ।
తులయియున్న దివ్యోపపాదకుల వెలఁదు ।
లెలమివిహరించుచోట్లివి యిదిమనకుఁద ।
పంబొనర్చుటకుచిత దేశంబుకాదు.

శా॥ సామివ్యక్తములైన సుస్వరములన్ శ్రావ్యంబుగాబుగ్యజు ।
స్సామాథర్వణమంత్రముల్ వినఁబడున్ సామీప్యమందెవ్వరో ।
సోమాసుల్ క్రతువాచరించెదరటంచున్ దోఁచెడున్ హోమధూ ।
మామోదంబిదె ఘ్రాణతర్పణమువాయ్వానీతమైవచ్చెడున్ ॥

క॥ సంయములు న్నెడమనముశు ।
భంయులమై మనమదేమిసాపమొకో వా ।
చంయమఁలూరకయపత్రఘు ।
సంయుతులయ్యెదరు దివిజశత్రులఁగనినన్ ॥

శా॥ సోదర్యోత్తమయట్లుగానఁదగదిచ్చోటన్ వసింపన్ దపో ।
యోదేశంబునకేగి యందొకవివిక్తోర్విం బ్రవేశించిక్ర ।
వ్యాదద్వేషణులెప్డుఁజేరనియరణ్యాన వసింపన్ దప ।
స్యాదిత్యావిఘ్నయంతరాయరహితంబై సాఁగునచ్చోటునన్ ॥

మ॥ అతఁడిట్లాడినఁదారకాసురవరుండన్నన్ విలోకించిదే ।
వతలన్ దేవతలంతు పుల్లకతృణవ్రాతంబుగాఁభస్మసా ।

తత్కృతులన్ జేయుమమద్ధనుశ్చ్యుతశరాగ్నిన్ వారిఁదాద్రుతమ్ముగా ।
జతనంబా మునులందుఁ జెల్లదెపుడున్ శాపాయుధుల్ కావునన్ ॥

క॥ ఓపనితపస్సంవిదతిశయ ।
యోపనితరునట్లు రజ్జులొప్పాగఁజెప్పన్ ।
శాపాయుధులన్ దొడరిన ।
పాపాయులమగుట నిశ్చయము చింతింపన్ ॥

క॥ ఆశరులహితంబులుపా ।
రాశరులకుఁ జేయుమరుగ రాసులనుటమి ।
ధ్యాశబ్దమయ్యెడునాయను ।
నాశంకన్ జేసి యొక్కొయనిజనులెన్నన్ ॥

క॥ అదికారణమ్ముగాదు ।
గ్రదులు నిశాచరులటంచ మార్గముచేతన్ ।
మదిఁ ద్వేషింతురు తబుసులు ।
సదయస్వాంతులును సర్వసములును నయ్యున్ ॥

చ॥ అదిమనవారి నేరమియయంతియ కాని మునుల్ ప్రభూతభూ ।
తదయకుఁ బుట్టినిండ్లు శమధంబున కాకరముల్ గణింపఁద ।
ద్ధృదయములందుఁ గాంస్యకరదీపికలన్ గొనిసావధానతన్ ।
వెదకిననేనియున్ గలదె నిక్కపుటల్కనిశాచరోత్తమా ॥

క॥ పాడుమరు సులేకమరులు ।
పాడుమరు తపోధనుల ప్రభావంబులుకా ।
పాడుమరు తత్సుతులుత్రో ।
పాడుమరు తదియముల్ తబపుబడ్డంకుల్ ॥

క॥ కావున ననవరతమ్ము త్రిది ।
వావాసానీకమందు సానుగ్రహులై ।

భావుకముల నొడఁగూర్తురు ।
పావనులుమునుల్ మహానుభావులగుటచేన్ ॥

పృథ్వీవృత్తం॥ ప్రహృష్టులనకైతవప్రచురభక్తియొప్పారనూ ।
ర్జితంబుగభజించువారికి నభీష్టముల్ చేకురున్ ।
ప్రతీపమతులౌచు వారలకవజ్ఞఁగావించుకు ।
త్సితాత్ములకుఁ దేజమున్ శిరియు నాయువున్ గల్గునే

గీ॥ పరహితశ్రీకులయ్యుఁదప్పకపకారు ।
వైరసఘోరహితశ్రీకలనుమరుగద ।
సంతతము సాధుబాధనిష్కారణముగ ।
సలుపు దుష్టాత్ములకు శికుల్ తొలఁగుటరుదె ॥

చ॥ అనుపధిగాఢభక్తివినయంబులఁదమ్ముఁ భజింపఁజేరెనన్ ।
మనలఁ దపోధనాగ్రణులు నష్టికిపోవుటె కాకదగ్గర ।
స్వనపవనాశనంబులనిస్వాంతములందుఁ దలంచిశాపదం ।
డనిహతిబాధతాత్ములనొనర్చుట నిక్క ముమీఁదమిక్కిలిన్ ॥

మ॥ దమునస్త్రైజత్రిలోకియందునవగీతంబైన క్రవ్యాదవం ।
శమునన్ బుట్టియుబుట్టినోసమునఁ బ్రాంచద్బ్రహ్మవిద్యారహా ।
స్యములెల్లన్ దదముట్టగానెఱిఁగి ధన్యత్వంబునొందంగసం ।
యములన్ జేసిభజింపనర్హులముకామన్యోక్తులింకేటికిన్ ॥

చ॥ ఉబుసులసందడిన్ మఱచియుంటిమి చూచితె వెన్కదిక్కునన్ ।
దబుసులమూవురల్లదెకుధంబులొమెప్పియొకేలుదోయిఁదా ।
ల్చిబుడుతజన్నిగట్లు తమచేరువవెంబడినేగుదేరమా ।
ర్తిబెరయబ్రహ్మవర్చసము తీరునవచ్చెదరీపొలానకున్ ॥

చ॥ అకటకటాకుపూయదనుజాన్వయమందుఁ జనించినట్టిపా ।
తకమునఁజేసి పుణ్యశమదర్శనులంచుఁ జగత్త్రయంబునన్ ।

ప్రకటయశంబుఁగాంచినతపస్విలఁగాంచి దినేశుఁగన్నపే।
చకములకైవడిన్ వలసె సందులఁగొందులఁజొచ్చిడాఁగఁగన్॥

చ॥ ఘనపరమేశ్వరాంశజులుగా మహినొప్పెడు మస్కరీంద్రులన్।
గనుఁగొనిచాటుచాటునఁ జనన్ వలసెన్ జగదాప్తుఁడైనయ।
రుస్కనిలసదంశువుల్ గనినక్షుల్లకఘూకములట్లు వానికిన్।
మనకునిశాచరత్వమునమంచబగుటన్ విధియిట్లువ్రాసెనో॥

క॥ ఆవచ్చుచునుండిన విపి।
నావాసులలోచనములకగపడకుండన్।
నేవేగమె పెజ్జకోటికిఁ।
బోవుటమేమమ్మ లెమ్మపోవుదమనినన్॥

శా॥ నీకీవచ్చెడివారిఁజూచుదనుకన్ లేదన్యథాబుద్ధినే।
నీకానన్ మనకుండఁగూడదని మున్నేచెప్పితిన్గాదెనా।
కాకోదర్మవిహారభూమిలివి యీయుర్వీధ్రమునుండుటని।
శ్లోకంబూడ్చిన దారుణాహికడఁగూర్కంజెంమటొనెంచగన్॥

మ॥ అనుచున్ దమ్ముని కేలుకేలఁగొని యొయ్యన్ ఘోరపప్పొండులే।
చిన నక్తారకుఁడున్ యియాసుఁడయిలేచెన్ లేచివారిర్వురున్।
జనసంచారములేక హింస్రమృగసంచారాస్పదంబైనకా।
ననవద్యన్ గతుఁదప్పగాఁజనిరినూనస్వాంతసై యాత్యులై॥

ఉ॥ ధీరుఁడు తారకాసురుఁడధిజ్యశరాసనుఁడై తరక్షుకం।
ఠీరవఋక్షభల్లుకకిటిద్విరదాద్యటవీమృగంబులన్।
ఘోరపృషత్కపాతములఁ గుంభినిపైఁబడఁగూలనేయుచున్।
దారుణమైన కారడవిదారినిబోయె ననేకఘస్రముల్॥

మ॥ తిమిరారిమ్యూఖులన్నిశాటవరులాదిన్యప్రచారంబుకాం।
చెమునున్ లేనిదియై నిరంతరపలాశిప్రావృతంబై సుమో।

దముఁగల్గించుచు స్వీయమైన జననస్థానంబు చంద్రాననా।
ప్రమహారణ్యమొకొండుచేరిరిగదేన్ బూర్ణస్యదంబొప్పఁగన్ ॥

శా॥ క్రాంతాంభోధరవర్తనీకపృథుశాఖద్రూమరుహంబైనయ।
కాఁతారంబునఁజొచ్చి యొతఁడుపవృత్తచ్ఛాయకున్ జేరివి।
శ్రాంతుండై యలశూరపద్ముఁడనుజున్ బ్రత్యర్థిసేనాబ్జినీ।
దంతీంద్రున్ దిలకించియిట్లు వలికెన్ దతాఁననాస్యాస్పృహన్ ॥

చ॥ పనసరసాలదంతశరభవ్యఫలిద్రుమసంజాతమైనయీ।
ఘనఫలసంహతుల్ జనులకంటికిఁగాన్పడమిన్ మహాహరో।
ధనములలో స్వశైశవమృతప్రియులై పడియున్నశ్యామల।
ట్లనుభవబాహ్యలై వనమునందె నశించెడిఁగదెట తారకా ॥

క॥ ఘుస్రసమయములయందఁద।
మిస్రములువసింపనబ్ధిమేఖలపైలో।
కస్రష్టయీవనముఖా।
నూస్రమరాపము సృజించెనోయగితలఁతున్ ॥

ఉ॥ తమ్ముడవింటివయ్య యిద్దండకమన్ పిపినమ్మనుమ్మపురా।
ర్వమ్మమరావతీసదృశవైభవమా పురముండునీప్రదే।
శమ్మునకున్ లయాగ్నిసదృశంబగుభార్గవదేవుఘోరశా।
పమ్మునఁజేసియిట్టి దశపట్టెనుదండునిమండగంబునన్ ॥

గీ॥ అనవుడు విలక్షుఁడై తారకాసురుండు।
దండుఁడనునాతఁడెవ్వఁడాతనికతమున।
భార్గవుండేలయలిగి శాపంబొసంగె;
నగ్రియా చెప్పవేయని యడుగుటయును ॥

స్రగ్విణీవృత్తం॥ తారకుంగారవుం దమ్మునిఁ జూచియా।
శూరపద్మాసురేశుండు దండాఖ్యదే।

వారివృత్తంబు భాషాంగనాపాదమం।
జీరనాదార్భటిః జెప్పెనీచొప్పునః॥

సీ॥ అదరులు వెలిగ్రక్కు-చునలంపుఁగొల్పుల కెనయైన నెఱజాజుకనులవాఁడు।
మొగము కంమనకునిమ్ముగ కాద్రరసపుష్టిదలకొల్పు పెనుజీబుదాడి [వాఁడు।
ప్రతిభయ సమవర్తి పరిఘాత నాయితాయత పీనబాహుద్వయంబు [వాఁడు।
ఆన్వహానేకసత్వామిషాసృక్పూర్యమాణోదరోరు కుంభంబువాఁడు।
ద్రష్టలను బీతుకొల్పు వర్ణప్రమాణ।
ములను రెంటను జీమూతముసకుమాద్రి।
యగుచునొప్పు పీవరవిగ్రహంబువాఁడు।
దండుఁడనుచండగీఁడు గల్గండొకండు॥

క॥ విక్రమమున నసదృశుఁడై।
శక్రాహితులెల్లఁదన్ను నంసేవింపన్।
శుక్రుఁడు గురుఁడుగ నీక్ష్మా।
చక్రముఁబాలించెఁ దస్యుజనములు బెగడః॥

గీ॥ అన్నిగుణములు మంది వెయయ్యునతఁడు।
పరసతీలౌల్యమున ఁమాలువడియెఁజాల।
ఘనహాపిఃపూర్ణనిప మొక కశ్యబిందు।
నైనఁబడెనేని యపవిత్రమగునకాదె॥

శా॥ ఆరాత్రించరసార్వభౌముఁడు మృగవ్యాసక్తుఁడై యొకర్కాం।
తారత్నోణిని సంచరించుచుఁ దళతర్కాంబాతపత్రేక్షణః।
దారాధీశ్వరపూర్ణబింబవదనః దంతీంద్రకుంభస్తనిః।
నారీరత్నముఁగాంచె నోర్తునరజానామః వనాంతంబునః॥

ఆ॥ అఖిలకర్మసాక్షియైన త్రయీతను।
నంముఁ ద్రుష్టినిల్పి యధికనిష్ఠ।
నుగ్రతపము సల్పుచున్నదానినిఁ భార్గ।
వాగ్రియాత్మజాతనట్టె చూచి॥

క॥ సురసాధ్యయక్షవిద్యా।
ధరసారసముఖులచక్కదనమెఱిఁగినయా।
తరసాశనపతిసాశ్వ।
ర్యరసాత్మకుఁడయ్యె నా మెఱవుఁబోడియతకున్॥

క॥ ఇందీవరకెన్నఁడునీ।
యిందీవరనయనఁజూచి యెటుఁగ నెనఁగున।
య్యిందీవరసన్నిభుకే।
నిందీవరఁపువెతయీవనితనీక్షింపన్॥

గీ॥ అనుచు వచ్చెంత మొక మహాంతరాయ।
ముగఁ దలంచుమ నా సాధుమూర్తిఁగాంచి।
యసమసాయకగోచరుఁడగుచు నాల।
తాఁగి చెంతకుఁ జేరి యిట్లనుచుఁబలికె॥

ఉ॥ ఎవ్వతెవీవు సారసదళేక్షణ నీయాభిధానమేమియో।
మవ్వపు మేను వ్యర్థనియమంబులఁ గార్శ్యమునొందఁ జేయుచీ।
విప్వనిలోన ఘోరతపమెవ్వనిఁగూర్చియొనర్చుచుంటివీ।
జవ్వనమేత మాగ్రవనచాంద్రికి నెవ్వలిఁ జేసితక్కటా॥

చ॥ వనమున నున్న పద్మినికి వాసరనాథునిదోత్యమిష్టమా।
గనుకనో యింతకోర్చితివి కాక వధూమణి లేఁతలీ వెతో।
నెనయగు దేహమీకటుకు టెండకు నెట్లు సహింపఁజాలుఁజా।
లునిక నుమానుమీ తపములోచనపిత్రవక్త్రతాంబురుద్దలా॥

గీ॥ అకటహృద్యభాస్వన్మూర్తులైనపద్మి।
నులకును స్వధామకార్శ్యమునుఁగలిగించు।
నట్టితీవ్రతపముఁగోరుటహా! మానె।
చెలువ దూరపిచారంబుసేయవైతి ॥

క॥ తొవకంటికుటుముకన్నా। ·
కవిభావసునర్చియందుఁగ్రాఁగుకలననీ।
దువపు స్తపనీయముఘు।
ర్మవారిదంభంబునన్ గరఁగెడిన్ గంటే ॥

ఉ॥ తామరసాక్షి దంభుఁడను దానవనాథుఁడనేను శిద్ధసా।
ధ్యామరగుహ్యకాదులు భయంపడుచుందురు సంతతంబును।
న్నానుమువిన్నమాత్రమున నావగునాజ్ఞను నాశ్రవుల్ సుమీ।
యీమహినేలుచున్నమనుజేశ్వరులెల్లనిజంబువల్కితిన్ ॥

చ॥ దిరిసెనపుఁబూవువంటి మృదుదేహముదానవు కష్టనిష్ఠనీ।
కరణిఁదపింపనేల గజగామినినాకుఁద్వితీయవై సురే।
శ్వరునిద్వితీయపోలె మణిసౌధతలంబులరాజ్యవైభవ।
స్థిరతరసౌఖ్యసంపదలఁ జెందఁగవచ్చును రమ్మువీటికిన్ ॥

ఉ॥ తొయ్యలియక్షయంబులగు తొమ్మిదిపాఁతఱలున్నకల్మికాఁ।
డయ్యును గుహ్యకేశ్వరునియంతటివాఁడు మదార్జితార్థమున్।
నెయ్యమినేగుదెంది కనినివ్వెఱఁజెందును శ్రీమదగ్రణీ।
వయ్యమెసుమ్ము నామవిభవస్మయమింకనినాకుమ్రొక్కెఱఁదాన్ ॥

క॥ అమరేంద్రుమీఱునైశ్వ।
ర్యముగలిగిన నాకురాణివగుభాగ్యముకం।
టెమృగాక్షీ యీతపమున।
సమధికఫలమేమిబడయఁజాలుదు చెపుమా ॥

ఆ॥ త్రిభువనస్థితప్రతీపదర్శినులను ।
వలపుగొలుపఁజాలువాఁడ నేను ।
యువతినిన్నుఁ గోరుచున్నాఁడనిదినీకు ।
తపముఫలముగాఁగఁదలఁపవలదె ॥

చ॥ అనుచుఁ బ్రసూనసాయకవశాశయుఁడై యతఁడట్లువల్కినన్ ।
దనమదికింపుగాని క్షణదాచరనాథుని విప్రలాపముల్ ।
వినియతనింగుఱించి ప్రభవించినగాటఁపుటల్కమానసం ।
బుననెయడంచి యయ్యలరుబోఁడి మృదుస్వనమొప్పనిట్లనున్ ॥

చ॥ ఇహసుఖనిస్పృహాత్మనయి యిచ్చటి యాకలముల్ భుజించుచీ ।
గహనములోననిప్పగిదిఁగాలముపుచ్చుతపస్వినిన్ ననున్ ।
గృహిణులపొందుడెందమునఁగోరుచు స్వైరిణులై చరించుదు ।
ర్మహిళలతోడసాడినక్రమంబున నిట్లననీకుఁబాడియే ॥

ఉ॥ దారితవైరివీరబలదానవనాథ సమస్మరార్తులన్ ।
గోరుదుగాక నీకుఁ దగుకోమలమూర్తుల నన్నువంటిశృం ।
గారవిరక్తలౌ తపసికన్నెలఁగోరుట యర్హమౌనెకం ।
ఠీరవమెన్నఁడైన హరిణీసురతంబున కిచ్చగించునే ॥

క॥ వినుదుర్గతిహేతువుపర ।
తనుమధ్యలపొందు పరదారాన్గచ్ఛే ।
త్తని ప్రభుసమ్మితమగుతొలు ।
మినుకువదించన్గదే తమీచరనాథా ॥

ఉ॥ అన్నానన్నిటులాడనీకుదగునయ్యా దానవాధీశనే ।
నన్నాలీకభవోపమానుఁడగు శుక్రాచార్యునగాత్మజన్ ।
నన్నెన్నండును మున్ను నీవెఱుఁగకుంటం జేసి యిట్లంటిగా ।
కున్నన్ నగ్గురుపుత్రిఁజెల్లెలినిగా నూహింపకిట్లందువే ॥

గీ॥ నిన్నెఱుంగకమున్నె గన్గొన్నయపుడె।
స్నేహపాత్రంబవీవని నేనెఱిఁగితి।
సన్నుతైలబిలత్వంబెసంగుటొకటి।
యధికముగనిష్టువినుటచేనది స్థిరపడె॥

గీ॥ సకలసుమనోమధూళీరసజ్ఞయైన।
యళికిఁ గంధఫలియుఁబోలె నసురనాథ।
నైకమాన్యకృక్సతీప్రాణనాథుఁడవగు।
నీకునస్పృశ్యనైతిని నేనువింటె॥

ద్రుతవిలంబితవృత్తం॥ ఇటులువలికి మతేమొవదింపఁబో।
వుటయు నడ్డమువోయి వ్యవాయలం।
పటుఁడు దానవపాలకుఁడామెతో।
స్ఫుటతరోక్తులుచొప్పడ నిట్లనెన్॥

చ॥ సుకముగ నాదుసొమ్ముఁదినుచున్ ననునాయిలుఁగాచియుండుదై।
త్యకులగురుండు కావ్యుఁడు మదాశ్రితవర్గములోనివాఁడవా।
నికిఁదనుజాతవౌటఁదరుణీమణి నీవుమదర్థమైతిపిం।
చుకతలపోయుమీ ప్రజలసొత్తులురాజువిగావె యారయన్॥

ఉ॥ నీకునిజంబుదెల్పెదను నీరదనీలశిరోజ నేనుదో।
షాకరమైన దైత్యకులమందుఁజనించినవాఁడఁగానులో।
కైకపనాయితంబగు దినేశ్వరవంశమునందుఁబుట్టియు।
శ్లోకుఁడనన్ బ్రథన్ గనిన క్ష్మాతలనాథునకున్ దనూజుఁడన్॥

శా॥ మత్తాతాదులు నాదుబాల్యమునఁ బల్మాఱుత్తమంస్వార్జితం।
విత్తమ్మంచు సమజ్ఞలన్ బలుకఁగా వింటన్ స్వబాహాబలో।
పాత్తంబైన ధనంబెకాని యొకఁడిత్ర్యంబై నయర్థంబుఁగిం।
చిత్తైనన్ భుజియింపఁగూడదనితోఁచెన్ నాదుచిత్తంబునన్॥

శా॥ అంతన్ బంధులనెల్లఁబాసి పయనంబై పోయి వింధ్యాచల ।
ప్రాంతోర్విన్ మధుమంతమన్ నగరమున్ బాలింపుచున్నట్టియు ।
త్యంతాఖీలులఁ దైత్యులన్ గెలిచి యయ్యాదిత్యవైరుల్ కడున్ ।
సంతోసంబలరార వేఁడుకొనుడున్ గైకొంటిఁ దద్రాజ్యమున్ ॥
చ॥ బలియుఁడు వాసవుండెపుడు పైఁబడిచంపునొయన్నబీతు చే ।
నెలఁతరొ కంటినిండ సుఖనిద్రయెఱుంగని యాతుధానము ।
ఖ్యులు మదనూనదోర్బలసమున్నతి పెంపున నోటదక్కఁగుం ।
డెలపయిఁ జేయివైచికొని నిద్దురవోయెనరిప్పు హాయిగన్ ॥
ఉ॥ వాసరనాధువంశమున వైభవమొప్పఁగ నుద్భవించుటన్ ।
జేసి తపస్విముఖ్యుఁడు వశిష్ఠుఁడు నాకుఁగురుండుగానిరా ।
కాసులమూఁకకున్ గురుఁడుకావ్యుఁడు నాకుగురుండుకాడు శం ।
పానదృశాంగి మద్గురుకుమారివి నీవును గావువింటి వే ॥
ఉ॥ పున్నమనాటి చంగురునిఁ బోలుభవమ్ముఖలక్ష్మియున్ బదా ।
ర్వన్నెపసిండితీవెకెనవచ్చెడు నీనును మేనిజగ్గునీ ।
క్రొన్నన చెండ్లకుద్దియగు గుత్తఁపు చన్గవపొంకమున్ గనుం ।
గొన్నఁ దపస్వులున్ మరునికోఁతలపాలయి కుందకుందురే ॥
చ॥ తమితటిఁ జేతిరోకట మునుదస్యుఁడు ప్రమద్వరఁగూర్కట మంపునన్ ।
స్వముఁగొఁకపోవనిచ్చి తరువాయిని మేలకని యేష్పపోలికనో ।
రమణితబంపు వేఁదుఱుపరాకున మారునకొప్పగించియు ।
త్తమునసుఁ గోలుపోయి యనుతాపమునొందెదుసుమ్ము పిస్మటన్ ॥

వ॥ సహస్రపత్రపత్రనేత్రి యతిమాత్ర వ్యథావిధానపటిష్ఠయగుతపోనిష్ఠచేఁజిరరాత్రసమాసాదనీయఫలసిద్ధియగు నాముష్మికసుఖంబుఁబడయనపేక్షించి యుత్తమక్షత్రగోత్రజుండను స్వయంకామయమానుండనునగు మహారాజపుత్త్రునన్నుఁ బరిగ్రహింపనొల్లక యుపేక్షించుట యు

దగ్రశాఖిశాఖాగ్రస్థితశలాటు జిఘృక్షుచేనులంగవనిరంతరసమావరణంబ
గుభూరుహప్రకాండంబున కెగఁబ్రాఁకుచుఁగరస్థితపరిణత స్వాదుఫలంబు
పరిహరించుటయుఁగుఁజుమీ యానేచనకంబగునీమోహనాకారంబులోచ
నగోచరంబై నంతనుండియు విషమనారాచుండు బెట్టిదుండై యేఁచం దొ
డంగె భయ...మసుందరాంగగాఢపరిష్వంగసుఖంబొసంగి యాదరింపవే
సి యికనొకనిమేషంబును దాళఁజాలననునతను సామ్రాజ్యపట్టబద్ధుం జేసి
యీవును మదీయాతనుసామ్రాజ్యరాజ్ఞీత్వంబునకుఁ బట్టబద్ధవుకమ్ము ర
మ్ము శృంగారసారణి నోలలాడనిమ్మని గంఫశుండాలంబు బాలరసాలకి
సాలంబుఁ గేలదెమల్చు లీలనాసుశీలకరగ్రహణంబు సేయంబోయిన నా
యనవద్యచరిత మదాంధుండగువీఁడు కదియంబడెనేని కర్జంబుదప్పునని
కపటానురాగోక్తులచేఁ బ్రతారించి సురుఁగందలంచి యారాత్రించర
పతికిట్లనియె ॥

శా॥ ఏమేమీ కృతలక్షణుండయిన యాయిక్ష్వాకుభూజానికిన్ ।
బ్రేమామాత్రపుఁడైన పుత్త్రుఁడవె యోపృథ్వీతలాధీశ నిన్ ।
సామాన్యంబున యామినీచరునిగా స్వాంతంబునం దెంచితిన్ ।
నామౌర్ఖ్యంబునకున్ సహింపు మెదఁగిన్కన్ బూనకుద్యద్దయన్ ॥

చ॥ కలుషవివర్జితంబుఁ ద్రిజగద్విదితంబును నైన భానుసు ।
తుకులమునఁ బార్థివోత్తమునకున్ బ్రభవించినవాఁడ వౌటవీ ।
నులపు రసాయనంబులగునూత్నమృషోక్తుల నీవు దెల్పఁగాఁ ।
దెలియుటఁ జేసి నామనమతిప్రియతాన్వితమయ్యె నీయెడన్ ॥

చ॥ సుకలులుగాక త్వాదృశులు చూచినఁగన్ వనిఁదోళ్ళు గట్టి కా ।
యకసవులన్. మెసంగుచు ఘదాలయవాసము సేయ వెట్టి వా ।
లకపు తపోధనాత్మభవులన్ విరసాత్ములఁ బెండ్లియాడనా ।
ల్లక యొకరాజపుత్త్రిఁ గృతలక్షుఁ బెండిలియాడఁగోరుచున్ ॥

క॥ ఈపగిదిఁ దపమునల్పెడు ।
నాపైఁగృపవూని దివసనాథుఁడు వనుపన్ ।
నాపాలిభాగ్యదేవత ।
వై పొడసూపితివి నీవహస్కరబీజ్యా ॥

ఉ॥ ఓనరలోకనాథతనయోత్తము త్వల్లపితప్రియోక్తులన్ ।
వీనులవిందుగాఁగవిని నిక్కమెఱుంగుటకట్లు వల్కితిన్ ।
గానినినున్ సురూపరతికాంతునిఁ గన్గొనినంతనుండియున్ ।
సూనశరాసనుండలఁచఁజొచ్చెఁజుమీ నిజమిష్టు దెల్పెదన్ ॥

ఉ॥ నీదగుప్రావృషేణ్యనవనీరద సుందరమైన దేహమా ।
చ్ఛాదనఖేలకై వనవసుంధరఁగ్రిమ్మరుటన్ నిరంతర ।
స్వేదపృషత్పరీతమయి చెన్నుదొలంగి భవత్పథశ్రమా ।
వేదకమూచునున్నయది ద్వేషణభీషణ దావపావకా ॥

చ॥ అదెయమృతోపమానమున నావిలమున్ భృశశీతలంబునా ।
నుదకముచేఁ బరిపూర్ణమయి యొప్పుచునొక్కసరోవరంబుతూ ।
ర్పుదెసనునల్పదూరమునఁబొల్చుచునున్నది యందుఁబోయిత ।
త్పదమలినావతారమున స్నాతుఁడవై చనుదెమ్ము హాయిగన్ ॥

శా॥ నేనున్ నీవరుదెంచునప్పటికిటన్ నీరాడి ధౌతోపసం ।
వ్యానంబున్ మొయిఁదాల్చి యుజ్ఝితతపస్యాయాసనై యుండునా ।
పైనన్యోన్యమనోనురాగములు సాఫల్యంబునొందన్ దమిన్ ।
సూనాస్త్రాహవకేళిఁదేలుదమటంచున్ బొల్తివాక్రుచ్చుడున్ ॥

క॥ మాయావర్తనజనిసం ।
స్త్ర్యాయమయిన దండుఁడామెఛందమెఱిఁగియూ ।
రాయని తలయూచుచు న్తని ।
తాయితమగు నెలుఁగునన్ సుదతికిట్లనియెన్ ॥

ఉ॥ చిల్కలకొల్కి యేటికివచించెదవిట్టి సకైతవోక్తులన్ ।
గుల్కమిటారి యిట్టితనుకుంబలుకుల్ లొటతాటకత్తెవై ।
పల్కన నేనునమ్ముదునె పంకరుహాయతపత్రనేత్రినా ।
యల్కకు నీవుభాజనమువై చెడిపోకు మెఱుంగఁజెప్పితిన్ ॥

ఉ॥ వేడియ నీమటకుల్కిటఁజెల్లవు నన్నటుపొగనంపినీ ।
వ్వాడనిఁబాడఁజూచెదు త్వదూహమెఱింగితిఁ బెక్కులేటికి ।
రేడుజగంబులున్ గలసి యిత్తఱినడ్డమువచ్చినన్ నినున్ ।
గూడకపోవనీనుసుమి క్రొన్ననవింటివజీరుసాక్షిగన్ ॥

మ॥ స్మరతీవ్రాశుగవృష్టిలోఁదడిసి సంస్నాతుండనైనాఁడనా ।
సరసీతోయమునందు నేమిటికికన్ స్నానంబొనర్పన్ వలెన్ ।
దరుణీ చేయకతప్పదేని యిదె నీతారుణ్యలావణ్యని ।
ర్ఝరమందిప్పుడె యోలలాడెదను తృష్ణాశాంతియున్ జేకుఱున్ ॥

వ॥ అనిపలుకుచు ననుహ్వాతప్రచండదండధరదండంబులును ప్రదృప్తజనతాతిభయదానశౌండంబులునునగు నిజబాహుదండంబులంబోడివి పట్టందమకించిన నాక్రించును వారించుచుఁబంచపదంబులు వెనుకకరిగి నిలిచి నలుదెసలున్ గలయఁదిలకించి యెందునెవ్వరిఁగానక శుక్రతనయ తనయసహాయతకుఁ దూఱవగచుచుఁ జేయునదిలేక తనమనుగడకదియ తీఱుగడయని నిశ్చయించుకొని యాపాపనిరతుఁ బొరిమాపులఁబరికించుచు మరలనిట్లనియె ॥

చ॥ అమలినమైన చిత్తమున నారసిచూడుము స్వల్పకాలసౌ ।
ఖ్యమునకు నాసఁజెంది పరకాంతలఁగూడి రమించియాపయిన్ ।
శమనునిచేతఁ దండనము చంద్రుఁడుఁదారలునుండునంతకా ।
లమనుభవించుటొప్పునె తలంపవుగాకిది దుర్మదాంధతన్ ॥

ఉ॥ కావరమెత్తినన్నుఁ గనుగానక గమ్మనుబట్టికొంటివీ ।
భావివిపత్తినారయవు బాపురె భార్గవదుర్నివారరు ।

ట్పావకకీలలన్దొరఁగి భస్మమవొదుసుమీ వినాశకా।
లేవిపరీతబుద్ధియనలేదె పురావిదులైన కోవిదుల్ ॥

గీ॥ ఇంచుకయొయిన్గైనేని యీ రేదుజగము।
లోకఁ వ్రేల్మిడి సమయింపనోపుమహిమ।
ఖనియయిన భార్గవునిప్రియతనయనన్ను।
ననితరమ్మనిపిల్వనెవ్వనితరమ్ము॥

ఆ॥ నిజము బ్రతుకునందునీకు రోఁతజనించెఁ।
గాకయిట్టితలఁపునీకొదవునె।
మనఁదలంతువేని మద్ధితంబాలించి।
పొమ్మకొంచుఁబలుక పోలఁతిఁగాంచి॥

శా॥ ఓయష్టాపదగాత్రి భార్గవునికోపోపర్చుధజ్వాలలన్।
గాయంబూడినమాడనీ శమనుఁడాగ్లాతారముల్ దుర్గతిన్।
ద్రోయంజేసినఁజేయనీ యిపుడునీతోఁగూడకేళేఁగఁజూ।
మ్మీయంచున్ స్మరపారవశ్యమునఁబల్మింబట్టి యాయంగనన్॥

సీ॥ కడుఁజూడనింపైన కమలాకరమున లులాయంబుసొచ్చి కలంచినట్లు।
నవశాలలోదూఱిసానాయ్యము నుజేరికాలేయికముదానిఁగతికినట్లు।
నవనవలాడు ప్రసన్నమాలతీవల్లిఁ దుష్టషండము బిట్టు ద్రొక్కినట్లు।
పాలుపైనపులుకాసిపులుఁగుపెంటినిక్రూరదక్షాయ్యముద్ధతిఁదన్నినట్లు
ప్రాంచితతపోనయతినతిప్రయతమైన।
మృదులసూనమువంటినెమ్మేనిదాని।
గరితనిధువనమొనరించి గాసిజేసెఁ।
గజ్జలశిలోచ్చయోన్నతాకారుఁడతఁడు॥

శా॥ ముక్తాహారయు సంగవర్జితయునై మోదక్షార్థమ్మెయైహికా।
సక్తుల్వీడితపించు నద్గురుతనూజన్ గ్రామ్యధర్మస్పృహా।

ద్రిక్తభంముఁడతండు బల్మినయిఁబొందెన్ మొఱ్ఱో మొఱ్ఱోయనన్ ।
యుక్తాయుక్తవివేకశూన్యులుగదా యూహింపఁగామార్దితుల్ ॥

చ॥ సరసవిలోకనంబులును స్వాదుమృదూక్తులు నవ్వులున్బర ।
స్పరముఖచుంబనాదులు విభావములెవ్వియులేక నేత్రపు ।
ష్కరములనుండి యశ్రువులుకాలువలై ప్రవహింపనేడ్చున ।
య్యరజనుగూడ నేవపడడయ్యెను దండుఁడు దుర్మదాంధుఁడై ॥

ఉ॥ ఖండశశాంకమౌళికిఁ జగత్పతికిన్బదభక్తుఁడైన కా ।
వ్యుండిది విన్నచో నలుగునోయనినైననుఁబీతునొందకా ।
దండితవైరి దండుఁడను దండిమగండతిగర్హణీయమౌ ।
దుండగమిట్లుచేసి తనత్రోవనుబోయె హయాధిరూఢుఁడై ॥

వ॥ ఇటు సౌరభేయజగ్ధోజ్ఝితమైన బాలకాష్ఠీలపోలిక నాబాలికామణి పాలసుచేవిడువంబడి జనంగమస్పృష్టంబైన పురోడాశంబు తెఱంగున వానిచే నపవిత్రీకృతంబైనగాత్రంబుతో భూతధాత్రినుండనొల్లక పరలోకయాత్రకుఁ గృతనిశ్చయయై తదాత్వసమాగతయైనయొక నిజభుజిష్యచే దండుండు తనయెడంజేసిన వ్యతిక్రమంబంతయు నిజజనకునకుఁ జెప్పుఁబుచ్చి యచ్చటివిమగులచే సొదపేర్చికొని యందగ్నిరవులుకొల్పి జ్వలజ్జ్వలనజాజ్వల్యమానచిత్యాసమారోహణంబొనర్చి యూర్ధ్వగతికిన్ బోయె నటభృగునందనుండును సందేశహారిణిచేఁ దనయుదంతంబంతయు విని సటాసమాకర్షణామర్షణంబైన యెనుంగులగొంగ తెఱంగునఁ గ్రోధమ ర్నిరీక్షుండై యచ్చటికివచ్చి వీతిహోత్రసాత్కృతగాత్రయై ప్రియపుత్రి లోకాంతరయాత్ర చేయుటయెఱిఁగి యగ్గరితగుణంబులుగ్గడించి కొంత తడవు పనవిపనవితనకుఁ దానయుపశమించుకొని తనమృతసంజీవనీవిద్యచేఁ బునర్జీవితఁ జేయంగలిగియు నాయువు మానవతీవతంసంబగుటఁ జీవింపనొల్లదని నిశ్చయించి నివృత్తతద్వ్యవసాయుండై యాదండుని దుండ

గమున్దలంచి సంవర్తనమయచిత్రభానుండునుంబోలె మండిపడుచుఁదద్దం
డరాజవంతంబగు మధుమతంబుచుట్టునుఁ ద్వాదశయోజనంబులపొడవు
గ నెడప యేడహోరాత్రంబులు మట్టివానగురియునట్లును దండుండు
సబంధుభృత్యామాత్యపరివారంబుగా నేలపాలగునట్లును శపించి నిజే
చ్ఛంబోయిననాయవితథవచనుని వచనంబుచొప్పున సర్వంబును నట్లయ
య్యెనాటంగోలెనిది దూరీకృతజనసంచారంబగు కాంతారంబై యాదం
డుని పేరఁ దండకంబనంబరఁగుచున్నయది యిది ఫలభారవినమ్రదధిఫలా
మ్రపనసాదిఫలితతరువరపరివృతంబును మధురమధురసానేకసరఃప్రస్రవ
ణాది జలాశయసమృద్ధంబునగుట నస్మదుద్యమంబున కెంతయుఁ దగియు
న్నయదియని మత్స్వాంతంబునకుఁదోఁచుచున్నయది త్వదాశయంబెట్టి
దియొ తేటపరపుమన నత్తారకుండు శూరపద్మంజూచి ॥

ఉ॥ అగ్రియనీకునెద్దిహితమయ్యదినాకును నిష్టమౌఁగదా।
వ్యగ్రతలేక దీక్షితులమై యఖిలద్రుహిణాండనిగ్రహా।
నుగ్రహదక్షుఁడున్మునిమనోజలజాతవికర్తనుండునా।
నుగ్రునిఁగూర్చి ఘోరతపమొప్పఁగఁజేయుదమివ్వనంబునన్॥

గీ॥ అనుచుఁదారకుఁడునుఁదనయభ్యుపగమ।
మునుదెలిపెనంత నప్పుణ్యజనవరేణ్యు।
లాద్యతాపసవర్తనులై తపంబు।
సేయఁదొరకొని రధికనైష్ఠికతదనర॥

గీ॥ ధారణీవనీచభూమిభృత్సముదితయయి।
వెలసియున్నతవంశజాతులకునైన।
నడుగుఁజేరెదర్శింపవీల్పడనిచక్ర।
వర్తినినొకానొకమహాస్రవంతిఁజేరి॥

శా॥ క్రవ్యాదాభిజనోరువారినిధిరాకాయామినీనాయకుల్।
భవ్యద్యోతటినీపయోమధురతాపాణింధమంబై సదా।

నావ్యంబై తనరారుతజ్జలమునన్ సంస్నాతులై యిర్వురున్ ।
నవ్యక్షౌమములంతరీయముగ మేనన్దాల్చి సోత్సాహులై ॥

శా॥ సద్యోజాతపురోగమంబులగు పంచబ్రహ్మమంత్రంబులన్ ।
బ్రద్యోతంబుగ శుద్ధభస్మమయతిర్యక్పుండ్రముల్మేనశో ।
భాఢ్యంబొప్ప తముగాఁ ధరించి శశిదభ్రాభాస రుద్రాక్షావృతిన్ ।
ఖద్యోతుం డనుచుంబోలెఁ బొల్చిరి దివౌకశ్శత్రులయ్యిర్వురున్ ॥

గీ॥ ఉత్తమబ్రహ్మవర్చసముట్టిపడఁగ ।
బడగదాలుపుకోలము మేపరిహుమాయి ।
మాయి వేలుపునకును విస్మయ మొదవఁగఁ ।
దవగతులు వారొనర్చిరిద్దఱునుఁ దపము ॥

క॥ ఫలపూరజామికంటక ।
ఫలసహకారామ్రపుష్పఫలపతితములొ ।
ఫలములు మెసవుచునల్పిరి ।
ఫలలిప్సద్దనుజపుణ్యఫలములు తపమున్ ॥

క॥ ఆకులత లేకయాసుర ।
సాకులతలునీప్రియాత్మజాతులువగలో ।
నాకులునమలుచు నిల్చిరి ।
నాకులువిని మెచ్చఁగొన్నినాళ్ళు నియతులై ॥

మ॥ ప్రమదంబొప్పఁ బలాశరక్షమునకై ప్రాంచత్తపంబూనుటన్ ।
దమకావించుపలాశభక్షణమకృత్యంబంచు స్వీయాంతరం ।
గములందారసినిశ్చయించుకొనుటన్గాఁబోలుఁ ధీమంతుల ।
య్యమలాకుల్తినుటజ్జగించి జలమాత్రాహారులైర త్తఱిన్ ॥

మ॥ కినరొక్కింతయు లేక చిత్తములలోఁ గీలాలపానంబురా ।
తసకృత్యంబిదిసీతపశ్చరులకున్ శస్తంబుగాదంచుఁదా ।

వసులాకశ్యపపుత్రులిర్వురును సంభావించి యోహామే మొసం ।
తసమొప్పన్నిగ్రదావిరయ్య దనసర్ణఃపానముఁ జైతముఁ ॥

మ॥ అమలాంబుగ్రసనంబునున్విడిచి వాయ్వాహారులై కొన్నినా ।
ళ్ళనుగద్వేషణులుండి ముందుతమసేయంబోవునుర్వ్యారమై ।
నములన్ని మహామెల్లచేతనులకుఁ వ్యక్తంబుగాఁదెల్పుచం ।
దనుఁ బొల్చిరి ఘోరమాతపముపోద్యన్నిష్ఠఁగావించుచోఁ ॥

మ॥ అవిముక్తాన్నాని దినక్రమంబున విసృష్టాహారులై నిర్జిత ।
క్షుత్కదన్యాదికులై యెసఁగుచుం బరంజ్యోతిస్స్వరూపుఁ శివుఁ
హృదయాబ్జ మునుకల్పి భక్త్యతిశయ బేపారసేవింపుచుఁ ।
నదివన్యంబున సమస్త మున్మతిశుంభత్తన్మయావస్థులై ॥

గీ॥ దాంతులాకశ్యపాత్మజుల్ తగుభజించు ।
దైవతమువలెఁదామును స్థాణుభావ ।
మందియాసారసీతవాతాతపాది ।
కముననుఁజలింపకుండిరుద్గాధనియతి ॥

శా॥ ప్రావృట్కాలములందు నాకబయలన్నాంచత్పిర్తఁ నిల్చిన ।
ద్భావంబొప్పనిదాఘవేళఁజ్వలత్పంచాగ్నిమధ్యంబునం ।
దావాసంబొనరించి సీతునిలులందాకంఠపూర్ణోదకం ।
బౌవారాశయమందు నిల్చియుఁడపస్యఁ సల్పిరప్పూరుషుల్ ॥

గీ॥ ఇట్లతివ్యథకోర్చి పెక్కేండ్లు ఘోర ।
తపముసల్పిన కశ్యపాత్మజులయందు ।
ప్రయతనిజపాదపద్మనిర్వ్యాజభక్తి ।
భరులయందనిదంపూర్వకరుణుఁడగుచు ॥

సీ॥ వాఁడువీఁడనకయ న్యాజభక్తిఁభజించుపులకసునై ననుబ్రోచు వాఁడు
వాడుబుడకీర్తనమోవనొనర్చుతుష్టఫలప్రార్థనలకు నగపడని వాఁడు

వాఁడు చేరకలయావసరమందైన లేనగవుచేనొప్పు నెమ్మొగమువాఁడు
వాడు కనత్ప్రతిస్పంద్వమా ముమ్మొనవాలుకరమ్మునఁ గ్రాలువాఁడు
నాఁడు నేఁడును నొకరూపచందమగురూపు ।
వాఁడువీడుతిగనుగూల్చివైచినట్టి ।
వాఁడుతూఁడుదిండిహుమాయి లేఁడనుసిరి ।
జోడుగూడుదోంయు మెచ్చుచొప్పువాఁడు ॥

సీ॥ పృథుతరవేధోండపితరసహస్రముల్ కుక్షిఁదాల్చిన జగద్రక్షకుఁడు ।
స్థావరజంగమాత్మకమైన జగమెల్లనిండియున్నట్టిసఖండమూర్తి ।
యచ్యుతబ్రహ్మాదులందఱికంటెను నాధ్యుఁడైయొప్పు మహామహుండు
పుణ్యమహర్షి హృత్పుండరీకమ్ములందు వెలుఁగుచుండు నద్భుతపుఁ
దైత్యులాద్యిత్యులనెడు భేదంబు లేక । [జ్యోతి ।
నూనభక్తి భజించు నెవ్వానినైన ।
సాఁకఁజేత్తువహించిన సర్వసముఁడు ।
త్రినయనుఁడు వారికప్పుడైంద్రియకుఁడయ్యె ॥
గీ॥ ఎదుటఁబ్రత్యక్షమైన సర్వేశ్వరునకు ।
నధికతరభక్తికంటకితాంగులగుచు ।
వడివడినెక సాష్టాంగవందనంబు ।
లాచరించి యిట్లునుతించిరప్పరముని ॥

దండకము॥ వందే శ్రియాభాషయాచాపరాభిస్సవర్గ్యాంగనాభిస్సనాశేవ్యమానాం పరాం దేవతామీశ్వరీమాదిశక్తిం ప్రభూతేన వారాద్రేనపాణౌ కృతాం లాలయంతం దయాధిక్యస్నిగ్ధే జపేన స్మితేనాదరప్రేషితైర్భాషితైశ్చాపి శౌపాయుధగాత్రవర్ణభిర్వశిష్ఠాత్రివల్మీకభూగాత్రమాగస్త్యశాండిల్యమాండవ్యజాబాలిగార్గ్యాదిభిస్తూయమానం తత్రియావాఙ్మరుద్భావచాభిర్హృషీకేశ లోకేశ నాకేశముఖ్యాసురాణావపిక్షేయమా

హాత్మ్యమీశం భవంతం పశూనాంపతే తత్వతో బోద్ధుమజ్ఞః కథంస్యాం నమార్గోహమధ్యాత్మవిద్యారహస్యార్థసంవేదిభి ర్యోగిభిర్లోపర్యుద్ధస్స్వగ్నా కాశసూర్యేందు యజ్వాత్మరూపాష్టమూర్తిం భవంతంవినా నేతరత్కించిదస్తీతి సర్వాత్మనాభావ్య సేవ్యాం జగద్వర్గసర్గస్థితిధ్వంసకృత్యాని సంకల్పమాత్రైః నిష్పాదితేభ్యో భవానీపతే బాలశీతాంశుమౌళే భవత్పాదపంకేరుహోపాసనైకాగ్రచిత్తం మృకండాత్మజం బాధమానే కృతాంతే తదా శార్ఙ్గధరదేవాబ్జభూభ్యర్థ్యమానం రక్షో....బికానాయకేత్యుచ్చకైః ప్రార్థనాం కుర్వతష్షోడశాబ్దస్య బాలస్య తస్యాగ్రతస్సంప్రభూయాంఘ్రిసంతాడనేనాంతకంతం పరాసుం విధాయానుకంపాతిరేకాదరక్షద్భవాంస్త్వ కుమారం పురాదైవతైర్దానవై ర్మథ్యమానాత్పయోవారిధేరుత్థితేనాతిభీదాయినా కాలకూటేన సంవర్తకాలీన వైశ్వానరేణేవ సంపీడితానాం భవద్రక్షణం వా భజతాం తన్మహోపాగ్రవాద్ధావతాం చక్రహస్తాదికానాం పురస్సన్నిధాయాసురేభ్యో సురేభ్యో వితీర్యాభయంతం యథాజాంబవం పంచశాఖేన సంగృహ్య కింతేన్యథా స్తవ్యంఖలుత్వాన్నమోన్యో నకోపీశ్వరోహ్యస్తి దేవాదిదేవం జగన్నాటకే సూత్రధారం శరచ్చంద్రకాకుందమందారమందాకినీహారనీహారహీరేందుపాటీరవాగ్భామినీకాశనీకాశగాత్రం బలీవర్దపత్రం సదాత్వాం ప్రపద్యే సమాగాంసి విస్మృత్య మాంపాహి మాంపాహి సర్వేశ సంరక్షితావా పినాకిన్ పినాకిన్ నమచ్ఛక్తవర్గైకపాలిన్ కపాలిన్ ద్విషల్లోకమర్దిన్ కపర్దిన్ నమస్తే నమస్తే నమః॥

క॥ వాహాయిత మాహాహిత।
బాహాధృతవరపినాకభవ్యమహీభృ।
ద్దేహాసితదేహాజిత।
మోహాయతసూహానికు మొర్కెదనీశా॥

క॥ కాళీధవ కేళీభవ।
నాళీనివసద్భవాప్రియావిహితమహా।
హాళీభటపాళీస్ఫుట।
నాళీకవితతి విరోచనా సర్వేశా॥

క॥ మాయాకర కాయానిర।
పాయాదారరాయవరతపస్విముముక్షు।
ధ్యేయాయవిజేయాకవి।
గేయాపరమాయటంచుఁ గేల్మోడ్చుశివా॥

క॥ చరణానత శరణాధృత।
మరణాసితకిరణశకలమాళీపరమే।
శ్వరశరణీకృతధరణీ।
ధరతరణీంద్వగ్నినయన దండముదేవా॥

మ॥ అనుచంద్రబస్తుతిసేయుచుండిన నిలింపారాతియుగ్మంబునం।
దనుకంపారససిచ్యమానహృదయుండై చంద్రిమశ్శేఖరుం।
డనునో బాలకులార మెచ్చితిఁ భవత్ప్రాంచత్తపోనిష్ఠకీ।
రనుమానింపక వేఁడుఁడిచ్చెదనభీష్టార్థంబులన్ నావుడున్॥

గీ॥ అమృతసమధికమాధుర్యమవ్వచనము।
చెవిఁబడనని యత్తాపరిచ్ఛేద్యమైన।
వింతసంతసమంది ప్రావేల్పుకోమరు।
లిట్లనిరిభక్తినప్పరమేశ్వరునకు॥

మ॥ అవనివ్యోమకృపీటయోనియజమానాదిత్యనీహారరు।
క్పవమానాంబుమయాష్టమూర్తివగునీకంటెన్ బృథక్కేపదా।
ర్థవిశేషంబును లేకయుండుటనె సర్వంఖల్విదంబ్రహ్మయం।
చువదించున్ గద యెల్లప్రాఁజదువులున్ శుభ్రాంశుచూడామణీ॥

శా॥ దీక్షంబూని సృజింపనాత్మభువునాదేశించి లోకంబులన్ ।
రక్షింపంగతి వేల్పునుంచి జగమున్నాథంబు గావింపను ।
ఉగ్రాక్షున్ రుద్రుని బంచి యవ్వటగలయ్యాదేశముల్ దీర్చుచో ।
సాక్షీభూతుఁడవై వసింతువుకదా స్వర్గాపవర్గప్రదా ॥

మ॥ క్షితినాకాది సమస్తలోకములు నిశ్శేషంబుగా ద్రుంగియ ।
చ్యుతుఁడున్ ధాతయు నైతమున్ గెడసియెచ్చోఁ జూడినన్ గాధనీ ।
లతమోవ్యాప్తిమెయి మహాప్రళయకాలంబప్డు జ్యోతిర్మయా ।
కృశవై యొక్కఁడవీవెయుందువుకదా కీనాశనిర్వాపణా ॥

మ॥ వపురాయాసము లెక్కసేయకరిషడ్వర్గామలం గెల్చి బా ।
ధపరిత్యక్తసమస్తసంగులయి నిష్ఠన్ సర్వదాకానలన్ ।
దపముల్సల్పుచునుండు తాపసులకైనన్ బొందఁగారానినీ ।
కృపకుంబాత్రులమైనమాకిఁక ద్రిలోకిన్ దుర్లభంబుండునే ॥

గీ॥ అఖిలజగదంతరాత్మవై నట్టినీకుఁ ।
దెలియరానిరహస్యముల్ కలవె యెంచఁ ।
బ్రాణుల మనోగతంబు లేర్పడ నెఱుంగు ।
టెంతటిదినీకు సకలలోకైకనాథ ॥

వ॥ అని కేలుగవలు దోయిలించి ఫాలభాగంబునన్ గీలించి పలుకు
చున్న రాత్రించరబాలకులకు శూలధరుండిట్లనియె ॥

ఉ॥ మీకలఁపెనెఱింగితి సమీకములందవిజేయులై రమా ।
నేతృపురందరామలగు నిర్జరులన్ బవరంబులన్ బరా
భూతులఁజేసి యాశరులఁబ్రోచుచు రాజ్యముసేయఁగోరియా ।
గీఁపించుచుంటిరి గరిష్ఠవపుర్వ్యథకోర్చి మీరిటన్ ॥

క॥ అని తారకుఁగనుఁగొని ముని ।
వశితాలఘుపరిశుద్ధపర్షిహ్లాదయసం ।

జనితానుగ్రహుఁడైన ।
లెఱనితాంతప్రీతిదానికృతివాకఱలనన్ ॥

చ॥ సుడియడిదంబుపూని నెఱజోదుపసిండిమడుంగుఁదాల్పబి ।
ట్టడరియెదిర్చె నేనియును నాహవరంగములందునీకుఁగె ।
ల్పిడియెపొసంగు నెల్లరుఁబలీయని మెచ్చఁగనోలచెంగనా ।
ల్గొడరుట గల్గదెన్నఁడుఁదుష్టిమెయిన్ భవదిష్టిదీర్చితిన్ ॥

క॥ ఈయున్న త్రిదశవరదై ।
తేయాదులలోన నెట్టిదిట్టకు నేది ।
వ్యాయుధమునకు నసాధ్యుఁడ ।
వైయొప్పెదవీవు సంగరాంగణములలోన్ ॥

గీ॥ అనిపలికి శూరపద్మారి యాస్యమునకుఁ ।
జూడిఱమరలించి తారకాసురవరేణ్యుఁ ।
డలరివినుచుండ నిట్లనియానతిచ్చె ।
సేవకశివంకరుఁడిందుశేఖరుండు ॥

చ॥ పగఱఁచరంబులంగెలిచి ప జులుదెచ్చుచు నీనిదేశమున్ ।
మిగులకయాజఘృజుఁడు నికఱఁపుటాదృతిఁగొల్చుచుండుటన్ ।
దిగులు విపక్షవీరులకుఁ ధృష్ణుతయాప్తులకుఁబొసంగవా ।
యిగఁబదివేలయేఁడ్లవనియేలుము రాక్షసచక్రవర్తివై ॥

వ॥ అనిశూరపద్మతారకులకభీష్టవరంబులిచ్చి యైంద్రంబును వారుణంబును నాగ్నేయంబునుఁ గౌబేరంబును యామ్యంబునుఁ బైశాచంబును నాసురంబునుఁ గారుడంబునుఁ బ్రహ్మశిరంబును వైష్ణవంబును సమ్మోహనంబునుఁ బ్రహ్మాస్త్రంబునుఁ బాశుపతంబును మున్నగాఁగల

దివ్యాస్త్రంబులెల్ల సప్రయోగోపసంహారాదికంబుగాననుగ్రహించి యం
తకాంతకుండంతర్ధానంబునొందెనంత ॥

మ॥ ఫణిరాడ్భూషణుచేతనిట్లు వరలాభంబంది ప్రాంచద్వియ।
న్మణికోటిద్యుతిమైనయయ్యురగరాణ్మంజీరురూపంబును।
క్షణమున్ జిత్తములన్ దలంచుకొని సాశ్చర్యాత్ములౌ చాశరా।
గ్రణులావాసయియాసులై వెడలిరుగ్రంబౌవవీవర్తనిన్ ॥

మ॥ ప్రణమద్విష్ణువిరించనాదిదివిషద్వర్గాయ భర్గాయ శ్రో।
భనవాహీకృతపర్వతోన్నతమహాభద్రాయ రుద్రాయ తా।
డనసంత్యాజితభూర్యహంయుయమరాడ్గర్వాయ శర్వాయ వం।
దనలక్ష్మీయమటంచు నీశునకుఁజోతల్ పెక్కుఁ గావింపుచున్ ॥

క॥ కృతలక్షణులయ్యిరువురు।
నతిమాత్రస్యదములైన యానములొప్పన్।
గతిపయదినములకాత్మ।
ప్రతిశ్రయంబులకుఁజనిరి పరమప్రీతిన్ ॥

వ॥ ఇటుచెప్పిన సూతునిఁ దదనంతరోదంతంబేమని మునులు
ప్రశ్నించుటయు ॥

* శవర్ణగుణితక్రమచంపకమాల. *

చ॥ శరనిశితూణశాసితనృశంసజలంధరదానవా శివం।
కర సుచరిత్ర శీతకరఖండవిభూషితమస్తశుక్రఖా।
స్ఫుర శశినేత్ర శూలవిలసద్భునదక్షిణహస్తసేవకో।
త్కరభవనాజిరస్థితసుధాభుగిలారుహశైలకన్యకా।
పరివృఢశోషితప్రణతపాప్మక శౌనకశస్తశంకరా ॥

* మాలినీవృత్తము. *

నిగమనుతచరిత్రా నిత్యపావిత్ర్యగాత్రా।
జగదుదయనిదానా సాధురక్షైకతానా।
ప్రగుణగుణసమాజా భానుమత్కోటితేజా।
గగనధికురపాశా కాశికాపూర్నివేశా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు చతుర్థా
శ్వాసము.

---



శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## పంచమాశ్వాసము.

క॥ ఓంకారవనమయూరీ।
గాంకాదిత కేశభారయహిమయరత్నా।
లంకారభవవ్యాధ్యగ।
దంకారమహాశ్మశానదయితాగారా॥

వ॥ అవధరింపుము శౌనకాదిమహర్షులకు రోమహర్షణి యిట్లని చెప్పందొడంగె॥

చ॥ అడుగులవ్రేఁగునన్ బుడమియంతయుఁ గ్రక్కదలంగ శూరప।
ద్ముఁడు ననుజుండునున్ జననత్రోవనెవచ్చుచునుంటఁగోటికాం।
డ్లెడవుఁజూచి వైభవమున నేలిక చెంతకునేగి మ్రొక్కి మా।
రొడయులువచ్చుచుండిరసురోత్తమ యిప్డని విన్నవించుడున్॥

ఉ॥ అప్పటిదైన ప్రీత్యతిశయంబదియెట్టిదొకాని జానుగుం।
దొప్పలలో సుధారసముతో సరిదైసారనయ్యెదంతమున్।
జెప్పిన స్వాపసర్పులకు శ్రీఘ్రమెహేమమహార్ఘరత్నముల్।
కుప్పలువోసియిచ్చెఁ గయికొండని యయ్యసురేంద్రుఁడర్మిలిన్॥

శా॥ అంతర్వంశికులైన సావిమలచే నవ్వార్తపుత్ర్యాది శు।
ద్ధాంతస్త్రీలకుఁ జెప్పిపుద్వి పుటభేదంబెల్లఁగై సేయఁగా।

సంతోసంబునఁ జేటకప్రతతి కాజ్ఞాపించి మన్నీలుసా ।
మంతుల్ పౌరులు ప్రాడ్వివాకులుమహామాత్రాదులున్ వెంటరాన్॥

క॥ స్వదమొప్పఁగఁ దౌహిత్రుల ।
కెమగుఁగఁ జననకుఁ మారులెంతయుభక్తిన్ ।
బసయుఁగళమునకు సాష్టాం ।
గదండవత్ప్రణతిశతము గావించిరొగిన్ ॥

గీ॥ అసురనాథుండు భావిమూర్ధాభిషేక ।
సూచకముగాగ నానందలోచనాంబు ।
ధారలఁదదీయమూర్ధముల్ తడిపివారి ।
లేవనెత్తి ఒగిఁ గౌఁగిలించుకొనియె॥

శా॥ ఆమాతామహుఁడాజ్ఞసేయుటయు మాయాదానవీపుత్రులెం ।
తేమోదంబలరన్ నిషాదిసముపానీతంబునంచస్ఫురి ।
స్తోమాన్వితమునైన శింధురముపై సొంపారనారూఢులై ।
వ్యోమంబెల్లఁధ్వనింపమాగధులు సాహాహానాదముల్ సేయఁగన్ ॥

ఆ॥ రుచ్యఘోటకాధి రూఢాసురేంద్రాది ।
దానవానుగమ్యమానులగుచు ।
వేడ్కఁబట్టణప్రవేశంబొనర్చిరా ।
శూరపద్మఁడల్లతారకుఁడును ॥

చ॥ జననుతిపాత్రులైన సురసాతనయుల్ చనుదెంచుచున్నవా ।
రనివిని పౌరులెల్లరును నాశిసువృద్ధముఁ దామొనర్చుచుం ।
డివపములన్నియున్విడిచి డిగ్గననేగివిశంకటప్రతో ।
ఝిలిలిదిచూచుచుండిరమలీమసవృత్తుల నకుమారులన్ ॥

ఉ॥ తేజమెసంగరథ్యనరుదెంచుచునున్న సురూపమారులన్ ।
రాజసమాపలన్నదముఁరాగ మెలగ్నఁగఁగాంచుచున్ముఖాం ।

భోజములందు మందహాసముల్ వొలయన్ బరువంపుఁ గ్రొవ్విరుల్
లాజలు నక్షతల్పురవిలాసినులెల్లరుఁ జల్లిరింపునన్ ॥

ఉ॥ కాయము వంపనైన నవకాశము లేక యొకళ్ళొకళ్ళఁ బో
ద్రోయుచు నేగుపెన్దుటుముతోఁ గరిపైఁ జనునక్కిశోరులన్।
బ్రాయపు రాచవంగడపుఁ బైదలులున్నతసౌధరాజివా।
తాయనరోకభాజ్నయనలై తిలకించుచునుండిరత్తరిన్ ॥

ఉ॥ వీథులనిండఁ గ్రిక్కిఱిసి వేలకొలందిజనంబు వెంటరా।
నాదితిజార్భకోత్తములు హస్తినిడిగ్గినగళ్ళుపొద్దిరా।
మోదమెలర్పఁ గ్రొన్ననలుముత్తియముల్ దిగదుద్దువెట్టిము।
త్తైమవపిందుకప్పుర(ఫ)టూరతులర్మిలిమై నొసంగఁగన్ ॥

ఉ॥ అల్పులు గొప్పవారుననకందఱితోఁ దగుమాటలాడిపీ।
డాఱల్పవినీతియొప్పననుఁగుంజనయిత్రికి నవ్వరున్ నతు।
ల్సల్పికృపాళురాసతులొసంగిన దీవనలందివిక్రమా।
కల్పులు రాజపుత్రులు సుఖస్థితినుండిరి స్వాలయంబులన్ ॥

శా॥ దైతేయాంతకముఖ్యులౌ సురలచేతన్ బెక్కుఘోరాభిసం।
పాతక్షోణులలోఁ బరాభవమె ప్రాప్తంబౌటచేఁ భీతులై।
పాతాళంబునఁ డాఁగియుండిన నిలింపద్వేషులవ్వీరులన్।
ఖ్యాతస్థాములఁ జూడవచ్చిరెదలన్ గౌతూహలంబొప్పఁగన్ ॥

చ॥ క్షితిధరగహ్వరాదులవసించుచు సందులఁ గొందులన్ దిరో।
హితులయియున్న రాత్రిచరులెల్లరుఁ దారకశూరపమ్మలీ।
ప్సితవరలాభముల్ శివునిచేఁ గొనివచ్చుటెఱింగి తామిఁకం।
బ్రతికితిమంచు నచ్చటికి వచ్చిరి కౌతుకముప్పతిల్లఁగన్ ॥

క॥ వచ్చిన దితిసుతజాతికి।
హెచ్చగుసామర్థ్యవిభవమేర్పడనభయం।

బిచ్చి సహబాంధవంబుగ।
నచ్చోటనె వసింపఁజేసిరవ్వీరవరుల్॥

గీ॥ నూతనసమాగతములైనయాతుధాన।
నియుతములచేత నెల్లెడల్ నిండియప్పు।
డధికపరిణాహమయ్యును నప్పురంబు।
చాలసంబాధమై చోటుచాలకుండె॥

క॥ మయుఁడసురతతివనసుమన।
మయుఁడద్భుతశిల్పశక్తిమయుఁడు విరహితా।
మయుఁడు తులితకాంచనగో।
మయుఁడపుడమరించె నక్కుమారులఁజూడన్॥

గీ॥ అమ్మయుని వారు ప్రీతిమైనర్హరీతి।
గారవించుడునప్పుడాశూరవద్మ।
తారకులతోడ నసురవర్ధకివరేణ్యుఁ।
డిట్లనివచించె సమ్మోదమెసకమెసఁగ॥

క॥ పరమబ్రహ్మర్షులకును।
దరిసెనమీయని జగన్నిదానునిఁబరమే।
శ్వరుమృత్యుంజయుఁగనుఁగొం।
టిరి మీయద్భుతతపఃపటిమమెట్టిదియో॥

చ॥ వనరుహనాభముఖ్యులగు వైరులచేఁ బలుతేపలాహవా।
వనులఁబరాభవింపఁబడివందురుచున్న నిశాచరాన్వయం।
బునఖిలమర్త్యభల్ తొలఁదిప్రోచుటకై పనిఁబూనియుద్భవిం।
చినయవతారమూర్తులని చెప్పెడియొప్పిమిమున్ వచించుచోన్॥

ఉ॥ ఖండనభూములన్ గెలిచి పాఱఁగఁదోలుటఁజేసి జన్నఁపుం।
దిండులఁద్రిట్టుచున్ వెఱపుదీఱిదిప్రోచెడు దిక్కులేక పె।

న్గొండలఁగొండులందొదిఁగికుందుచుఁ గాలముఁ ద్రుచ్చువారు మీ।
యండకుఁ జేరియిష్టభయమ్మైల వెలిఁగ్రుమ్మరసాఁగిరగ్రసపుల్ ॥

క॥ మిముఁజేరి బ్రతుకవచ్చిన।
యమరారికుటుంబసంచయములకునర్యం।
తమునిలుకట్టమై యీ నగ।
రము చాలక యున్న యది స్థిరంపుటునికికిన్ ॥

ఉ॥ ఉత్తము లెల్లనౌననమహాన్నతి రాజ్యము సేయనున్న మీ।
క్రొత్తమహాప్రభుత్వమునకున్ దగునట్లొక నవ్యమౌ మహా।
పత్తనముం స్వశిల్పకృతిపాటవ మెల్లరు మెచ్చఁగట్టి మీ।
కిత్తు ననుగ్రహాతిశయ మేర్పడ మీరలనుజ్ఞ యిచ్చినన్ ॥

గీ॥ అనినవిని యాపలుకులకు నాత్మనలరి।
శూరపద్ముఁడు తారకాసురుఁడునతని।
మెచ్చి పురనిర్మితికనుజ్ఞ యిచ్చి వీడు।
కొలుపుటయు శెల్వుఁగొని యాతఁ డెలమినరిగి ॥

ఉ॥ ఇంద్రపురస్సురుల్ త్రిదశులెల్లరు విస్మయమందివిశ్వస్రు।
ట్సాంద్రకలాకలాపగరుడధ్వజులుం డెదు వీండ్లకైనవ।
చ్చాంద్రపదీని మ్రోలననుచుం వినుతించెడునట్లు పీఠమౌ।
హేంద్రపురంబనంగ నొకయింపగుప్రోలురచించె నేర్పునన్ ॥

వ॥ మఱియు నాప్రోలు తమయేలికల పోలికలమీఁది జగంబులపై
బాడి వెడలనున్నది యోయనునట్లు చుక్కల తెరువుతోనొరయు చక్కని
పె[illegible]తనంపుటుప్పరిగెలును బ్రాతివేశికులకు నొండొరుల సంలాపంబు
[illegible]బడపలనుపడసిని విశాలతరోపనిష్కరంబులును వాసనాది దివిజ
భవనంబులకంటె నియుతగుణమంజులతావిభవంబులగు నంజవనంబులు
ను [illegible]కుఁ జూపయు స్వాప లేపంబులును మెఱపించు నాపణవీథులునుఁ

జేజేలరాయనికి వైజయంతాదులపై నవహేలనంబుగలిగించుచుఁ జిత్రా
తిచిత్రంబును సుందరాతిసుందరంబునుఁ బశ్యజ్జనలోచనాసేచనకంబును
నగు రాచనగరును నవమణిమయస్థూణాపటలకుడ్యద్వారాదికంబై విజన
ప్రదేశంబు జనాకీర్ణముగనుఁ జనాకీర్ణదేశంబు విజనదేశంబుగను సజలప్ర
దేశంబు నిర్జలంబుగను నిర్జలదేశంబు సజలంబుగను ద్వారభిత్త్యాదిరహి
తస్థలంబు సద్వారభిత్త్యాదికంబుగను సద్వారభిత్త్యాదిప్రదేశంబు తద్ర
హితస్థలంబుగనుఁ జూపఱభ్రమింపఁజేయు రాజాస్థానమంటపంబులును
నందన చైత్రరధంబులం బరిహసించు నాక్రీడంబులునుఁ గుముదేందీవరకో
కనదకల్హారహల్లకపుండరీకాది షండమండితంబులై కారండవరధాంగా
హ్వయాది బహుజలవిహంగమసహస్రవాసితబధిరీకృతాశావారంబులై
యలరారు కాసారంబులును ననేకప్రతిభయశతఘ్నికాశతవితతాట్టాలక
శరణంబగు నభ్రంకషవరణంబునుం గలిగి నీరుతిట్టయొయిట్టలఁవుఁదవంత్రిగా
ద్వాదశయోజనారోహంబును నంతియపరిణాహంబునుం గల మహానగ
రంబొకండు నిజశిల్పవిద్యాపారీణత్వంబు తేటపడునట్లు మధ్యేకూపారం
బుననొక మహాంతరీపంబున నిర్మించి యయ్యసురేంద్రుని నర్హపరివా
రంబుతో నటకుం దోడ్కొనిచని యన్నగరంబుం జూపిసమర్పించిన॥

చ॥ అమరులతోడి యీసుమయి నంతకు మున్నమరేంద్రులచ్చిమా।
త్రమె హరియించి తెచ్చి కొనఁ దారకుతోఁ జననున్నక్రవ్యభు।
క్సమితికి నప్పుడమ్మఘవుకన్నులు వేయియుఁ గూడఁ దెచ్చికొం।
దమనుతలంపులుప్పతిలెఁ దత్పురివింతల నెల్లఁ గాంచుచోన్॥

గీ॥ అన్నగరివింత చెల్వొనకచ్చెరువడు।
చీక్షణమహోత్సవంబుగ నెల్లయెడలు।
గాంచి యయ్యామినీచర కారువరుని।
శిల్పశక్తికి మిగుల మెచ్చిరి మనముల॥

ఉ॥ చూపఱకున్ భ్రమముం గొలుపు సోద్దపు మేడలమీఁద రేపులున్ ।
మాపులునుండు సంపదసమానులు సైతముఁ దత్పురోరుఘం।
టాపథపార్శ్వనిర్మితపృథక్ప్రియదర్శనసౌధపంక్తులన్ ।
రాపడి చూచుచుందురు స్థిరంబగు నివ్వెఱపాటెలర్పఁగన్ ॥

శా॥ ఆవెన్కన్ రజనీచరేశ్వరుఁడు నెయ్యంబొప్ప నా శిల్పవి।
ద్యావిద్వద్వరు వెంటఁ దోడ్కొని నిజస్థానీయముం జేరి త।
త్ప్రావీణ్యంబల తారకాసురునకుం దచ్ఛ్రపద్మాదులౌ।
దేవద్వేషణజాతిముఖ్యులకునున్ దెల్పెన్ బ్రమోదంబునన్ ॥

చ॥ వినిమయునిన్ గృతాదరణవిన్న నిజాంచితశిల్పచాతురీ।
విని మయుఁ దారకప్రభృతిపేరులు తద్దయుఁ గౌరవించి వ।
ల్లనియతఁ డెంత చెప్పిన ననర్ఘపుఁ గానుకలొసఁగి రాతఁడున్ ।
దనియ నొసంగెఁ బేదలకుఁ దన్మణిభూషణచేలకాదులన్ ॥

ఉ॥ తారకుఁడున్ దదగ్రజుఁడుఁ దాతయుఁ జాలఁగ వేఁడుకొంటకా।
యూరనె కొన్నినాళ్ళు తగనుండి తదాదృతికాత్మ మెచ్చిమీ।
కోరినయప్డు వత్తు నొసఁగుండిఁక నాకు ననుజ్ఞ యంచున।
వ్వీరకులప్రబర్హులను వీడ్కొని యేగె మయుండు స్వైరితన్ ॥

చ॥ ప్రమదమయాత్ము నమ్మయునిఁ బంపినపిమ్మట రాజ్యపాలన।
త్క్రములనవీనయా వనవికాసులమన్కలఁ జూచి యాత్మలో।
నిముడనిమోదమొప్ప నసురేంద్రుఁడు నూతనపట్టణప్రవే।
శమున కనుజ్ఞఁ గొంటకయి స్వాంతమునం దుఁదలంచెఁ గావ్యునిన్ ॥

ఉ॥ తామరసాప్తుఁ డేమిటికొ ధాత్రికిఁ డిగ్గెడునంచుఁ జేతన।
స్తోమము విస్మయంపడుచుఁ జూచుమహత్తరతేజ మొప్పఁ బూ।
ర్వామరరాజబీజివదనాంబుజముల్ వికసింపఁ జేయుచున్ ।
వ్యోమగతిన్ నిశాటవిభునొద్దకుఁ గావ్యుఁడు వచ్చెఁ జెచ్చెరన్ ॥

శా॥ చండాంశుద్యుతితోడఁ దుల్యమగు తేజంబొప్పనీరీతినా ।
శండామరగురుండు వచ్చుటయు నంచద్భక్తిమై శూరప ।
ద్మౌండుల్ దారకుఁడు న్వినీతుఁడ సురేంద్రుండుల్ బదాబ్జద్వయిల్ ।
దండంబుల్వలె నేలపైఁదొరఁగిజోతల్సల్పి రొక్కుమ్మడిల్ ॥

శా॥ భోనక్తంచర లోకరక్షక దయాపూర్ణేన చిత్తేనన ।
శ్రీనాథామరనాయకప్రభృతిభిర్బృందారకైః పీడితాన్ ।
దీనాన్పాహియటంచు నద్దితిసుతాధీశుండు భక్త్యున్నతిన్ ।
బౌనఃపున్యముగానొనర్చెఁ గవికిన్ బాదప్రణామంబులన్ ॥

ఉ॥ ఎక్కుడుబత్తియున్ భయము నేలుపడన్ దనకివ్విధంబునన్ ।
మ్రొక్కినయాసురారులకు మువ్వురకున్గరుణాన్వితాత్ముఁడై ।
సుక్కురుఁడాదరంబెసఁగఁజూచుచు దీవనలిచ్చె నంతనా ।
రక్కసితేఁడు గౌరవభరంబునఁ గేల్గవమోడ్చి యిట్లనున్ ॥

చ॥ వెలియుననంతరంబునను వేఱిమిలేకసమస్తవిష్టపం ।
బులనడవళ్లెఱుంగు ఘనబోధుఁడవీవఁటనీకుఁజెప్పఁగా ।
వలయునె భక్తిమైఁబ్రమథవల్లభుఁగూర్చితపంబొనర్చివీం ।
డ్లలపరమేశుచే వరములందినమాట తపోధనాగ్రణీ ॥

ఉ॥ అందితశిల్పవిద్యుఁడు మయాఖ్యుఁడు రాక్షసకోటతక్షుఁడే ।
తెంచిపయోధిలోని పెనుదీవిఁబురప్రవరంబొకండు ని ।
ర్మించియొసంగె వీరికనిమీరు కృపాతిశయంబెలర్పఁదీ ।
వించిప్రవేశపెట్టుడు నవీనపురంబున నస్మదాదులన్ ॥

గీ॥ అనివినయమొప్ప సందానితాంజలియయి ।
వేల్పుదాయలయొకిమీఁదువిన్నవింప ।
పోఁకుమూఁకలయొజ్జయా సుక్కురుండు ।
మందిదన్లైయొనర్చెదనంచుఁబలిక ॥

చ॥ గ్రహములలో నొకండయి జగత్ప్రథఁ గాంచిన భార్గవుండను ।
గ్రహమునఁ గ్రొత్తవీటికరుగన్ సుముహూర్తము నిర్ణయించెఁద ।
గ్గ్రహబల మేమి చెప్పవలెఁ దైవతనాయకముఖ్యులెల్ల సా ।
గ్రహమతులయ్యు లేశమపకారము సేయఁగఁ జాలరైరనన్ ॥

మ॥ పరదేశంబులనుండి వచ్చిన సురప్రత్యర్థులన్ మాంసలే ।
ట్చరదస్త్రాత్మకులన్ గుటుంబములతోడన్ వీరమాహేంద్రమున్ ।
బురికిన్ బోవఁగ ముందుగాఁ బనిచి సంపూర్ణప్రమోదంబునన్ ।
వరపాదాతఘటాశ్వరథ్యలను బోవం బంచి రవ్వీటికిన్ ॥

చ॥ పదపడి కొన్ని నాళ్ళు చనఁ భార్గవుఁ డుంచిన మూరుతంబునన్ ।
గదియుట యున్ మహోత్సవముగా నసురేంద్రుఁడు శూరపద్మఁడున్ ।
దదనుజులున్ గురుండును మదద్విరదప్రవరాధిరూఢులై ।
కదలిరి సర్వసైగమనికాయము వెంబడి నేగుదేరఁగన్ ॥

వసంతతిలకవృత్తం॥ నాతోద్యభూరిరవ యంచుఁ దదాత్వయాన ।
స్ఫీతోద్యముల్ కొలఁపుఁ బెట్టలు మోదిలన్జీ ।
మూతోద్యత స్తనితముల్ వలె మ్రోయునుచ్చై ।
రాతోద్యనాదము దిశాష్టకమెల్ల నిండెన్ ॥

రథోద్ధతవృత్తము ॥ హైమరమ్యశిభికాధిరూఢమై ।
యామినీచరమహాకులీనమా ।
లేమపిందు వెడలెన్ సుగద్వష ।
త్స్వామియాజ్ఞనతిసమ్మదంబునన్ ॥

గీ॥ ప్రగ్యాయిత మంత్రిబాంధవప్రాడ్వివాక ।
దండనాథాదిసహితులద్దండిదొరలు ।
వీరమాహేంద్రనగరప్రవిష్టులైరి ।
మొనటనటఁబోయియున్నవారెదురుచనఁగ ॥

ఉ॥ వాలుకరాలనీని జనవారముతో నరుదెంచుచున్నయ ।
య్యేలినవారి రాకవిని యెల్లనెలంతలలంకృతాంగులై ।
మేలికడాని ప్రాఁతపనిమేడలపై నిలుచుండి లాజలున్ ।
ప్రాలునుఁ జల్లి రయ్యసురరాజకుమారులపైఁ బ్రియంబునన్ ॥

మ॥ ఇలపై నెంమనులేని సౌష్ఠవముచే నేపారునా ప్రోలిగీ ।
ములనీక్షించుచు వారితోఁ జనుజనమ్మల్ మోహనాస్త్రాహతిన్ ।
వలెఁ జైతన్యముఁ దక్కి నిల్చి చనకున్నన్ గెంటుచున్ వేత్రహ ।
స్తులు మున్ముందుకుఁ ద్రోయుచుండిరి మహాహూత్కారపూర్వంబుగన్ ॥

ఉ॥ కట్టినయిండ్లసోయగముఁ గాంచుపరాకునఁ గాలుముందుకున్ ।
బెట్టక యన్యము న్మఱచి పెద్దయునివ్వెఱతోడఁ జూచుచున్ ।
బట్టఁపుఁగారువచ్చెడినిఁ బ్రక్కకుఁ బొండని చోపుదార్లు వెన్ ।
దట్టియదల్పు నుల్కిపడి దారిఁదొలంగుచు రగ్రతస్సురుల్ ॥

శా॥ తారాసంసరణంబుతో నొరయు సౌధశ్రేణిపైనుండిర ।
క్షోరాజన్యకుమారరత్నముల సాకూతంబుగాఁ జూచుచీ ।
ధీరోదాత్తులు తుల్యమోహులయి ప్రీతిన్ మాకుఁ బ్రాణేశ్వరుల్ ।
కాఁగాదేయని యారటించిరి నురక్తస్వాంతలై కన్నియల్ ॥

ఉ॥ చెప్పమగాని యిట్టులఁ బుశిగ్గున నాత్మమనోగతంబుపై ।
కిప్పువుఁబోఁడి మిన్నయసురేంద్రుని మన్నలమీఁది మక్కువన్ ।
తెప్పలువాల్ప కెట్లుతమి తెసికనుంగొనుచున్నదోయటం ।
చప్పుడు మేలమాడె నొకయంగన చెంగటనున్నముద్దియన్ ॥

చ॥ పెఱమగలన్న నీకు మదిఁ బ్రేముడి యగ్గలమిక్కిశోరుల ।
కక్కఱపడి రారుగాని తమకంబున వచ్చిరయేని తుంటవిల్ ।
తెఱకువకాని పోరఁ దమిఁ దీరిచి మెల్లఁగ సాగనంపుదిం ।
దఱిచటనుండగానె యనినవ్వె నొకర్తొకమత్తకాశినిన్ ॥

చ॥ తమక మెలర్పనొక్క ప్రమదామణి క్రొన్ననవింటివానిక ।
య్యమునకుఁగాలుద్రవ్వుచు విటావళిఁబిల్చుచునున్నవోయనన్ ।
గొమరుమిటారి గబ్బిబిగిగుబ్బలు సన్నపుఁబైఁటలోనలా ।
స్యములొనరింపవచ్చె సురసాతనుజాతులఁ గాంచువేడుకన్ ॥

క॥ సరసీరుహలోచననీ ।
పరువంతయుఁదెలియవచ్చెఁ బాగుగననుచున్ ।
బరిహాసమాడను విదలు ।
పరువున నేతెంచె నొక్కపడఁతి యచటికిన్ ॥

ఉ॥ బంగరుబంతిదోయివలెఁ బయ్యెదచాటునఁ గొంతవల్గచ ।
న్నుంగవగానిపింపఁగ మనుల్ భుజమూలరుచుల్ తదేకదీ ।
క్షంగని మోహమున్ బొరయఁజారినవేనలిఁజుట్టబెట్టికొం ।
చంగరితూనవెూర్తటకుఁ జూడఁగవచ్చెను రాకుమారులన్ ॥

ఉ॥ క్రొమ్ముడివీడి వీఁపునఁ గురుల్తగఁజింపులుద్రొక్కుచుండనా ।
స్యమ్మునఁ జూర్ణకుంతలచయమ్మునుఁదుంపెసలాడవల్గుపా ।
దమ్ములహంసకాదులజతల్ ఘులుఘుల్లని మ్రోఁతవెట్టఁగాఁ ।
గొమ్మయొకర్తువచ్చెనటకున్ సురసాత్త్రజులంగనుంగొనన్ ॥

శా॥ విక్రాంతోత్తములట్లువైభవమునన్ వీడెల్లనూరేగియా ।
శుక్రాచార్యుఁడుమున్నుగాగ మదవచ్ఛుండాలమున్ డిగ్గిస ।
ర్వక్రవ్యాదులతోడఁజేరిరి నిజప్రాసాదరాజన్యమున్ ।
శక్రాదిప్రభుమందిరాపితతిరస్కారస్ఫురాజన్యమున్ ॥

ఉ॥ రాత్రికరోపమాస్య లనురాగవిశేషముపొడముట్టనా ।
రాత్రిచరాన్వవాయులగు రాచకొమాళ్ళకు మన్మథాస్త్రధా ।
రాత్రిగుణాకృతాత్మలయి రాతుసనాథుననుజ్ఞమంగళా ।
రాత్రికముల్ కుతూహలభరంబెసఁగఁగనొసంగిర న్వటిన్ ॥

చ॥ హరిదిభసౌఖశాయ నిక్షమై ఘనతూర్యనినాదమొప్పన
గ్గురుడు గృహప్రవేశమునకుఀ దగుమంగళసంవిధానముల్ ।
విరహితకర్మలోపముగ వేదవిదుల్ వొగడఀ యథావిధిఀ ।
బరపి ప్రవేశపెట్టె సురసాతనయాదుల రాచగీమునఀ ॥

సీ॥ అంతనసురేంద్రుఁడునుఁ దారకాసురుఁడునుఁ ।
దక్కఁగలముఖ్యులగు నెల్లరక్కసులును ।
నైకకంఠ్యముగాగ సంప్రార్థనంబు ।
సేయుటయు నయ్యది యసమీచీనమనుచు ॥

మ॥ యమునా సింధు సరస్వతీ హిమమయూఖాత్మోద్భవా సహ్యజా ।
నిమిషద్వీపవతీము ఖోత్తమధునీ నీతంబులైనట్టిపు ।
ణ్యమహాతోయములఀ భృగుండసురులానందింపమూర్ధాభిషే ।
కము గావించెను శూరపద్మునకు రక్షఃకోటిరక్షార్థమై ॥

ఉ॥ ఆపలభుక్తతుల్ జయజయధ్వనిఁజేయ మహాధనోపలా ।
ట్టోపదక్లుప్తమై యొసఁగుదక్కఁనిసింగఁపుఁబీఁటపై నధి ।
ష్ఠాపితుఁడై యొసంగె సురసాతనయాగ్రణి రత్నసానుశృం ।
గోపరి సన్నివిష్టమణి యొప్పువృగేంద్రముఁగ్రేణిసేయుచుఀ ॥

ఉ॥ దానవరాజవృద్ధుఁడు పసంపడి మున్నలరాజనీతిసూ ।
క్తానులఁజేయ వేయుచుఁ దన్నుఁబదింబది వేఁడుకొంటకుఀ ।
మానిసరుండు భార్గవుఁడు మైకొని తోడ్తొఁనిపోయె స్వోతరుల్ ।
రానిపవిత్రభూమికలఁ ఖాతలఁ దారకశూరపద్ములఀ ॥

మ॥ అపదక్షిణమయర్త్య నయ్యనికి శుక్రాచార్యుఁడేకాక్షుఁడై ।
యుషితుండైనకతంబునఀ అసమపాంశూర్వీప్రదేశంబునఀ ।
ద్విపదంచత్ప్లుతనాపమోరుహవనీ వేదండులయ్యుర్వుగుఀ ।
రుషులందొక్కరుఁడైన భార్గవుఁడు తానుఀ మూపునైయుండియుఀ ॥

క॥ ఆరుసియనుసురులయందున।
పారకృపారసుఁడు శూరపద్మాసురరా।
ట్త్రారికులరాజనీతివి।
శారదులఁ జేయఁ జెప్పసాఁగె నిటువలెన్॥

ఉ॥ రాచరికమ్ము పూనుట గరమ్ము భరమ్ము గరిష్ఠభారముల్।
మోచుచునుండు కష్టభృతిభుక్కునకుంగలయంతయేనిసా।
ఖ్యాచితిలేదు రాజునకు న్యాయముఁదప్పకయుండఁ భూప్రజల్।
బోషించుటకున్ భుజాబలముఁ బుద్ధిబలంబును చాలఁగావలెన్॥

క॥ ఏనొడయుఁడఁగదయనికనుఁ।
గానక మెలఁగుమరు ప్రాయికమ్ముగ భువుల్।
కాననె ప్రాజ్ఞులు రాజ్యం।
తేనరకం ధ్రువమటంచుఁ దెలిపిరితొలుతన్॥

క॥ స్తవనీయమగు నడవడిన్।
స్వవిషయము ప్రజానురంజనంబుగఁ బాలిం।
పవలెన్ రాజగునతఁడువి।
నవె రాజాప్రకృతిరంజనాత్తనునుష్టపున్॥

చ॥ ప్రకృతిజనంబు మానముల పట్లధనంబుల పట్లభూమినా।
యకుఁడతిజాగరూకుఁడయి యారయమిన్ బ్రజలర్థహరత్వనం।
దకయవిగోలుపోయి వ్యసనంబున నేడ్చుచుచోఁదద్రసముల్।
క్రకచములౌఁజుమీయతని రాజ్యమహీజముతల్లి వేళ్లకున్॥

గీ॥ ప్రజలుగావించు మనవులు శ్రద్ధతోడ।
నాలకించి కల్లనిజంబులరసిన్యాయ।
మొసఁగుచుఁడనవలెఁగాని మొప్పొకము।
సేయరాదు తనకెయదిసెరగుఁదెచ్చు॥

మ॥ తనని దేశమతిక్రమింపక సమస్తంబుం బ్రవర్తింపుచుం ।
డెనొ లేదో తనయేలుకోటి ప్రజలన్నింటన్ సుఖాన్వితవ ।
ర్తనులై యుండిరొ లేదొ యారయుటకున్ బ్రచ్ఛన్నవేషంబుతో ।
జనియప్పప్పుడు చూచుచుండవలె రాష్ట్రంబుం దొరల్ ధార్మికుల్ ॥

మ॥ ప్రబలుల్ దుర్బలులైనయట్టి ప్రజలన్ బాధించుచుం డేని వే ।
డబమొక్కింతయు లేని యక్కటికతోడన్ న్యాయవర్తిష్ణులై ।
పబువుల్ దృప్తులనొంచి బాధితులఁ గాపాడన్ వలెన్ దుర్బల ।
స్యబలం రాజ యటంచుఁ బల్కు నయవాక్యంబొల్లవోకుండగన్ ॥

క॥ దండార్హులు దొంగయుధూ ।
ర్తుండును గల్లరియుఁ బరసతులఁ గోరుమరా ।
త్ముండును దురుమిడుకును సూ ।
మండలనాథునకు న్యాయమార్గరతునకున్ ॥

ఉ॥ కూళలచేత నీలువులు గోల్పడి కోల్పడనుండి త్రాతలే ।
కాలుడికత్తె లైనమగవాండ్రెకి మీసికిపిన్నవించుచో ।
నేలిడముంచకచ్చెనఁటియేతరులన్ గలరూపెటింగికా ।
రాలయమందునుంచి తగినట్టులు శిక్షవిధించుటొప్పగున్ ॥

క॥ శిక్షకుఁదగునపరాధుల ।
శిక్షింపకవిడిచి తప్పుసేయనివారిన్ ।
శిక్షించు ఱేఁడు ప్రజలక ।
ధిక్షేపార్హుఁడయి దుర్గతిన్ బొరయుఁదుదిన్ ॥

ఉ॥ తప్పొనరించె నేని తనతమ్ముని నైనఁ గుమారు నేనియున్ ।
దప్పక శాస్త్రచోదితవిధమ్మున నర్హపుశిక్ష సేయఁగా ।
నొప్పునకాని ప్రేమభరమూని మనమ్మునఁ బక్షపాతివై ।
తొప్పరికింపఁగూడదొడయుండగువానికి న్యాయవర్తికిన్ ॥

క॥ దుండతికములొనరించుచు।
మండనుమటువయసుకాంగ్రసోడయుండుకశా।
దండాదిఘాతములచే।
దండింపఁ జేయవలయుఁదనువులునొవ్వన్॥

ఉ॥ కొంచెఁపుఁదప్పుజేసి నభకున్ జని తీర్పరిచెంతఁబొంకకే।
కొంచను తాపమంది మదిఁగుందియుఁ కెన్నఁడుఁదప్పుసేయనే।
నంచుఁత్రమాపణంబుఁ గరుణార్ద్రతఁగోరుకృతాల్పమంతువిన్।
గించిదకష్టశిక్షపొసఁగించి త్యజించుటపాడి తేండ్లకున్॥

ఉ॥ చేసినతొంటితప్పులకు శిక్షితుఁడయ్యును బుద్ధిరాకని।
ర్వాసితసద్వివేకుఁడయి క్రమ్మఱఁదప్పులుసేయువానిఁగా।
రాసదనంబునందతిభరంబగు కష్టమునొందునట్లుగా।
శాసితుఁజేయఁగావలెఁగశాప్రహారాదులచే నితాంతమున్॥

ఉ॥ నేరములెప్డుఁజేయని యనింద్యుఁడొకప్డు ప్రమత్తతన్ విధి।
ప్రేరణనల్పమంతువొనరించుట సంభవమయ్యెనేనిగో।
త్రారమణుండుతోషమగు దండువుఁగైకొనుటొప్పఁగానిబు।
య్యారమునందఁబెట్టుట యనర్హముకొంచెముఁ దప్పుసేతకున్॥

క॥ స్టౌచితికాదమకొనకు।
తోఁచములన్ దినుచుఁబ్రజలకున్ బాధకులై।
రేఁచుచెనఁటి యధికారిపి।
శాచమ్ములబాధఁదొలఁది సాఁకనలెఁబ్రజన్॥

క॥ లంచములు గొనుచుఁబ్రజనే।
ధ్వించుఖలులుగాక పాపభీతికలిగిన।
త్రింశువ్యవహారదక్షుల।
నుంచుటరక్ష దేశపాలనోద్యోగములన్॥

గీ॥ వర్తనవ్యాయ్యులను మణివములకవని।
భర్తనేమించుచో నుపవర్తనంబు।
మదముఁగని యాదొరతనమె చదలురతన।
మట్లుస్థిరముగనుండుతమంచుఁగోరు॥

చ॥ వఱదలు వానపెక్కువలవగ్రహముల్ మొదలైనవానిచేఁ।
గఱవులువచ్చి కర్షకులు కర్మకరాదులు క్షామబాధకున్।
మఱుఁగుచునున్నచోఁ గరిసెనంబులపన్నులు మాపిసాంతసా।
మ్మఱిగొఱలేకొసంగి తగినట్లుభరింపఁదగున్ మహీప్రజన్॥

చ॥ ప్రజలకుఁదుర్భరంబులగు పన్నులుగట్టి వ్యధింపఁబోకభూ।
భుజులు ప్రజానురాగకరముల్ కరముల్ గొనుటొప్పునోమహా।
భుజయకృతాపరాధముల భూతచయంబులనందనున్ జరా।
యుజములఁజంపుఘాతుకునకుగ్రపుశిక్షవిధించుటొప్పగున్॥

ఆ॥ ప్రజలవలనఁ గొనిన భాగధేయములుభూ।
భుజులు స్వోపయోగములకు సెలవు।
సేయఁదగదు ప్రజలసేమంబులకె వ్యయిం।
పంగవలయువానిఁ బార్థివుండు॥

చ॥ కొలుచులయన్యదేశములకుంగొనిపోకకు పోయిఁగా జనం
బులుశకటాది యానములఁబోవుటకున్ దగియుండుమంచిబా।
టలు ఫలినంపుఁజెట్లెడనెడంగలయవ్వియు ధర్మవైద్యశా।
లలునుపాఠశాలలునిలాపతి యేర్పరిపించుటొప్పఁగున్॥

మ॥ ధనమవ్వారిగనున్నశ్రీలునకు రైదానంబుగావించుచా।
ద్భవస్రోతస్విని నీరువారినిధికిన్ బోకుండరోధింపనా।
ళినిఁగట్టించి ససుల్ఫలించుటకు శాలేయాదికై దారకం।
బునకుం గాల్వలఁదెచ్చి నీరొసఁగుటొప్పున్ సౌఖ్యమందంబ్రజల్॥

క॥ తనదుసుఖస్థితికంటెన్ ।
దనయేల్బడిఁగలుగునొడలితాల్పులసేమం ।
బునకై యెక్కుడుశ్రద్ధన్ ।
గొనియారయవలయుఁ ధార్మికుల్ క్షోణిపతుల్ ।

క॥ సెరగొకఁడేనియు నెప్పుడుఁ ।
బెరయకయుండఁదనకన్నబిడ్డలపగిదిన్ ।
ధరణీప్రజఁగాపాడుట ।
పరమంబగుధర్మమనిపాలునకెపుడున్ ॥

క॥ నాలవపాలో మూడవ ।
పాలో కాపున్ననర్ధభాగమొ శ్రీలున్ ।
వీలుగవ్యయింపవలయున్ ।
బోలదయాయము సమస్తమున్ వెచ్చింపన్ ॥

క॥ వచ్చుబడి యొడమెయంతయు ।
వెచ్చించిననెంతవిపులవిభవుండైనన్ ।
బిచ్చముగొనిబ్రతుకవలసి ।
వచ్చున్ పేదఱిమి నెనవయుచున్ దుదకున్ ॥

క॥ వ్యసనంబులు దండింపుఁబ ।
రుసదనము వెలందినుడి పరుసదనము వణం ।
బును వమ్ముగయువిడిముడివ ।
మ్మోసఁతయును వానిఁదగులఁబోలదు పతికిన్ ॥

క॥ అవనిం బరిపాలించెడు ।
ధవుఁడు సెరింతలకునైనఁ దబ్బరయగుప ।
లుక్కవచించుట యొన్నండును ।
దనదుపలుకు విలువతగ్గుఁదానన్ గానన్ ॥

చ॥ ప్రహితుఁడుపాయకోవిదుఁడు ప్రత్యయయోగ్యుఁడు రాజ్యతంత్రని।
ర్వహణపటిష్ఠుఁడౌపయుక్త కనుండాహితలక్షణుండుస్వా।
మిహితసమర్థనోద్యమసమీహితచిత్తుఁడు నీతివైదుష్టీ।
మహితుఁడునైన యాతనినమాత్యపదంబుననుంచుటొప్పగున్॥

చ॥ తెగువయు శౌర్యమున్ గలుగుదిట్టలుపాయవిదుల్ నియోగముల్।
తగినతెలుంగుసన్ నెంపఁదక్షులమాంద్యులు మేనిచోదకో।
ర్వఁగలుగువారు బుద్ధిబలవంతులునైన యథార్థవర్ణులన్।
బగతురమర్మముల్ తెలియఁబంపుచునుండవలెన్ విశాంపతిన్॥

క॥ నిశ్చయమేలికకునసే।
నశ్చరితులు చరులేలోచనంబులురాజా।
నశ్చారచక్షుసయనిపి।
వశ్చితులు వదించునను ప్రదితముకాదే॥

మ॥ బెడిదంబై తనరారుచున్న ప్రళయాంభీలానలజ్వాలలోఁ।
బడనైనన్ వెనుకంజవెట్టనియుతిప్రాబల్యమౌ సైన్యమున్।
గడుఁగాణేయముగాని సౌఖ్యగలయుగ్రాణంబునున్ తేలికై।
వ్వడునుండన్వలె సిద్ధమైరవడియొప్పున్ జేయరాదేలికల్॥

క॥ పెనుమిత్రిఁదోడరనైనన్।
వెనుదీయనివేనవేలు వీరభటులుగ।
ల్గినపెక్కు క్షౌహిణులప్రు।
తనలుండక వలయు భూతధాత్రీశులకున్॥

సీ॥ ఇరువదియొకట్ వేయొనిఁదివందల డెబ్బదియేనుఁగుల్ ప్రబ్బుటొప్పి।
యంతియసంఖ్యచే నలరారిదృఢముపై క్రాలుచుండెడుశతాంగములు
[గల్గి।
యరువదియైుమవేలాఱువందలపదిసంశిక్షితోత్తమాశ్వములుగల్గి।
మేలుగాలక్షతొమ్మిదివేలమున్నూటయేఁబదికాలిబంట్లైనఁగనొప్పి।

నెగడు సేనకునక్షౌహిణియని పేరు ।
వెట్టియుండిరి కోవిదు లట్టివియగు ।
పెక్కులక్షౌహిణులుగల్గు నెక్కుడదళ ।
మున్నతొడయుఁడు ద్విపదసాధ్యుఁడయిబ్రదుకు ॥

ఆ॥ ప్రాణములకునాసపడకోడలోముక ।
ప్రధనరంగమందుఁబగఱమీఁది ।
కుంతికికనుపుగొట్టనోపినదిట్టకు ।
సైన్యనాథపదమొసంగవలయు ॥ [పడిది ।

సీ॥ మదిఁగువాడము లేని మక్కువల్ గలవాండ్రఁ నుకూలలైన యిల్లాండ్ర
బహుభోగ్యవస్తుసంపన్నంబులగునిండ్లఁ గలిగినసకలసౌఖ్యములువిడిచి ।
తమతోడివియజీవనములుగానెడఁదలఁదలపోయుమాతాపితలనువిడిచి
వైరివీరులచేత వపురపాయముసంభవించు నేమోయను వెఱపువిడిచి ।
మనలరాజభక్తిమాత్రము విడువక ।
చావునకుఁదెగించి స్వామిపంటఁ ।
దాడియాడిరిపులఁదలఁకించువీరుల ।
సుతులకెంతెఁగూర్మిఁజూడవలయు ॥

క॥ తమకైపోరియరులచే ।
తమ్మృతులయినవీరభటుల దారాదికుటుం ।
బములకు దొరలాపురజ్ఞాం ।
తముగానుపకారవేతనములొసఁగఁదగుఁ ॥

గీ॥ చిన్నతనమునుండియుఁ దమసేవనమ్మె ।
తగునిజోద్యోగులై నెరపివార్ధకముకతనఁ
గొలువుచాలించుకొన్నయోగ్యులకునిలుగ ।
వరకునుపజీవికలొసంగవలయు తేండ్లు ॥

కం॥ మేనెడల వలసివచ్చుట।
కేనియు వెనుకంజయిడక యేలికహితమున్।
బూని నెఱవేర్పఁగలవా।
రైన వరవులుండవలయు నవనిపతులకున్॥

కం॥ స్థామాధికులఁదణులసం।
గ్రామవిజయాతులను దుర్గరక్షణమునకున్।
నేమించి యప్రమత్తత।
తోమెలఁగన్వలయు భూపతుల్ సంతతమున్॥

సీ॥ నడతచే నెంతగట్టిగా నమ్మఁదగిన।
వారుగాఁదోఁచినను గ్రొత్తవారిఁడడవు।
లెస్సయారసికాక మనస్సులోని।
నెఱనెఱుఁగనీయఁగూడదు నేలఱేండ్లు॥

కం॥ ద్వేషములచేఁ గడుఁసరుల్।
ప్రేషితులై హితులవలెఁ జరింతురసహ్య।
ద్వేషములుపూని చెంతమ।
నీషనరసి తెలియవలయు నిజమవనిపతుల్॥

సీ॥ దడులు గోడలు పీవరస్తంభములును ;
లోనుగాఁగల యోలముల్లేనిచోట।
నైన నిర్జనాటవినైన నరులఁగూర్చి।
మంతనముసేయుటుచితమమాత్యుఁగూడి॥

సీ॥ గహ్వరీశులు సంధివిగ్రహముయాన।
మాసనము ద్వైధమాశ్రయమనెడు షడ్గు।
ణములనదను లెఱింగివిన్నను వెలర్పఁ।
బగఱపట్టుననుపయోగపరుపవలయు॥

గీ॥ హితవచనములచే నొండెనీగిచేత।
నొండెవేటిమిపొసఁగించి యొండెవాని।
వలన వీల్పడకున్నఁజేబలిమినొండెఁ।
బగతురను లోఁబరచికొంట ప్రాజ్ఞమతము॥

క॥ ప్రభుశక్తిమంత్రశక్తియు।
నుభయమునుత్సాహశక్తియును ననునీమూ।
డు భువిన్ శక్తిత్రయమని।
సభాస్థులులలో వచింత్రు సంఖ్యావంతుల్॥

గీ॥ ఈఁడు పెగ్గడ సంగడికాఁడు బొక్క।
సంబుమూగాని కోటదడంబుననఁగ।
నవనియందిపియేడు రాజ్యాంగములని।
నిర్ణయించిరి మును రాజనీతివిదులు॥

చ॥ అహితునికంటెఁ దానుబలహైన్యము నొందుటిలన్ క్షయంబటం।
డ్రహితుఁడుఁ దానుఁదుల్యబలులై తనరారుచునుంటస్థానమం।
డ్రహితునికంటెఁ దానధికుఁడై యలరారుట వృద్ధియండ్రుధీ।
మహితులు దానవేశ్వరకుమారకులార వినుండు శ్రద్ధతోన్॥

క॥ క్షయమును స్థానంబును వృ॥
ద్ధియు ననఁగ త్రివర్గమండ్రు ధీమంతులుత।
త్త్రియ మెఱిఁగియొక్తియగునవ।
లయు విజిగీషుండరాతులన్ గెలుచుటకున్॥

క॥ కరుణించి ప్రోవుమన్నన్।
బరిపంధికినైన నెటినభయమీయఁదగున్।
శరణాగతరక్షణమిహ।
పరములఁ గీర్తియును సుఖముఁబడయన్ జేయున్॥

వ॥ అనియిట్లు రాజనీతిప్రకారంబు సంగ్రహంబుగాఁజెప్పి తారకు
దెసకుఁజూడ్కి మగుడించి భృగూద్వహుండు ॥

క॥ అనువగుతఱియిదె ధీవర।
యనిమిషగణములను ధృతమహోనాయుఁడవై।
చని పట్టుమయ్యనీవా।
రనుచరులై వెంటఁగొందఱుదేరఁగన్ ॥

వ॥ అనిపలికి మరల శూరపద్ముఁజూచి ॥

మ॥ దళముల్ తోకొనిదిగ్జయంబునకు నీతండిత్తఱిఁబోయినన్।
గెలుపావశ్యకమాటనిప్పటికి సంక్షేపించితిన్ వాసవా।
దులపై కేగుతఁదారకుండిపుడపోదున్ నేనునున్ డెంకికిన్।
దలఁకొక్కింతయులేక యేలుమిఁకదైత్యప్రాజ్యసామ్రాజ్యమున్ ॥

ఆ॥ అనివచించి యాతఁడసురేంద్రురావించి।
యోలమునకుఁ బిలిచి యోయియొకర।
హాస్యమేనువినుతునన్యులకెఱిఁగింప।
వలవదెడఁదలోనె నిలుపవలయు ॥

చ॥ అయుతసమల్ భరించు సురసాగ్రతనూజుఁడు రాజ్యభారమున్।
ప్రియముగ యుష్మదాదులకు రేపటికయ్యమునందునిందిరా।
దయితుఁజయించుఁదారకుఁడు త్వష్టృతనూభవపద్మకోమలా।
క్ష్యయుని కపోతనూజసుతగారియు నౌదురుపీఠిప్రేయసుల్ ॥

మ॥ అనుచున్ వాకొనిసోఁకుటాజ్ఞయసురేంద్రాద్యాళరాగ్రియులన్।
గనిస్వావాస యియాసఁదెల్ప నసురౌఘంబెల్ల సాష్టాంగవం।
దనముల్ పెక్కులు వేలువేలుకడుశ్రద్ధాభక్తులన్ జల్పిరా।
దినకృత్తేజుఁడు పేరుపేరువరుసన్ దీవించె నాశిష్యులన్ ॥

క॥ అసు రేంద్రకుమారపత్నులు ।
ప్రసభమున భటాళిచేతఁ బహుమూల్యములౌ ।
వసదనములొసఁగి యనుపక ।
స్వసదనమునకరిగె నయ్యుశనుఁడు ముదమునక ॥
గీ॥ శుక్రుఁడు పిత్రాపముఁడు తమ్మతిక్రమించి ।
యరుగుతఱివారికిఁబొసంగె నశ్రువృష్టి ।
స్వాతిగతుఁడైన శుక్రుఁడు వానగురియఁ ।
జేయునను మాట లోకప్రశిద్ధమెకద ॥
వ॥ అనియిట్లుచెప్పి సూతుండు వెండియు ॥
మ॥ ధరణీభృద్వరవాస వాసవమహీధ్రప్రాంచదిష్వాసవా ।
సరకృతోఁటివికాస కాసరవరాశ్వస్పర్శితత్రాసరా ।
సరసప్రీతవిలాస లానకచరాంచద్వ్యాఘ్రనాస్థూసవా ।
సరుగా క్షేపితచంద్రహాస హరరాజతాఁటశికాధీశ్వరా ॥
పృథ్వీవృత్తము॥ రవీందుశిఖిలోచనా ప్రణమదార్తినిర్మోచనా ।
భవాంబునిధితారణా ప్రవిలసజ్జగతాఁటరణా ।
వివాహకృతవందనా విపులమేదినీస్యందనా ।
కవోష్ణవిషభక్షకా కలుషహృచ్ఛటా శిక్షకా ॥
ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు పంచమా
శ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## షష్ఠాశ్వాసము.

క॥ ఆశ్రితజనవిశ్రాణిత।
నిశ్శ్రేయసగూఢపాన్మణివిభూషణప్రా।
జ్యశ్రుతివినీతసైంధవ।
విశ్రుతవారాణసీ నివేశా యీశా॥

వ॥ అవధరింపుము శౌనకాదిమహర్షులకు నవగతాఖిలేతిహాసనమాజుండగు రోమహర్షణతనూజుండిట్లని చెప్పందొడంగె॥

సీ॥ సుడిగట్టుగవులలోఁ జొక్కి— హూరుహువోవు మొగములకూటవుల్ మేలు [కొనఁగ।
స్వర్ణదీవనులలో వైడూర్యాళిఁదిరుగుద్రేఁకటివేల్పుటింతులకడుపులద్రువ।
స్ఫారస్వనిర్ఘోషనీరంధ్రపూర్ణమై రోదోంతరంబు మార్మ్రోఁతవెట్ట।
నదరుద్రేఁకమునఁ గహ్వారి లేలిహానేశ్వరుని వేయియాదలల్ క్రుంగఁ [జేయఁ।
బుడమిజగమునఁగలిగిన మొదలితాల్పు।
లిచిపిలయగర్జితమొ యటంచెదలఁబెగడ।
బెట్టిదంబయి రణదుందుభిస్వనంబె।
నంగెఁ దారకాభిక్రమసమయమందు।

సీ॥ దారుణాకారులై దండిమైనను సళుక్కఁగలిగించు జోదులక్రందనములు
జంగమకులశిలోచ్ఛ్రయములో యనఁనొప్పుఁబంహిష్ఠఘటనల బృంహి
[తములు।
మానసవేగానమాననాచణములై యొసఁగుసాహ్రాణుల హేషితములు।
ప్రబలశార్ఙ్గాది నిరాకరిష్ణువులైన చాపరత్నముల విస్ఫారములును।
నెవసి రోదసీకుహరంబుఁ జెవుడువరుపఁ।
దారకుఁడు కృతసర్వాభిసారుఁడగుచు।
దైవతేంద్రునిఁకుఁద్రికిఁ దాడివెడలెఁ।
ద్రాసమయమయ్యెఁ జైత్రయాత్రాసమయము॥
శా॥ ఈళీహస్తులు కొందఱాశరులుతో నే తేరఁగేలన్ మహా।
నాళీకాసనముఁ ధరించి దొరలెన్నఁ శాత్రవానీకినీ।
వ్యాళీతార్క్ష్యుఁడు దానవారి సమవాయస్వాంతశల్యంబు న।
నాళీవక్త్రుఁడు వెల్వడెన్ ధవళరథ్యస్యందనారూఢుఁడై॥
మంజుభాషిణీవృత్తం॥ రజనీచరస్థవిరు ప్రార్థనంబునన్।
విజయుండు నాగనొక వీరుఁడాశర।
ధ్వజినీశ్వరుండు ప్రమదంబునన్ ద్విష।
ద్విజిగీషుఁడై బయలుదేరె నత్తఱిన్॥
తరలివృత్తం॥ స్ఫూర్జథునిభకార్ముకగుణభూరిరవ మొనర్చుచున్।
నిర్జరపరిపంథుల జయనిస్వనము లెలర్పగా।
నర్జునహయరాజదురుశతాంగసమధిరూఢుఁడై।
దుర్జయుఁడను సైన్యపతి కుతూహలమున వెల్వడెన్॥
మేదినీవృత్తం॥ ముసలియ నంబ్రబలీతుఁడు చమూవిభుండు రక్షో।
విసరములాయితంబులయి వెంటనేగుఁదేరన్।
ద్రసనగమోయనం బొలుచు దంతివెక్కి బాహూ।
ల్లసితకృపాణుఁడై వెడలె లావుమాగ్రు రెన్నన్॥

సుగంధివృత్తం॥ కంటకాఖ్యుఁడై ప్రతీతిఁగాంచినట్టి నాకస।
తఱుంటకుండు రకఱుసీఁడు కాల్బలంబు వేనవేల్।
వెంట నేగుదేర నల్లవేల్పుమన్నెకానితోఁ।
గంటుదీర్చికొంటకాత్మఁగాయ వూని వెల్వడెన్॥

తరలవృత్తం॥ తరకసములకవయునుఁ దృఢధనువును నిరుగెలఁకులన్।
గరశిరముల నమరనమరగణముఁ గెలుచుకడఁకతో।
సురరిపుబలపరివృతుఁడయి చోరవకు దయసదనమా।
ఖరముఖుఁడనురథికవరుఁడు కడలె సమరమానకుఁగాన్॥

మణిగణనికరవృత్తం॥ క్రతుభుజులనెయనిఁగసి మెసఁగెదమం।
చతిబలులగు భటులను గులయిచనన్।
ధృతపరికరుఁడయి మృధకృతముఖుఁడౌ।
శతముఖుఁడను దనుజవరుఁడు వెడలెన్॥

భద్రకవృత్తం॥ జన్యనిర్జితశత్రురా। జన్యుఁడాలము సేతకై।
శూన్యకేతుసమాఖ్యుఁడౌ। సైన్యనాథుఁడు వెల్వడెన్॥

పంచచామరం॥ పిచండుఁడన్ ధనుర్ధరుండు పీనగద్గరీలస।
త్పిచండుఁడింధనజ్వలత్కృపీటయోనికైవడిన్।
ప్రచండమూర్తియై వినీతరథ్యచంకరస్థుఁడై।
శచీపతిన్ జయింతు నంచసమ్మువూని వెల్వడెన్॥

భుజంగప్రయాతవృత్తం॥ కృతాస్త్రుండు శూరావగీర్ణప్రతాపో।
న్నతుండుగ్రబాహుండు నానోప్పసేనా।
పతిప్రాగ్రహారుండు బర్హిర్ముఖాధీ।
శుతోఁబోరఁ గాంక్షించుచున్ బైనమయ్యెన్॥

ఉపేంద్రవజ్రవృత్తం॥ వినాయకస్థాముఁడు విష్ణుసేనుం।
డనంబ్రశిష్టుఁడగు నాశరానీ।

కినీశముఖ్యుండరిగెఁ ఘనస్యం ।
దనం బధిష్ఠించి మృధంబునల్పఁగ ॥

అంబురుహవృత్తం॥ రిష్టిపరశ్వధకుంతగదాదివరిష్ఠశస్త్రసమేతుఁడై ।
యిష్టులుకొందఱు వెంబడి నేగఁగరీంద్రమెక్కి ధృతాస్త్రుఁడై।
దృష్టికి వేఁగగునల్లని యున్నతదేహముల్లసిలంగ మధూ ।
చ్ఛిష్టుఁడు నాఁబ్రతనేశ్వరుఁడాలము సేఁతకై వెడలెన్వడిఁగ॥

వంశస్థవృత్తం॥ సురల్ మదింగ వందురసోమకాఖ్యుఁడౌ ।
వరూథినీనాయకవర్యుఁడస్రపో ।
తక్రాన్వితుండై యరదంబు నెక్కి తా ।
ల్బిరిష్టిఁ గేలంగ వెడలెన్మహోద్ధతిన్ ॥

జలధరవృత్తం ॥ వాసవదుర్ధ్రముండు శుదివక్త్రుఁడు శా ।
రాసనపాణియున్ రథియునై జగదు ।
ద్వాసనమాచరింపఁ గలవానివలెన్ ।
ద్రాసకరోగ్రమూర్తియయి తా వెడలెన్ ॥

తోటకవృత్తం॥ అహితావలిఁ గెల్వ నహంకృతితో ।
మహిషుండను దైత్యకుమారుఁడు దీ ।
ప్తహుతాశనతేజుఁడు ప్రస్థితుఁడ ।
వ్యూహహయోత్తమ మెక్కి సహేతికుఁడై ॥

శుద్ధవిరాటివృత్తం॥ జ్యానాదంబున నైద్యమందగన్ ।
పీనుల్ విల్లూని వెల్వడెన్ రథా ।
సీనుండై జయసేనసంజ్ఞుఁడౌ ।
సేనానాధుఁడు శ్వేళసల్పుచుఁగ ॥ [దొడిగి ।

సీ॥ మణిమయకేయూర మకుటాదులు ధరించి కమనీయమైన జాగరముఁ
యతులయశరపూర్ణమైనప్రోల్లసదుపాసంగయుగ్మంబునంసములఁబూని

పృథుమహోగ్రోనసాభీలమై తనరారు మేలిసింగాణిఁ డాకేలఁబూని।
ప్రాంచితాజానేయరథ్యముల్ పూన్చిన యందమైనపసిండి యరదమె
విదితముగ రూపుదాల్చిన వీరరసమొ। [కి॥-।
యనఁగనభిరామభీమసంహననుఁడగుచుఁ।
దైత్యముఖ్యులు జయజయధ్వనులొనర్ప।
వెడలె నత్తారకుండుదిగ్విజయమునకు॥

ఉ॥ శాతకృపాణ కుంత సృగశల్యకుఠార శతఘ్నికాములౌ।
హేతులు దాల్చి యెల్లహరి దీశులఁదా మెజయించు నేడ్తెఱన్
ఖ్యాతలమెల్ల నాత్మపదఘాతములన్ జలనంబునొందఁబా
దాతముభూరి సంఖ్యగాయితారకు సూరెలనేగెనత్తఱిన్॥

చ॥ అమరసపత్న సైనిక శతాంగ మహత్తరచక్ర నేమిచం।
క్రమణసముద్ధితారుణపరాగసమూహ ముతద్గయుఙ్ఙ్ విశా।
లమగువిహాయ సంబునఁదళంబు గనెల్లెడనావరించిమూ।
ర్తమయిన తారకాసురు ప్రతాపమొయంచుఁ దలంపఁజొప్పడెన్॥

ఉ॥ వాయుజవాశ్వకోటి ఖురవారజమైన రజస్సుసంక్షయై।
తేయక ఘోరపాదని హతివ్యథకోరువలేక ధాత్రియ।
త్తోయజయోని తోఁచనిమ దుస్థితి యంతయువిన్నవింపగా।
బోయెను నోయటంచుఁజనముల్ తలఁపన్ నలిరేఁగె మింటిపైన్॥

గీ॥ ఆత్మసంభూతి హేతువు లైనవారు।
సురవిరోధు లెకావుటఁజూ వెయపుడు।
సైన్యసంభూతమైన రజఃపటలము।
సురవిరోధి యై యొలసెనంబరమునందు।

సీ॥ కనుచూపుమేర యొకింత డగన్నఁ జెట్టుపుట్టలుగాన రానియెడారులందు।
దృణకాష్ఠజలసమృద్ధి నెసఁగునునికికింపై యొప్పు గిర్యుపత్యకలయందు।

బహుపచేళ్లిమనన్య ఖారనవ్రమమహీరు హాపళులగు నరణ్యానులందు।
నతివిశంకటములైయలరున నేక కూలంకషాపులినస్థలంబులందు।
విడియుచును గొన్నిమానములు వడదెసకభి।
ముఖముగాఁబోయిపోయి ప్రభూతతరము।
లైన దళములతోఁదారకాసురేంద్రు।
జైత్రరథముతటియఁజొచ్చెఁజైత్రరథము।
గీ॥ అప్పుడలకాపురోపశల్యమున వీడు।
విడిసివిడిముడియొడ యనికడుకుమూత।
నొకనినను పనతఁడుపోయి యోలగమున।
రాచకార్యములు నెరపువైశ్రవణుఁగాంచి॥
చ॥ అజితుఁడు శూరపద్ముఁడను నాశరనాథుని శాసనంబునన్।
ధ్వజినులువెంటరానతని తమ్ముఁడు తారకుఁడన్ మగండుది।
గ్విజయము సేతకై వెడలివింటివొ లేదొాధనేశయన్మహా।
భుజబలశాలినీపుర మెముట్టడివైచె భవజ్జిగీషుఁడై॥
మత్తకోకిల॥ యక్షకిన్నర గుహ్యకామల హార్యతుల్యధృతుల్ సప।
త్నక్షమారి మణప్రబర్హమతంగ జవ్రజవర్యహా।
ర్యక్షమూర్తులు నీకునాశ్రవులైయనేక సహస్రముల్।
లక్షలుంగలరంచు వింటిఁబులస్త్యనందననందనా॥
ఉ॥ నిక్కపుఁబంటవేని రజనీచరులచ్చెరువందనీవునీ।
జక్కలు గూడివచ్చిబలసంపద పెంపుననస్మదాములన్।
జక్కనెదుర్పుమప్పనికిఁ జాలవయేనిజితోస్మియంచుఁజెన్।
రొక్కముగానగా నొసఁగి మ్రొక్కుము మాదొరకున్ వినీతితోన్॥
వ॥ అనిశూరాగ్రణి తారకుండుతనవ్యాహారంబుగానీకుఁజె।
ప్పననుఁబంచెనటంచుమూత వచియింపంగన్హావిస్తారవో।

సినవైశ్వానరు పోల్పఁ మండిపడి యాగ్రశీమండమర్త్యావకుం ।
రనమాన్యంబుననొప్ప వార్తికునితోడంబలెఁ నీచొప్పునన్ ।

ఉ॥ గ్రేపలకు మిట్టిరజ్జులికఁ బెకఁలు సంయదజేయుటైనది ।
క్ష్వాలురరాత్రిసౌధములు భండనభూములనొర్చురేవిశా ।
శ్శాలములన్ సృగాలములు క్రూరమృగేంద్రములన్ శశంబులున్ ॥
గాలవిపర్యయంబున నికంబుగనింతటనుండి గెల్వవే ॥

చ॥ అలకనఁ బైపయింగలదటంచభిమానపిసద్ధచిత్తుఁడై ।
యలకనులొకఁ మూడు గలయాతనికైనదు రాపమైనయి ।
య్యలకనుమట్టి నేయహాహాయాతఁడుదీననిజావరోధవ ।
ధ్వలకలకెల్ల నొకఁట నెహానిపొసంగు టెటుంగడకఁటా ।

చ॥ అదటతిమాత్రమైయెదిరి యంతరముజ్ దనయంతరమ్మునా ॥
న్మదెలియనీమిఁదాఁచురభిమానముప్రానిమరుక్తులాడినన్ ।
బెదరినిహీనునట్లులుప వెట్టుమనే తనయాముపుచ్చిపం ।
పెదఁదనటెంకికొఁడెనల్పేత పదంబునకొంఁడెఁదిన్నగన్ ॥

గీ॥ స్ఫారతరచంద్రదహాసోల్లసనము వలనఁ ।
దారకాభీక్ష్ణ నాయుబుదైవవిహిత ।
మైనదియకాననస్మఃభ్రజాగ్రజాగ్ర ।
దుగ్రమండలాగ్రముతనయుదుటడంచు ॥

ఉ॥ పొమ్మనుగుల్ సహాయపడఁబోరికినాతనిసర్వసిద్ధమై ।
రమ్మనుమేనువచ్చి సమరమ్మునశూరుఁడనన్న స్వాభిమా ।
నమ్మెటియన్ సురారిప్రతినల్ తలఁకన్ దనయుగ్గలంపుమే ।
తిమ్మెరిదీర్చి పంపెదనుదిగ్విజయస్పృహాయంత దీరెడున్ ।

గీ॥ అనియుతనివీడు కొల్పియదుఃధినాథు ।
డిపుడెయభిషేణనంబనియెల్ల సైన్య ।

ములను నాయత్తపరిపించి పోలికలనికిఁ ।
బోయెవాదిత్రనాదముల్ బోరుకలఁగ ।

క॥ రక్కసుల దళమ్ములకును ।
జక్కులపైను సౌజులకును క్షతజప్పృషతముల్ ।
జక్కరలైధరఁబాఱఁగ ।
నక్కజమగు తుములసమర మత్తఱినయ్యెన్ ॥

శా॥ ఆహాహాపూరుషికన్ బరస్పరముఁనొయ్యన్ జేయుబాహాచపే ।
టీహుంకారములన్ దివంబద్రువపుష్టిముష్టియున్ బ్రోల్లస ।
ద్బాహాబాహవియున్ గచాకచియుఁదంతాదంతియున్ గామహా
త్సాహుల్సల్పిరి దారుణాభిమరమున్ దైత్యసురక్షోభటుల్ ॥

ఉ॥ ఘోరపుబోరునన్ దనుజగుహ్యకయోధమిథఃప్రయుజ్యమా ।
నోరుశతఘ్ని కాసముసలోద్యదనూనతనూనసాన్నయ ।
క్రూరతరాశ్మసారపృథుగోళములొప్పెఁగృతాంతమృత్యువుల్ ।
గోరికమీఱ నాడుకొనులోహిత వర్ణపుబంతులోయనన్ ॥

క॥ ఇరువాగునుఁ దలపడియి ।
కరణిన్ బోరునెడఁగార్ష్మధగుంఢైత ।
న్నురువడిగవిసిన యసురే ।
శ్వరుఁడగుతారకునిఁ గాంచివానీఁడనియెన్ ॥

ఉ॥ సేనలరిత్తజంపికొని చేద్పడనేలధనాభిలాషివై ।
తేనిపొసంగదేహియను మిచ్చెదనంతియ కానిజన్యశా ।
లీనునిఁబోలెనన్ను నదలించిననిచ్చెద సేమహాస్త్రిధా ।
రానిహతాంగుఁజేసినిను గ్రచ్చరఁదోలుదుఁగాకతారకా ।

క॥ అనిమగపాడితలిర్వగఁ ।
ధనదుఁడు వాక్రుచ్చుటయును దావినిపలలా ।

శననాథుఁడు తారకుఁడా ।
వనసరసీజమున లేఁతనవ్వొలయ ననెఁ ॥

ఉ॥ వేఁడుటమార్గణావళికి విశ్రుతధర్మముకానియెవ్వరికిఁ ।
వేఁడియెఱుంగ నెన్నఁడుఁగుబేరమదాశ్రితమార్గణావళిఁ ।
బోఁడిమిమీరనీకడకుఁబుచ్చెదసిచ్చెద వీవెయాపయిఁ ।
వేఁడినయంతకంటెఁ గడువెక్కసమైతనరారురొక్కముఁ ॥

మ॥ పలుకన్ జల్లనిసామవాక్యములెదంబాటించి చేరొక్కమీఁ ।
గలవే క్రూరతరాస్త్రఘాతముల చేఁగారించినన్ గాకయో ॥
కెలనన్ శ్రావ్యముగానె పాడిననుసంగీతానకున్ జింతకా ।
యలిలన్ రాలునెదీర్ఘదండహతిఁజేయన్ రాలుఁగాకిద్ధరన్ ॥

గీ॥ వెరవునక్రూరప్రహతిచేలవించి వైవఁ ।
బడకయుండితివేని యిప్పంటవలఁతి ।
జగమునన్ నీదు గుహ్యకేశత్వమెవ్వి ।
ధమునఁజరితార్థుఁగునో యుదగ్గిరీశ ॥

శా॥ అంచున్ నవ్వుచుఁబలికె తారకుఁడుదీప్తాకారుఁడై నిల్చిప ।
ట్పంచాశత్ప్రదరంబులన్ బెలుచన ప్రాలస్త్యపై నేసినొ ।
ప్పించెన్ జక్కలతేఁడుదానఁబ్రతిఘోపేతాత్ముఁడై సాధ్వసా ।
కించన్యంబునఁదారకాసురుమెయిన్ గీలించె వాలమ్ములన్ ॥

క॥ దొరలు తలపడుట యునుఁగడు ।
బరవసములు పూనిరిచ్చుపాటున రాత్రిం ।
చరయక్షయోధవీరులు ।
పరికించుచు నుండిరర్ధపతి తారకులన్ ।

ఉ॥ పూనిమృధాంగణంబునఁబ్రభూతపరాక్రముఁడైన శూరప ।
ద్మానుజునిన్ జయింపవలెనంచుఁగడంగి మనుష్యధర్ముఁడున్ ।

హీనబలుండుకిన్నరులయేలిక యెంతటివాఁడటంచువా ।
నీనిగణింపకయ్యసురనేతయుసల్పిరిసంప్రహారమున్ ॥

ఉ॥ ఐలబిలుండువింటిఁగొనయంబునఁడంకృతియొప్పఁజేయుచున్ ।
వాలికనారసమ్ములుదివస్పతిశత్రునిపైనిగుప్పినన్ ।
గేళియుపోలెఁదానడిమికిన్ దునుమాడుచునంపవెల్లిలోఁ ।
దేలిచెఁదారకాసురుఁడు దీర్ఘభుజాబలుఁడక్కుబేరునిన్ ॥

శా॥ ఆపౌలస్త్యుఁడుతోఁకద్రొక్కినమహావ్యాళంబుపోలిక్ జ్వల ।
త్కోపుండైనిశితాస్త్రముల్పరపరక్షోభర్తకాత్మీయయ ।
న్నైపుణ్యంబెఱిఁగింపనాసురసపత్నప్రాగ్ర్యుఁడున్ స్వీకృతా ।
టోపత్వంబునరాజరాజుమెయితూఁటుల్ వోవనేయుచున్ ॥

క॥ లస్తకమునఱికియాకృత ।
హస్తకధితవిక్రముఁడురథాశ్వయుగళమున్ ।
మస్తకములగలనేసిప్ర ।
శస్తకవచముచ్ఛిపోవశరమొకఁడేసెన్ ॥

ఇట్లువిరథీకృతుండై.

చ॥ గిరిశిఖరంబునుండిడిగుకేసరినాథుఁదలంపఁజేయుచున్ ।
స్వరథమునుండిడిగ్గినరవాహనుఁడాత్మభటుల్ నుతింపనా ।
శరపతితేరిపైకుఱికిశాతకృపాణమునన్ దదీయకం ।
ధరమునఁబిట్టువ్రేసెనయొతారకచచ్చితివంచుఁబల్కుచున్ ॥

చ॥ దిశలుప్రతిధ్వనింపనతితీవ్రతనార్చుచునట్టువ్రేయన ।
య్యశనిసదృక్షమైనయసియప్పుడు తారకదైత్యువజ్రక ।
ర్కశమగుగొంతుపైఁదగిలిఖంగునమ్రోగుచునమ్మనుష్యధ ।
ర్మశయమునుండిమిట్టిపడిభూస్థలిఁగూలెనరుల్ హసింపగన్ ॥

గీ॥ సంగరామోఘమగుతనచంద్రహాస।
మమ్మహోర్జస్వలునిఁదాఁకివమ్మగుటకు।
నివ్వెఱపడినిశ్చేష్టుఁడైనిలిచియున్న।
ధనము దేసఁజూచియిట్లనెఁదారకుండు॥

ఉ॥ నీకసిచే వధింతు నను నిశ్చయ మెంతయుఁగల్గి యుండుటన్।
నీకసిదీరమోఁదితదినిష్ఫలమయ్యెఁగడంగియింకనున్।
నీకినుకన్ గసంబరుపనేమదిఁగోరెదవేనితావకా।
నీకిసులెల్లఁదోడుపడనిల్చియెమర్పుమునన్నునొక్కఁడిన్॥

ఉ॥ నావినియన్నిశాటకులనాథునిఁగన్గొనికాయకంటిరో।
దైవతశాత్రవాభిజనతల్లజయెంతకునైనఁజాలుదో।
నీవువరప్రసాదివగుటిప్పుడెనిక్కమెఱింగిమెచ్చితన్।
గావలెనేనిమృష్టాన్నమును గైకొనుమిచ్చెదనీకుఁదృప్తిగాన్॥

గీ॥ అనియనేకమహార్హంగవాహ్యానుగుస్వాప।
తేయమునవస్నమణిసమవాయమునునొ।
సంగుటయునాత్మనెంతయుసంతసించి।
పసిఁడితేనిఁగనుంగొనియసురవిభుఁడు॥

క॥ పుడమిని రాజాన్వయమునఁ।
బొడమినదోసమునన్నిన్నుఁ బోఁటిమహాత్మున్।
దొడరవలసివచ్చెనుసం।
గడికానిగనెంచుమీయిఁకన్ నననునుచున్॥

గీ॥ పసితనమునుండి కలసిమెలసినప్రత్య।
యితునిచాడ్పున నాకిన్నరేశ్వరుండు।
విడువలేకవిడువలేక విడుచుటయునె।
రఁగివినయమునవీడ్కొని ప్రస్థితుఁడయి॥

క॥ పశ్చాద్భాగంబునర।
తుశ్చక్రములనుసరించిచనఁ బ్రధనతలా।
పశ్చిముడగు తారకుఁడల।
పశ్చిమదిక్తటికిఁ జనియెఁ బాశిజిగీషః॥

ఉ॥ ఘ్రాణనితాంతతర్పణసుగంధవిశేషసనాధమైజగ।
త్ప్రాణపదంబుగావుటను వ్యక్తముసేయుచు నబ్బురంపువి।
న్నాణముఁజూపు గంధవతినాఁదనరారుపురంబుఁబూర్వగీ।
ర్వాణపరుండు తారకుఁడు వర్తనిమధ్యమునంగనుంగొనెన్॥

చ॥ బలములనచ్చటన్ నిలిపి స్పర్శనునింబిలిపించి నిన్ మహా।
బలుడవటంచుఁజెప్ప వినివచ్చితి యుద్ధముసేతకున్ననుః।
గలననెదిర్చెదేయనినఁ గంధవహుండు సురారితోననెన్।
బళిబళియెంతయబ్బురపుఁ బల్కు వినంబడనయ్యె నిత్తటిన్॥

చ॥ పుడమిజగంబునందుఁగల భూతచయంబులజీవితంబులె।
వ్వడను మదేకనిఘ్నములు ప్రోదిగనేనుచరింపకుండినన్।
జెడిసమయున్ సమస్తమును చేత నజాతమునట్లుగావునః।
దొడరుటలగ్గుగాదునను ధూర్జటిమూర్తులలోననొక్కఁడన్॥

క॥ అనుచుఁబలికి వాయవ్యం।
బనెడు మహాస్త్రింబొసంగి యాపృషదశ్వం।
డనుపుటయుఁ బ్రహృష్టుండై।
చనెనటుపయిఁదారకుండు శ్రద్ధావతికిన్॥

ఉ॥ తన్నుఁజయింపసైన్యసహితంబుగఁ దారకుఁడేగుదెంచినా।
డన్నయుదంతమున్ నిజభటాదులచేవిని త్రాడుదాలుపా।
కొన్నభయానకంబయిన క్రోల్పులియట్లయి తారకాదులః।
మన్నిగొనఁ దలంచి ప్రధనంబునకున్ గృతనిశ్చయాత్ముఁడై॥

శా॥ గంధాంధోత్తమయూథనాథములజోకంబొల్చు విక్రాంతులౌ ।
గంధర్వుల్ పదిలక్షలాహవఁపువీఁకన్ శత్రుపింజార్థమై ।
సంధల్పూని యనేకశస్త్రధరులై సన్నద్ధులై వెంటరాన్ ।
సంధించెన్ వరుణుంకు దిగ్విజయదీక్షాధారకున్ దారకున్ ॥

క॥ నీర్వామియు నీర్వామియు ।
దుర్వారౌద్ధత్యమున నెదుర్కొనుపగిదిన్ ।
బూర్వామరబలమునుగం ।
ధర్వబలమునపుడు బిట్టుతాఁకెఁ గలనికిన్ ॥

గీ॥ ప్రాసికులఁ బ్రాసికులునుఁ బారశ్వధికుల ।
ధీరపారశ్వధికులునై స్త్రింసికులను ।
బ్రకటనై స్త్రింసికులును శాక్తికులశాక్తి ।
కులునుఁ గదిసి పెనంగిరి ఘోరముగను ॥

చ॥ బెడిదములైన యాయుధఁపు పిండులరాపిడిచే ఘనంబులౌ ।
మిడుఁగుఱు బారులుప్పతిలి మింటికిఁ బ్రాకి దళంపుటిగ్గులై ।
వడిని ఘనీభవించి సురవర్త్మముఁ గ్రమ్మిన పెన్దమమారమం. ।
దుడువిసరంబులోయనఁగ నొప్పెనుగొప్పదురంపుక్రందునన్ ॥

శా॥ మానీచేదపయాహీనత్వమనుచున్ భర్త్సించుచున్ జాపమౌ ।
ర్వీనాదంబులనింగి ఘూర్ణిలఁగమహోవిక్రాంతులౌ క్రవ్యభు ।
గ్ధానుష్కుల్ కృతపుంఖతాప్రధితులౌ గంధర్వధానుష్కులున్ ।
నానారీతులబాణవర్షములఁదా నంబాడిరన్యోన్యమున్ ॥

మ॥ దురమందున్ దనకడ్డమైన రథులన్ దోశ్చండిమన్ రొప్పుచున్ ।
స్వరథంబున్ వడిఁద్రోలఁ బ్రాజితకు నాజ్ఞాపించి మధ్యాహ్నభా ।
స్కరబింబోపమ తిగ్మమూర్తియగుచుం గంధర్వనాథుండుచి ।
త్రరథుం డేత్తెఁ దాఁకెఁ దారకుని మించెన్ జోనులల్లాడఁగన్ ॥

శా॥ ఆగంధర్వవరేణ్యుఁడట్లుడరి రక్షోధ్యక్షుఁడౌతీయయు।
ప్రాగల్భ్యం బెదఁజీరికిన్బ్రాణమికిన్ దానల్లిక్రవ్యాద్రధా।
భోగంబుల్ నిశితోగ్రసాయకమయంబుల్ జేసినో నేయుచున్।
జాగర్యాన్వితుఁ జేసెఁ దారకును పేక్షాస్వాపసంయుక్తునిన్॥

చ॥ ఎలనగవానవాబ్జమున కింపొసఁగన్ ధృతచాపరోపుఁడై।
నిలునిలు మోయి చిత్రరథ నీదగుకోల్తల కేను మెచ్చితిన్।
బలువురుజూచినవ్వుకొనఁ బ్రాణభయంబున నాజిభూమికిన్।
దొలఁగకు మీయటంచుఁ బలుతూపులఁ దారకుఁ డేసె నాతనిన్॥

ఉ॥ తారకుఁడంతనిల్వక రదంబున రుద్రుఁడువోలెఁ బొల్చుచున్।
ఘోరశరంబులంగములఁ గ్రుచ్చినఁ జిత్రరథుండు భూర్యసృ।
గ్ధారలు జాలుగట్టితొరఁగన్ గుసుమించినవాతపోధధా।
క్షీరుహమోయనన్ బొలిచెఁ దేరిపయిన్ క్షతజాక్తదేహుఁడై॥

క॥ అలఘుబలవిక్రమంబులఁ।
బొలిచెడునీయాతుధానమూర్ధన్యుఁడలం।
తులఁబోవువాఁడు కాడని।
తలఁచి తదభిషేణనానుతప్తహృదయుఁడై॥

చ॥ వరమగువజ్రమున్ జెలుప వజ్రమె కావలెఁ గావునన్ మహో।
శరహతికిన్ మహాశరమె చాలినదౌననుచున్ దనూనపా।
చ్ఛరమరివోసి యగ్నికణసంహతులాకసమెల్లఁ గ్రమ్మఁజి।
త్రరథుఁడు తారకాసురునెదన్ గుఱిగాఁగొని యేసె నార్చుచున్॥

శా॥ ఆయస్త్రంబరుదెంచుచుంటగని శౌర్యంబొప్పఁ దైత్యుండునా।
గ్నేయాస్త్రంబును వింటఁగూరిచి జ్వాలతోలాప్రచండంబుగా।
నేయన్ దివ్యగమున్ మిథోనిహతమై యేపేదిసంక్షీణమై।
పోయెన్ దారకువాహినీచరులు సంఫుల్లాస్యులై చూడగన్॥

సు॥ మఱియున్ ఘోరపునారసంబొకటి శంపాదీప్తియారావింటనే।
ద్దైలసంధించి విభావరీచరకులాధీశుండు వక్షస్థలిన్।
గుఱిగాఁజూచి కడంకనేయుడుఁ గులక్ష్మోణీధరేంద్రంబొనా।
నొఱగెన్ జిత్రరథుండు తేరిపయిఁదస్యుల్ సంతసంబందగన్॥

క॥ దళవాయియుప్పగిదిఁగ।
శ్మలమునఁబడియుంటఁజూచి క్షత్త్రయమునన్।
బొలికలనికి నయ్యరగము।
దొలఁగన్ దోలికొనిచనియెఁ దూరంబునకున్॥

ఉ॥ పత్రరథేశ్వరుండగు సుపర్ణునికంటెఁ దరస్వియైనయా।
చిత్రరథుండు తారకునిచేఁ జిక్కుఁడౌటమొఱంగి శేముషీ।
చిత్రశిఖండిజుండగు ప్రచేతుఁడు సంయదసాధ్యుఁడైనయీ।
శత్రునితోడనిప్పటికి సంధియమేలని నిశ్చితాత్ముడై॥

వ॥ ధృతిమత్పుష్కలుఁడైన తారకునిఁ బ్రీతిన్ గాంచి యయ్యాదసాం।
పతిఁపొంశూరవరేణ్యనాయెడ సుహృద్భావంబువాటించిని।
శ్రితగంధర్వుఁడవౌటఁగుంగుఱుతుఁగా ప్రేమించినాయిచ్చునీ।
సితగంధర్వములన్ గ్రహింపుమనియిచ్చెన్ గర్కముల్ నూరిఁటిన్॥

క॥ ప్రత్నంబులై విహాయస।
రత్నంబునకుద్దియగుచు రాజిల్లుచతా।
రత్నాకరజాతములగు।
రత్నములనొసంగె మఱియు రాక్షసపతికిన్॥

మ॥ వరుణుండిచ్చిన కానకలన్ గొని సఖిత్వంబొప్పఁగా సయ్యబీ।
శ్వరునిన్ వీడ్కొని ప్రస్థితుండయి నిజాజ్ఞన్ గొంతసైన్యంబుముం।
దరుగన్ నైరుతుఁడేలుభూరిపరిణాహంబైన కృష్ణాంగనా।
పురమున్ డాకొనెఁ దైత్యనాథుఁడుజనంబుల్ శిష్టముల్ వెంటరాన్॥

ఉ॥ వచ్చినవాఁడు తారకుఁడు వైరవిరాడభిమానవిత్తపా।
టచ్చరుఁడెందుఁజూడనిదడంబులతోడ భవజ్జిగీషుఁడై।
యిచ్చటికంచు వైశమున నేగి దివాణవుఁగోటికాంౘినా।
క్రుచ్చుడు నైరుతుండెడఁదఁగొంకును సంతొసమున్ బెనంగొనన్॥

ఉ॥ మన్ననతోడఁ బెండిలికొమారు నెదుర్కొని తేరబోవున
ట్లున్నతవంశజాతులయియొప్పు నమాత్యులు పాదచారులై।
క్రన్నన వెంబడిన్ జనఁగాలినడన్ జని యర్హరీతిను।
ద్యన్నలినా ప్తతేజుఁడగు తారకునింబొడగాంచి యిట్లనెన్॥

ఉ॥ బెట్టిమహైన వేల్పులకుఁబెద్దయులోఁగినదైత్యులెల్లనీ।
యట్టిమహానుభావుఁడు నిజాభిజనంబుననుద్భవించుటన్।
దిట్టపుటానరాగలిగి నిర్భయులై నుడివాలుజాతివాల్।
జెట్టులనేనియున్ సరకుసేయని బల్లిదులైరి నేఁటికిన్।

శా॥ ఖ్యాతిస్ఫీతపరాక్రముండొకఁడు నీక్ష్మామండలిన్ గ్రవ్యభు।
గ్జాతిన్ బుట్టకయుంటనింతదనుకన్ సత్యంబుగా నొండ్లతో।
దైతేయాన్వయసంభవుండనని ప్రస్తానంబునన్ వాకొనన్।
ప్రీంతత్వంబును రోఁతయున్ బొసఁగుచుండెన్ జుమ్మీ శూరాగ్రణీ॥

క॥ అలోపముతీఅసుహా।
కాలోపముఁడవగునీవు గలిగితివీప్రా।
వేలుపులవంగసంబున।
వేలుపులకు నగ్గలంపు వెత మదిసొదవన్॥

శా॥ ధన్యంబై ధరణీస్థలిన్ నిఖిలగోత్రామండలాధీశమూ।
ర్థన్యంబై ప్రథఁగాంచె నీకతమునన్ దైత్యాన్వవాయంబునే।
మన్యాధార్ద్యమునన్ హరిత్పతులలో న్యూనత్వముంబాసినం।
మాన్యత్వమ్మొనగూడి యుల్లసిలితిన్ మధ్యందినార్కద్యుతీ॥

చ॥ హృదినను నన్యుఁగాఁదలఁప కిష్ట్యనుకూలునిగా నెఱింగినా।
యుదవసితంబునన్ గలిగియున్న ధనాదిపదార్థమెల్లనీ।
యదియగు వెంచి నాదునిలయంబునఁ బైనపు సేదదీఱఁగా।
న్నిదినములుండి నన్నుసురు వెచ్చలిగాఁగొని యాదరింపుమీ॥

క॥ అనివిషయంబునఁ బ్రార్థిం।
చిన నైకొని తారకుండు సేనలబాహ్యా।
వనినిలిపి యతనితోడుతఁ।
జనెఁదనయల్లుడుకొమాళ్ళుసహాయాతులుగాన్॥

శా॥ భ్రాజిష్ణూన్నతసౌధవంమనిది గారాబంబునన్ దర్శని।
ద్రాజద్ధ్యాదుల వేళలేమఱక నిర్వర్తించుచున్ భానుము।
త్రైజుల్ దారకయామినీచరవరుల్ దేవోపచారంబులన్।
బూజింపన్నికపాత్మజుండతఁడు హృత్పూర్ణప్రమోదుండుగాన్॥

సీ॥ విరివింటిమొకిమీఁకరసానఁదీరిన సమ్మోహనాస్త్రిరాజంబనంగ।
నికరఁపుజగముమన్ననితోఁ బొలయుల్కఁబూనివచ్చిన పల్కపొలఁతి [యనఁగఁ।
గరపదాదిప్రతీకములతో దృగ్గోచరంబైన శృంగారరసమనంగ।
గమనసంభాషణగ్రహణాదులోనగూడిపొలుచుపోఁతపసిండిబొమ్మయ [నఁగఁ।
దనదుశశికాంతకేళిసౌధంబునందు।
నొంటిగావిహరించుచునున్నదాని।
నైరుతునమంగుకొమరితఁగారియనెడు।
దానిఁబొడగాంచె నొకనాడు తారకుండు॥

శా॥ చూచె నైరృతయాతుధానసుతయున్ శుండాలహస్తోపమా।
నీచాసేచనకప్రవేష్టుఁబలభిన్నీలోల్లసత్కేశువ్యా।
కోచాంభోజదళాయతాక్షుఁబృథువక్షున్ సింహమధ్యున్ జ్వల।
చ్ఛోభదీషేశసవర్ణసంహనను రక్షోనాథునత్తారకున్॥

గీ॥ చాటుచాటుననుండి యాశరదుహితయు।
నోరగ్రేగంటిచూపులఁ దారకుఁడునుఁ।
జూడసాగిరి రెప్పవాల్చుటయెమాని।
యొండొరులనంకురిత విమోహులయియపుడు॥

ఆ॥ మూలఁదేనిముద్దుచూలి యమ్మగనితో।
నతనురణమొనర్పనభిలషించి।
కడిఁదిగుండెదిటవుచెడి విహ్వలుండుగా।
నతనిమీఁదఁబరపె నంబకములు॥

చ॥ జలజదళాక్షియెంత నెరజాణయొ దుర్జయబాహువీర్యలి।
బ్బలయెకి మీనివిక్రమవిభూషణుఁ జిత్రరథున్ దురంబునన్।
గెలిచినయట్టి మేటిమగనిన్ నిసిద్రిమ్మరితేనివాఁడిచూ।
పులనె ప్రణేయుఁజేసికొనెఁ బ్రోడతనంబున నుంతసేపులోన్॥

ఉ॥ ఆతనుమధ్యయున్ దితిసుతాధిపునందు భృశానురక్తయై।
యాతనిఁదప్ప వేఱొకని నెవ్వనిఁ బెండిలియాడనంచుఁదాఁ।
జేతనయందు నిశ్చయముసేసి యకైతవభక్తికంబుగాఁ।
జోతలొనర్చె నింమధరసుందరికిన్ నిజవాంఛితాప్తికిన్॥

శా॥ దీర్ఘాలోచన వారిజాతతరుణాదిత్యుండు మాయయ్యదాఁ।
దీర్ఘాలోచనలేక నన్నితనికిన్ దేవేరిగానీకభూ।
రర్ఘంబౌరతనంబు కాకిమెడనొయ్యన్గట్టు చందంబునన్।
నైర్ఘృణ్యంబున వేలుపాలసునకున్ నన్నిచ్చి కుందించునే॥

క॥ అనికడు నగ్గలమగువల।
వునఁబెకుల్ తెఱఁగులఁ జిత్తమునఁ దలరుచునుం।
డెను నైరుతసుతతారకుఁ।
డును నతిరక్తుఁడయి యప్పుడుమఁ గనుఁగొనుచున్॥

చ॥ పరుషులు మోటులంచొరులు పల్కెడు దైత్యులజాతియందె కా।
దరయఁగ మూఁడులోకములయందలి క్రొందలిరాకుబోండ్లలో।
గరమరుదైనచెల్వమునఁ గ్రాలెడునీపొలదిండిరాచకూ।
తురికెనవచ్చునంతటి వధూటులు లేరని నిశ్చయించెదన్॥

ఉ॥ అందఱుచూచి మెచ్చుకొను నందముగల్గిన స్త్రీలనుర్విపై।
నెందటిఁజూడలేదు జగమెల్ల నిజాయతలోచనాంచల।
స్పందమునంగడంగి స్వవశంబుగఁ జేసికొనంగజాలునీ।
సుందరిబోలునిందుముఖిఁజూచి యెఱుంగనుగాక యెన్నఁడున్॥

ఉ॥ ఈలతకూనమానికము నెవ్వనికై సృజియించియుంచెనో।
వేలుపుఁబెద్దయంచు మదివీఱిడిసందియమందనేలయీ।
వాలుగకంటినాయదిగవ్రాయకయుండిన వంటయింటికిం।
దేలతఁడెందుఁబోగలఁడు తీర్పనె రేపటియాజినాతనిన్॥

క॥ అనుచు వలపువేఁదుఱ్ఱవే।
గునఁబొగులుచునుండెఁ దారకుఁడు నైరుతుఁడున్।
దనుజాదనుజాగ్రగణులోక।
రినొకరు కామించుటెఱిఁగి ప్రియమంది మదిన్॥

ఉ॥ యాతుమహాకులుఁడు నికషాత్మభవుండతిలోకవిక్రముం।
డాతెఱఁగంటిదాయదొరయల్లుఁడు కావుటకున్ నితాంతసం।
ప్రీతమనస్కుఁడై తనమప్రేయసినైకొనఁజేసి భావిజా।
మాతనుజేరి యర్హముగుమన్ననతోఁ బొడగాంచి యిట్లనెన్॥

చ॥ శ్రుతశతనైమిషిన్ మహితరూపమునన్ మనజాతియందున।
ధృతమగుబాహువీర్యమున మూఁడుజగంబులయందునన్ సహిం।
ప్రతిగనెసంగునీకుఁ దగుప్రాభృతమేమి యొసంగఁజాలుమన్।
దితిసుతనాథ సేనసలె నిర్వృతినొంట ప్రసిద్ధమేకదా॥

ఆ॥ రాక్షసాన్వవాయరత్నంబ నాయంచుఁ।
బూజ్యభావముంది పొసఁగనాడు ।
హితవరిగ్రహంబు నీకొని ప్రియబాంధ।
వమునఁగలయ నల్లువాఁడవగుము ॥

క॥ దనుజకులతిలక నాకో ।
రినప్రార్థన నన్యథాకరింపక నాయం।
దనుకంపఁబూని బంధుగు ।
తనమునఁగలిపికొన వేఁడెదన్ స్వీయులలోన్ ॥

ఉ॥ నావుడుఁ దారకుండనియె నైరుతమానుక మానసప్రమో।
దావహమైన నీపలుకునందలియర్థమెఱుంగనయ్యెన ।
ద్భావమెలర్ప నీకొమరితన్ సహధర్మిణిఁగాఁగ నీవునా।
కీవలతేని నేనొకటియేర్పడఁ దెల్పెద నట్లుచేయుమీ ॥

గీ॥ ప్రసువుమాతామహుండు నగ్రజుఁడు గలఁడు ।
రుండు మున్నగుతగుపెద్దలుండ వార ।
లెఱుఁగకుండ స్వతంత్రించియేను గొండి ।
కనుతథాస్తనధర్మువు కాదుచూవె ॥

చ॥ కడఁగినయీహరిద్విజయకార్యము దీరిచినేనుబెంకికిన్ ।
వడిఁజనుదెంతు మీరటకువచ్చి హృదాశయముల్ మదగ్రజ ।
న్మఁడుమొదలైన ముఖ్యులగనుంగొని చెప్పుడువారిసమ్మతిన్ ।
బడసి పరిగ్రహింతుఁ బ్రియబాంధవమొప్పఁ భవత్తనూభవన్ ॥

గీ॥ నెమ్మిఁగుశించుచు నిర్వహణీయమైన।
కడిఁదిపనిగల్గియుండియుఁ దడసితినట
కెలివియలరార శిష్టచికీర్షితంబు ।
దీర్పనరిగెద సెలవిమ్ము దితిజముఖ్య ॥

గీ॥ అనుడు నెట్టకు నేనియు ననుమతించి ।
నైరుతుఁడు వీడుకొల్ప సైన్యముల నెల్లఁ ।
గూడఁ దోడ్కొని యత్తారకుండు వోయెఁ ।
జమున సైదోడు బాలించు సంయమినికి ॥

క॥ కడగవనుకడఁగడిమిడిన్ ।
దడములవిడియింది నల్లద్రావుడు ఱేఁడం ।
గుడుమడిపి నొక్కదినని పెన్ ।
బడెతాలుపుకడకు రాయబారంబునకున్ ॥

ఉ॥ పంచిన నేగి న్యాయపుసభన్ గొలువుండి పరేతులన్ విమ ।
ర్శించుచునున్న యంతకునిఁ జేరి భవత్పరిముట్టడించిన ।
క్తంచరవంశదీపకుఁడు తారకవీరుఁడు నీకుఁ జెప్పఁబు ;
త్తెంచినవాక్యముల్ కలవు దెల్పెద విన్మని దూతయిట్లనెన్ ॥

చ॥ నియుతమదేభశుష్ముఁడును నిర్జరశాత్రవలోకచక్రవ ।
ర్తియునగు శూరపద్మునకుఁ బ్రేముడి తమ్ముఁడఁ దారకుండన ।
గ్రియుని యనుజ్ఞచేఁ దెసలఁ గెల్చుటకై పనిబూనివచ్చితిన్ ।
బయనముగమ్ము రమ్ము మగపాడి దలంచి దురంపుసేతకున్ ॥

శా॥ ఆతిగ్మాంశుఁడు నేనుఁ గశ్యపునపత్యంబౌటచే నారయన్ ।
జ్ఞాతేయంబున నన్నబిడ్డవుసుమీ నాకీవు భాస్వత్సుతా ।
నాతోడన్గలహంబువెట్టుకొనకున్నన్ నాయెడంగల్గునీ ।
భ్రాతృవ్యత్వము సార్థకంబగుటయెప్పాటన్ దటస్థించెడున్ ॥

క॥ జాలముసేయకరుగుదె ।
మ్మాలమునకుఁ జాలవేని యసమువిడిచిమా ।
యేలికకుపాయనములిడి ।
కాలుఁడ నీవాఁడననుము గాచెదనిన్నున్ ॥

వ॥ అని దూతపలికిన ॥

గీ॥ వసుధఁబెద్దయుఁ గినిసినవానికెతని।
నుపమగాఁజెప్పుదురో యమ్మహోగ్రమూర్తి
యంతకుండత్యమర్షణుఁడయ్యె నతని।
కుపితరూపంబువర్ణింపఁ గొలఁదియగునె॥

క॥ దూతవచించినకర్ణా।
లాతాయితములగు నుడువులన్ వినియమునా।
భ్రాతవిలయావసరజీ।
మూతస్తనితనిభవచనముల నిట్లనియెన్॥

శా॥ ఏమీవింగడముల్ వినంబడియె నేఁడెవ్వాఁడొ దైత్యుండుసం
గ్రామంబేడ్తెఱఁజేయఁగోరి యటసంకల్పించినన్ విష్టప।
స్తోమంబంతయుఁబంచపక్షణముల న్భ్రుంగింపశక్తుండనా।
నామీఁదన్ రహినెత్తివచ్చెనట విన్నారయ్య సామాజికుల్॥

చ॥ స్ఫిరవియదంగణ స్ఫ్రగతిభీమవిశంకటతిగ్మహేతియా।
నెరవలిమీదికిన్ గవిసియేది పతంగములార్పఁజాలినన్।
నిరతిశయోల్బణద్రవిణునిన్ సమవర్తినసీకదుర్జయున్।
మరమునఁగెల్వఁజాలుదురు తుంటరిసోఁకుల సంశయంబుగన్॥

క॥ తనతోడసువాయుటకుమృ।
త్యునిలయమునకనిచె నగ్రియుఁడు దిగ్విజయం।
బనునెపమున జ్ఞాతిశ్చే।
దనలేనకిమనినవారలవిచక్షణులే॥

క॥ చేఁదయ్యెఁగాక యసురా।
వేఁచుటసురకున్ సెబాస్ తివిరియేటికిఁగా।
లూఁచు మహాశీవిషఫణ।
మీఁదికి ముఖమయి నతండు మిడుకఁదలఁచినన్॥

చ॥ అమరులకున్ నిసర్గమున నాతఁడు ద్వేషణుఁడౌటచే నవ।
శ్యము పరివర్జనీయుఁడగుటర్థ్వాతమంబగుఁగాని సంధికా।
ర్యమునకు మాత్రమర్హుఁడనరాదతనిన్ గలలోననైనన।
ర్థ్యమగునె తారకాఖ్యతనకక్షిగతత్వము గల్గకున్నచోన్॥
గీ॥ ఏతదాహృతికి మదీయభృత్యులశ్రమ।
పరుపనక్కఱలేకుండఁ బహుసహస్ర।
చేతనులనాకుఁ దెచ్చియిచ్చినకతమున।
నతఁడు ప్రత్యయితుఁడ లెస్స యరయనాకు॥
వ॥ అట్టిమహాహితుని మనోరథంబవశ్యంబునుఁ దీర్పనవలయుఁగా న నిదెవచ్చెదనని చెచ్చెరనచ్చి కురునకున్ వ్రాకుచ్చునదియని యతనినని పి తనకట్టడచేఁ గట్టాయితంబులైన గట్టిమొనలతోఁ గాలాంజనశిలోచ్చ యంబును, వెక్కిరించు నెక్కిరింతయగు జక్కిసూడు నెక్కి దక్కినం పుఁదొరముక్కడిరక్కసిమూఁకలనుక్కడంచుటకై పుడమిగ్రక్కదలవ డచక్కికిన్ జనియె నక్కడ॥

చ॥ భువనభయానకోద్ధతచమూతతితో నరుదెంచుచున్నయా।
రవిసుతునిన్ గనుంగొని సురద్విడధీశుఁడు మీరుముందుగా।
గవియకుడంచు సేనలకుఁగట్టడచేసి కడంగిమొక్కటిన్।
బవరముగాలుతో నొనరుపన్ నిలిచెన్ బృతనాపురోవనిన్॥

మ॥ నడిపాయంపుఁగడింది సింగమువలెన్ నాసీరమందున్నయా।
తఁడె దైత్యేశ్వరుఁడైన తారకుఁడు తథ్యంబంచు లెంకల్ వచిం।
పుడుఁ గీనాశుఁడు సస్మదాతిశయసంపుల్లాస్యుఁడై దుంతత।
త్తడినత్తారకుపంకకున్ బఱపి సోత్రాపసంబుగా నిట్లనెన్॥

చ॥ కటకటనిన్నుఁ గన్గొనినఁ గాటముగామది జాలివుట్టెడున్।
స్ఫుటలలితేహాభోగములు బొందిసుఖంపడు ప్రాయమైనపి।

న్నటితనమందె నిర్దయమనస్కులునుం దుగపిల్లనాకుటం।
గటకనిచెన్ బ్రతీపమయి కర్కశదైవము నిన్నుఁదారకా॥

చ॥ బుధజనగర్హితంబయిన పుట్టువునన్ దగురోఁతపుట్టియా।
యధమశరీరముం దొఱఁగనాస్థఁగడంగితి కాకవిష్టప।
క్రథనమె యాత్మకృత్యముగ రాజిలునప్రతివీరుఁడైనదం।
డధరునెఱింగియుండియు దృఢంబుగనింతకు సాహసింతువే॥

మ॥ శమితానేకమృగవ్రజంబగు మహాశార్దూలరాజంబువా।
సముగావించుచునున్న కొండగవినార్షభ్యంబుదాఁజొచ్చుచం।
దమునం జన్మిపరాసనంబె నిజకృత్యంబైన నాబారిక।
గ్గశువై వచ్చితి వెందుబోగలుగుదింకన్ దైత్యవంశాధమా॥

క॥ తిలకింపుము మదధిష్ఠిత।
లులాయమె తుపాకిమందులోఁగాలినయిం।
గలఋవలె రూపుమాపుం।
బలలాశనకులజనీదు బలములనెల్లన్॥

క॥ అనవుడు లేనగవానన।
ముననొలయగ యాతుధానముఖ్యుఁడుఁగుదెదా।
ల్పునకనియె వర్షుకఘనా।
ఘనరసితమును నిరసింపఁగలుగు నెలుఁగుతోం॥

చ॥ నలినభవుండు నిర్ణయమొనర్చిన యాయువు సెల్లినట్టిదే।
హులయసువుల్ హరించుటయె యొకర్మహత్తరవిక్రమంబుగాఁ।
బలుమఱునుగ్గడించెదవు బాఁదితిఁజచ్చిన పాము నేనుదో।
ర్బలమునననంచు మెచ్చుకొనుపౌరుషశాలిని బోలితంతకా॥

చ॥ తనువులునొవ్వఁ దండ్రియునుఁ దల్లియునేడ్చుచునుండఁ బిడ్డలన్।
బెనువగఁగూరియాండ్రుదు విలపించుచునుండగఁ భర్తలం బరా।

సనమొనరించి తెచ్చుటకుఁ జాలినయొకింతయు లేదుగానిభం।
డనముననిన్ను మార్కొనఁగడంగిననాపయిఁ జాలివుట్టెనే॥

క॥ ఓదుంతరవుతనీయు।
దైవ్వదర్థ్యంబెట్టిదో విదితముగాకున్నన్।
నీదగునాత్మశ్లాఘా।
వైదుష్యముమాత్ర మెఱుకపడె వాక్ప్రౌఢిన్॥

మ॥ ములుకుల్ విల్లొని నిల్చియుంటిని దేనీ మ్రోలన్ మృషాభర్త్సనం।
బులకున్ భీతిలినూహటింతుననినీబుద్ధిన్ దలంతే మొనిన్।
గలనన్ మార్కొనకేగనిక్కముగ విక్రాంతుండనాదేనిర।
జ్జులచేఁగాలముపుచ్చకాలమునినీ శూరత్వముల్ జూపుమీ॥

గీ॥ నావుడు నమర్షమున మోము జేవురింపఁ।
జులుకుచూపులఁ దారకాసురునిమీఁద।
నొలయఁజేయుచు నొక మేటివిలుగయికొని।
యతిదృఢంబగు నల్లియనటనిఁగూర్చి॥

ఉ॥ నేఁడుడివోక నాయెదురనిల్చుటకోపుదు వేసి నామతే।
వేఁడిమికొంతచూడుమని వేఁడి వెలుంగు కొమారుఁ డేత్తెఅన్।
వాఁడిలకోరులాదితిజవర్యుని కాంచనదంశనంబునన్।
గాఁడనడర్చి తారకుఁడకంపనుఁడై నిలుచుంటకుగ్రుఁడై॥

మ॥ మగుడన్ దండధరుండు తారకుని నొంపన్ దీవ్రనారాచముల్
నిగుడన్ జేసిన శాతభల్లముల నన్నింటిన్ దునెల్ సేసి లే।
నగవాస్యంబుననొప్ప నప్పులలభుజాన్నాధుండు ఘోరంపుటా।
శుగముల్ నాల్గడరింప వానినడుమన్ జూర్ణించెఁ గీనాశుఁడున్॥

క॥ ఇతరేతరప్రహితవిని।
హతులన్ గొంతదనుకన్ గృతాంతసురద్వి।

ట్ప్రతులిరువురు బోరిరివి।
స్మితమై యుభయబలముగ సమీక్షింపంగన్॥

క॥ ఆపగతునిఁ గనుఁగొనిహ్లాద।
యాపగతక్లాంతియు నధికామర్షుఁడునై।
యాపగలుతేని కొడుకొక।
యాపగమై నెత్రువాఱనాతని నేసెన్॥

ఉ॥ అశరవీరరత్నమగు నాబలియుండుడివోవకోర్చిపం।
చాశదజిహ్మగంబులు వెసంబరగిందిననొచ్చి దక్షిణా।
ధీశుఁడువానిపోటెద నుతింపుచుఁ గల్పవిభావసుప్రతీ।
కాశములైన క్రూరవిశిఖంబులఁ దాఁకునొంచెఁ దానునున్॥

ఆ॥ దానఁగిదిసి యాతుధానేశ్వరుండొక।
వెడఁదవాతియమ్మువింటఁదొడిగి।
గుదియతాల్పువింటి గొనయంబునడిమికిఁ।
దునియనేసె దుర్హృదుల్ కలంగ॥

ఉ॥ వేఱొకవిల్లువూను తెఱపిన్ రజనీచరనాథుఁడేసెనా।
మాఱుతుమీఁద నొకర్రశితమార్గణమయ్యదివారవాణముగ।
దూఱియరుంతుదంబయిన నొచ్చి సుమూర్ఛము జెంది యంతలో।
దేఱియవాగ్గిగీశ్వరుఁడతిప్రతిఘాన్వితది త్తవృత్తియై॥

ఉ॥ శంబసుదర్శనాది సదృశంబసుహారియునైన ఘోరరో।
పంబినసూనుఁడుగ్రుడయి పంబిన యేడ్తెఱఁజద్బితంచునే।
యంబరమర్నిరీక్షుమయి యంబరమందు నిజస్ఫులింగవా।
రంబొలయంగ మీఁదికడరం బొలదిండులతేఁడ కంప్రుఁడై॥

క॥ నిండుతెగదీసి యొకర్రప్ర।
చండమగుప్పషత్రముగ వెసంబరపుటయున్।

షండుచునదిచని ప్రతిశర।
ఖండనమొనరించెఁ జముమొగము వెల్వెలఁబోవన్ ॥

శా॥ స్త్వాష్ట్రప్రాణులు ధర్మతారకులు గాంధర్వంబు యామ్యంబువా।
యవ్యంబైంద్రము వైష్ణవంబజశిరం బాగ్నేయముల్ లోనుగా।
దివ్యాస్త్రంబులఁబోరిరిద్దఱును మూర్తింగొన్న రౌద్రంబునా।
గవ్యోమాతిద్వయదూరమాకసమునన్ గ్రమ్మన్ స్ఫులింగచ్ఛటల్ ॥

చ॥ ఒడికమెలర్ప బత్తడికినుండి వెలార్చుటకార్ముకంబునన్।
దొడుగుట గోచరంబులుగ దుర్వృదనస్త్రములెల్లఁ ద్రుంచుచున్।
నడుమఁ బృథగ్విధప్రహరణమ్ములు పైనడరించి నొంచుచున్ ॥
గడునలయించె నబ్బఁపుమగండగు తారకుఁడాకృతాంతునిన్ ॥

చ॥ అనితరసాధ్యుఁడై తనరు నాశరవీరుని యంపపోటులన్।
దనువున నెల్లెడన్ రుధిరధారలు సారణులై స్రవింపగా।
వినతనయుండు కాపిసెలయేళ్ళఝురంబులతోడి యంజనా।
వనిధరమోయనంబొలిచె వాహనమైన కటాదమాళిపైన్ ॥

ఉ॥ ఏటులచెననీకమున నెంతయు నొచ్చియు నప్పరేతరా।
ట్కోటమునన్ బొసంగునడి కోర్వఁగఁజాలక నొచ్చుకొంచుఁబో।
రాటము పౌరుషంబునకునై యొనరింపుచునుంటఁజూచియ।
మ్మేటిమగండు తారకుఁడు స్మేరముఖుండయి యప్పుడిట్లనెన్ ॥

ఉ॥ మిక్కిలి డస్సినాడవు సమీకము సేయుటమాని కొంతసే।
పొక్కడవిశ్రమించి మఱియొక్కబలాఢ్యునిఁ గయ్యమాడనా।
దిక్కునకంపి నీయలఁతదీఱినపిమ్మటరమ్ము క్రమ్మఱన్।
నిక్కపుమాటవాకొనెద నిన్నిక నేయనచుమ్ము శ్రాంతునిన్ ॥

చ॥ భువిపయి రాజవంశమునఁబుట్టినదోసమునన్ బ్రతీక్ష్యులై।
నెవడినమిమ్ముబోంట్లనవినీతుఁడనన్లైదిరింప నుద్యమిం।

పవలసివచ్చె నిన్నిటుశ్రమంపడఁజేయుటకుమ్మలింపకో।
రవిసుతయింకనాయెడఁదిరంబగు సౌహృదముంచుమీ ఘదిన్ ॥

వ॥ అనుటయుఁ దారకునకు నరుణదారకుండిట్లనియె ॥

మ॥ చిరకాలార్జితమౌ తపస్సుకృతరాశిం బుత్రరూపంబుగా।
నరవిందాసనునబ్బురంపరపుమాహాత్మ్యంబుచేనొప్పన।
ప్పరమర్షీశ్వరుఁడస్మరీచిసుతుఁడుత్పాదించెఁ దథ్యంబుగా।
కరయన్ నీవొకదైత్యమాత్రుఁడవె లోకాతీతదోర్విక్రమా ॥

గీ॥ పుడమి నాలుగుచెఱఁగులు గడిమిఁగెల్చి।
యేలుసార్వభౌముఁనిగనైననీసడించి।
పేదమేకమునువోలె దెప్పించునాకు।
నళుకరితనమ్ము సంప్రాప్తమయ్యె నిపుడు ॥

శా॥ ఏనన్నింటఁ బ్రగల్భుఁడన్ మదధికుండెవ్వాడు లేడంచుమ।
ర్త్యానంబూనుట యెంతవానికి ననర్థంబంచు మాబోంట్లకున్।
జ్ఞానంబున్గలిగించు పొందెఁదను భృత్యుందోహసర్గాపరా।
చీనుండౌ పరమేశ్వరుండు సృజియించెన్ నిన్ను శూరాగ్రణీ ॥

చ॥ దిశలనుముంజయింపఁగలదిట్టలు లేరని విఱ్ఱవీగుమా।
దృశులకుఁ గర్వభంగమొనరింపగవచ్చిన బాహువీర్యక।
రక్షకుఁడవటంచెఱుంగకలుకన్ నినునొక్క విభావరీచరా।
పశదునిగా నెదందలఁచి పలికితిఁగొన్నియసుత్యనోక్తులన్ ॥

క॥ నాయతివాదముమఱదిఘృ।
ణాయత్తస్వాంతుఁడవయి యసురపదిబృథా।
నాయర్పించుచునున్నయు।
పాయనము గ్రహింపు మాప్తభావమెసంగన్ ॥

వ॥ అనిపలికి ॥

శా॥ ఇచ్ఛన్ దారకుతోడుతన్ జెలిమి హాయిన్ గోరుచున్ విక్రమ।
స్వచ్ఛంబుండగు నాసురారికి మహావాహీన వారాశిజ।
స్వచ్ఛానల్పమహార్ఘమౌక్తికమయంబై యొప్పుచున్నట్టిదే।
వచ్ఛందంబొసఁగెన్ బ్రదేశనముగా వైవస్వతుండత్తఱిన్ ॥

వ॥ మఱియు మహాధనంబులగు రతనంబులును, నధికతరతారుణ్యలావణ్యచాతురీభాజనంబగు భుజిష్యాజనంబును, నుచ్చశిలోచ్చ్రయోపమేయంబగు స్వాపతేయంబును నొసంగినం గైకొని చీఁకటిసూడుచూలిచే వీడుకోలువడసి గీర్వాణరిపుతల్లజుండెల్ల రాణువలతో నమరవల్లభజిగీషుండై సమరంబునకు నమరావతీపురాభిముఖుండై చనియె నప్పుడత్తారకాసురుని యసాధ్యత్వంబు నివేదించుటకై శ్రీదాదులు గోత్రభేదిపాలికి సందేశహరులననుపుటయు వారందఱు నైకకంఠ్యంబుగాఁ బురందరుతో నిట్లనిరి ॥

ఉ॥ దైవతసార్వభౌమ వినుతారకుఁడంచొకరుండు మమ్ముజ।
న్యావనినోర్చి నిన్నుఁజెనయన్ జనుదెంచుచునున్నవాఁడు చే।
లావును నేర్పునగ్గలమలంతులఁబోయెడువాఁడుకాఁడునాఁ।
డీవును నోర్వఁజాలవనుమీ సురసేనలతోడఁగూడియున్ ॥

శా॥ బాహాశక్తిసమృద్ధినేరికెదిరింపన్ రానివారిన్ జగ।
ద్ద్రోహైకవ్రతులం మహాసురులమున్నున్మాడె నేఁడమ్మహా।
మాహాత్మ్యున్ వనమాలిఁ దోడ్పడుటకున్ బ్రార్థించియవ్వీరుఁద।
త్సాహాయ్యంబునఁ గెల్చినిల్పుకొనుమీ స్వారాజ్యమున్ వాసవా ॥

చ॥ వలయునెదైత్యమాత్రుఁ గెలువన్ హరిసాయమటంచు నెక్కటిన్।
దలపడె దేనినొచ్చెదవు తథ్యము మానుడి నమ్మితప్పక।
బ్బలియునడంపనాశ్రితకృపాళుఁ జనార్దను నాశ్రయింపుమీ।
గెలుపొనగూడునట్లయినఁ గేశవదేవుననుగ్రహంబునన్ ॥

వ॥ మేము స్వానుభవంబున నతని యతిలోకబలపరాక్రమంబుల తెలుంగులెటింగియుండుట నింతయొత్తిచెప్పితిమి మీఁదనీచిత్తంబని తమ మాటలుగా నీతోడవిన్నవింపఁగిన్న రేశ్వర శ్రాద్ధదేవాదులు మమ్ముఁబు త్తెంచిరింకముదలయిచ్చెదేని పోయివచ్చెదమని వాక్రుచ్చి దూతలాతె అకంటిదొరచే ననుజ్ఞాతులై తమతమమనికిపట్లకుఁ బోయిరనంతరంబ॥

ద్రుతవిలంబితవృత్తం॥ ఉపనిషన్నిగమాఘపనాయితా।
కపటహృన్నిహికాతపనాయితా।
ద్విపమహాసుర వృత్రసుధాకరా।
యపరిమేయమహామహిమాకరా॥

ఇంద్రవజ్రవృత్తం॥ వారాశితూణా కరవల్గదేణా।
పారాశరీంద్రాశయపద్మహంసా।
హీరాభదేహా వృషభేంద్రవాహా।
వారాణశీపట్టణవల్గువాసా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు షష్ఠా
శ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## సప్తమాశ్వాసము.

క॥ పవనాశన మణిభూషణ।
పవనాశన ప్రమథిత ప్రసవసాయకసం।
జవనాయిత లసదానం।
దవనా శివ నాగచన్ద్రధర విశ్వేశా॥

వ॥ అవధరింపుము శౌనకాదులగు మహర్షులకు రోమహర్షణసుతుండిట్లని చెప్పందొడంగె॥

శా॥ నాకిస్వామికడన్ విపన్నుఁడయి యానక్తంచరుండెంతవా।
డో కాకుండిన నేలతెల్పుదురు నెయ్యుర్వింతగానింతగా।
వైకుంఠంబునకేగి దిక్పరిబృఢుల్ వాక్రుచ్చినట్లంచిత।
శ్లోకున్ శ్రీహరినాశ్రయించెదనటంచున్ నిశ్చితస్వాంతుఁడై॥

శా॥ ప్రోడల్ విశ్వులు సిద్ధసాధ్యతుషితుల్ రుద్రుల్ మహారాజికుల్।
కూడన్ రానవిజేయునిర్జరవిపక్షున్ దారకున్ బోరఁడు।
న్మ్రాడన్ రమ్మని వేఁడుకొంటకయి దైత్యారిన్ రథాంగాయుధున్।
జూడన్ బోయెఁదదాలయంబునకు నాసుత్రాముఁడుద్విగ్నుఁడై॥

సీ॥ స్థిరనిగృహీత హృషీకులై యడవులఁదపములొనర్చిన ధన్యతములు।
విశ్వజిద్రాజసూయాశ్వమేధాములౌ జన్నముల్ జేసిన సాధుశీలు।
రుప్రాధరాహిరణ్యోదనాద్యంహాతుల్ నిచ్చలుసల్పిన నెఱవిడువరు।
లాదేహపాతమవ్యాజభక్తినధోక్షజుని నుపాసించిన సుప్రయతులు।
లోనుగాగల విష్ణుసాలోక్యముక్తి।
నొందిన మహాత్ములుండిన యుత్తమోత్త।
మంబులగు దివ్యరత్నహర్మ్యములవీధు।
లలరువైకుంఠమునఁజొచ్చె హరిహాయుండు॥

శా॥ చావుల్ విస్రసలామయంబులు మనస్సంతాపముల్ శోకముల్।
లావాదేవులుపద్రవంబులు వ్యథల్ దారిద్ర్యముల్ కష్టముల్।
లేవాలోకమునందుఁ జేతనులకాలిత్రాల్పకీటంబుగా।
నావారాశితనూభవాధవుని పర్యంతంబు నెప్పట్టునన్॥

చ॥ అచటికుటీరముల్ న్వనిలయమ్ములకంటెను రామణీయక।
ప్రచురములచ్చటంగల వరాకులునున్ దనకంటె వైభవో।
పచితులునై యొసంగుటకుఁబాకవిరోధియపత్రపిష్ణుఁడై।
సచివులఁగూడి యబ్బపడసాఁగెను శార్ఙ్గిమహత్త్వకాత్మలోన్॥

శా॥ ఆయుచ్చైఃపదమందుఁబ్రస్తరనికాయంబెల్లఁ జింతామణి।
ప్రాయంబచ్చటిప్రాఁకులన్నియునుఁ గల్పప్రాయముల్ సర్వమా।
హేయముల్ కామగవీసదృక్షలునునై యింపొందియుంటన్ గనుల్।
వేయున్ జాలవివయ్యెఁ దద్విభవమున్ వీక్షింపనవ్వజ్రికిన్॥

సీ॥ ఎవ్వేటఁగాంచిననిండ్లన్నియుమహోధనోపలమయములౌనువ్వరిగెలు।
వెటఁదృష్టిఁబరపిన వెల్లనిషద్యలు లక్ష్మీవినోదఖేలాగృహములు।
వెచటఁజూచిననింతులెల్లఁదత్తాదృశోత్తమసృష్టిపర్వసౌందర్యఖనులు
నేవంకఁబొడగన్న నిలుతేండ్లనన్యజ శతగుణమంజిమ సంహననులు।

నెచొటఁదిలకించినఁ గొలంకు లెల్లజలధి।
వితతపరిణాహములు ప్రాదప్రాకృతరపాతి।
శౌయిమాధుర్యజలములునై యెసంగఁ।
బరగుఁ వైకుంఠము నెడు నప్పరమపదము॥

మ॥ వనమాలి ప్రియవాసమైన యల శ్రీవైకుంఠమం దెల్లవా।
రును సర్వావయవానవద్యశుభమూర్తుల్ గల్గియొప్పారుచుం।
డినపుణ్యాత్ములె కాని యేయెడల నన్వేషించినన్ లేరటన్।
గొనటుల్ స్విత్రవిచర్చికాది వికృతాంగుల్ లేరుపోగండులున్॥

ఉ॥ వీవధమందుఁ గన్పడిన వెన్నునివీటి మహాద్భుతంబులా।
పోవనిచూడిక్రొఁజూచుచు బుభుక్షుఁడుమున్నగు నాసుధాశనుల్।
పోవఁగఁబోవఁగా నెమట లోచనగోచరమయ్యె నద్ధిక।
న్యావరుఁడున్న దివ్యభవనంబహిమాంశుసహస్రదీప్తితోన్॥

క॥ అన్నగరిపుఁడనుయాతులు।
నెన్నండును నెచటఁ జూచియెఱుఁగనివింతల్।
కన్నులు తనియఁగఁజూచుచు।
నన్నగరున నరిగి యరిగి యతిమోదమునన్॥

ఉ॥ రుద్రులుమున్నుగా ననుచరుల్ తన వెంబడి నేగుదేరన।
య్యద్రివిరోధిదూఁకొనియె నచ్యుతదేవుని దివ్యసర్వతో।
భద్రము పద్మనాభ పదభక్తవశీక్రియమాణసచ్ఛతు।
ర్భద్రముఖేయవిస్తృతి నిరస్తసమస్తమహాసముద్రమున్॥

వ॥ అట్లుప్రవేశించి॥

సీ॥ అరివేరఁపుఁజడదారిమున్నగు తపస్వులు కేలుమోడ్చి ప్రస్తుతులొనర్ప।
మొనసి విష్వక్సేనముఖసన్నిధానవర్తులు మడిచేతులఁ గెలననిలువ।
నెకిరింతయగు తార్క్ష్యుఁడెప్పుడు తనపనిగలుగునోయని చెంతఁగాచి
[యుండ।

జగములన్నింటికిఁ జనయిత్రియగుపాలకడలి నెయ్యఁపుఁగూఁతురడుగు
మేలయిన రేవెలుంగుటా మేడలోన । [లొత్త ।
మణిమయంబగు కేళిసద్మమున నంచ ।
దూదిమవ్వంపుఁబాన్పునందు నెఱచెల్వ ।
మొప్ప మెయిఁజేర్చి పన్నుండియున్నవాని ॥

సీ॥ దగదగద్యుతులీనుమగటాలమొసలివ్రాయొంట్లు జానుగుఁదోయినొప్పు [వాని ।
ద్రష్టృదృగంధంకరణముమానికపుఁ బొమ్మిడికముశిరముపై మెఱయు [వానిఁ ।
ద్విడ్విశేషాక్రాంతదిక్కంబులైనయంగదములంసస్వాయిఁబొదలువాని।
మునిమాపుకెంజాయకెనయైనపచ్చవల్వపరిధానంబుగావఱలువానిఁ।
బ్రామినుకులు చంద్రమామనసోజాత ।
యనినయట్లు హృదయమునఁ బొడమెనో ।
ధవళకిరణుఁడనుచుఁ దత్రత్యులూహింపఁ ।
గౌస్తుభంబురమునఁగ్రాలువాని ॥

చ॥ పయిదెసఁజూచు చెయ్యదియొ 'భావమునందలపోయువానిశ్రీ ।
దయితునిఁ గాంచిరప్పుడు శతక్రతుముఖ్యులు ద్వారపాలురా ।
జయవిజయాహ్వయుల్ వెలిహజారమునుండియు వెంటనేగిత ।
చ్ఛయనని కేతనంబుఁగరసంజ్ఞలఁజూపి యపక్రమింపఁగన్ ॥

గీ॥ ఆత్మభూశతమోహనమైనయతని ।
మూర్తిఁదిలకించి నెమ్మేనుపులకలెత్త ।
నేటికోళ్ళుఁబెక్కులొనర్చి యిట్టులనియెం ।
నిక్కవీనుల సామ్రాణి నెక్కటీఁడు ॥ [తాఁయ ।

సీ॥ విహిత దుష్టాస్త్రభుగ్విజయ నిర్వాహాయ వాహాయమాన నాగాహి
విధ్వస్తదాసౌఘవృజినకలంకాయ లంకాయతాక్షవిలాపనాయ ।

వారిజాతాప్తతుషారపాదాక్షాయ దాక్షాయణీదయితప్రియాయ ।
సకలవేదోండరత్నఖనసాహాయ్యోద్యోగాయ దోర్యోగాయ నోత్తమస్తుతక
నాకిశివతాతిసత్కృపాలోకనాయ । [ధాయ ।
లోకనాయకశ్లాఘితాలోచనాయ ।
లోచనాయతనిర్జితవల్లునలినాయ ।
తేనమో భార్గవీనాథ దేవదేవ ॥

సీ॥ నిఖిలవిధాత్రండనివహస్థితినిదాన దానవావశ్యాయతరుణసూర్య ।
సూర్యనవరతసంస్తుతదీప్యదనుభావభావజాయుతనుపమావిశేష ।
శేషసమాహ్వయాశీవిషేంద్రశయానయానతోపాత్తవిహంగరాజ ।
రాజమస్ఫీపాది రత్నమయాకల్పకల్పవిభావనూగ్రప్రతాప ।
తాపసోపాస్యమాన పాదజలజాత ।
జాతరూపమయాంచత్ప్రశస్తవాస ।
వాసకేశ్వరశత తేజ వనజనాభ ।
నాభయముతీర్చి ప్రోవవే నాథనాథ ॥

చ॥ అరయవు మాసుఖాసుఖములచ్యుతయొప్పరికింప న్యాయమే ।
యరియొకరుండు తారకసమాఖ్యుఁడు దిగ్విజిగీషుఁడైధనే ।
శ్వరశమనామలం గెలిచి స్వర్గముమీఁదికి వచ్చుచున్నవాఁ ।
డురుతరవీర్యునద్దితిజునోర్చుట శక్యముకాదు మాకనిన్ ॥

చ॥ జగడములందు నేరికిని సాధ్యులుకాని నిశాటబీజ్యులన్ ।
జగదపకారకర్మఠుల సంగరరంగమునన్ మగంటిమిన్ ।
బొగరడఁగించి శత్రుభయమున్ దొలఁగించుచునుందుమానునే ।
డుగడవునీవెకావెయెపుడున్ శరణార్థిజనావనవ్రతా ॥

క॥ శిక్షింపుముద్ధతుండగు ।
రక్షఃకులనాథునాజిరంగమునన్ సం ।
రక్షింపుమార్తునన్నుఁగ ।
టాక్షింపుము లెమ్మువడిఁ ఉదయకనిపనికిన్ ॥

గీ॥ అనినిజప్రపదాబ్జద్వయంబుమీఁద ।
వ్రాలి మొులపెట్టుచున్న గీర్వాణనాథు ।
కేలుకేలఁ దెమల్చి యాస్ఫాలనంబు ।
మెల్లననొనర్చు చనియె లక్ష్మీధవుండు ॥

క॥ మగవాడివిడిచి వేలను ।
దుగులీవిట్లాడ నెన్నఁడుఁ విని యెఱుఁగఁ ।
జగదేకదుర్నివారం ।
బగునీదంభోళి కెదురె యరులుఁ గిరులుఁ ॥

చ॥ అని మొున నెట్టిబల్లిమల నైనఁ జయించుటకే వెచాలుదై ।
న నెపుడుఁ జిన్నపామునయినఁ జమపఁ వలెఁ బెద్దకఱ్ఱతో ।
న నెడు నవోక్తి చిత్తమునయందుఁ దలంచిననుఁ సహాయుఁగా ।
గొనియభియాతిపై నడరఁగోరిశిమం దిది సన్మతించితిఁ ॥

క॥ వచ్చెదఁ ద్రివిష్టపమునకు ।
ప్రచ్చెదనాశరులనాజిరంగమునఁ నీ ।
కిచ్చెదవిజయము నడలుం ।
జిచ్చెదనిడికొనక దిటవు జెంమము మఘవా ॥

వ॥ పురందరా నీవు ముందరుగు మేనునీపిఱుందనవచ్చెద నాస్యందనంబున నాతుందపరిమృజులఁ గ్రముంచించి నీకుంమఁడించుపరచెదనని యని మిషపతిననిచి గోవింమంసు సాంగ్రామిక నైపథ్యాలంకృతుండై కౌమోదకీ శార్ఙ్గనందకసుదర్శనంబులను నాయోధనసాధనంబుల శయచతుష్టయంబునం ధరించి నిజవాహనంబగు వైనతేయునిపై నధిరోహించి యభిసంపాతకౌతుకంబునఁ దనతోనే తేరఁజూచు విష్వక్సేనాదులరావలదని నివారించి రాకామలమూఁకలతో ననీకంబొనర్పుటకై నాకలోకంబున కుంబయనంబమ్యో నంతకుమున్న తారకుంమ సురసరిత్పరిసరంబుననసుర

విసరంబుల విడియించి వేగన్నులమన్నెకానికి విన్నవింపుమని కొన్ని గ
ఆపి యంగుడుదుడిప నొకని ననిపిన నాతండాఖండలునందకుజ్జని పా
లసుదిండికోలపుమండనంబగు తారకుండు ఖండితంబుగా నీతో నాడం
బంచిన దండిపలుకులు కొన్నికలవు వినుపింతు వినుమని యిట్లనియె ॥

శా॥ అన్నా యింద్ర జగచ్చతుర్దశకథన్యాశ్చర్యకృద్భాగ్యసం ।
పన్నానేనునుఁ గశ్యపాత్మజుఁడ వైమాత్రేయుఁడన్నీకునీ ।
విన్నాళ్ళేలితి దాయలెవ్వరును లేకీస్వర్గసామ్రాజ్యమిం ।
కన్నాకిచ్చితొలంగు డొందెడకు వేగన్ నీవునీవారలున్ ॥

క॥ డాఁపక నీభుజవీర్యము ।
ప్రాఁపునఁజూపనిదె యదనుపొసఁగెనయదిన ।
న్నాఁపుము నీకమరావతిఁ ।
గాఁపురముండవలెనన్న కాంక్షయెయున్నన్ ॥

ఉ॥ మేటిమగండవంచు నినుమెత్తురనారతమిజ్జగమ్ములన్ ।
మూటవసించు సర్వజనముల్ దివిషత్కులసార్వభౌమయా ॥
మాటయథార్థమేని రిపుమండలినిన్నొఅపాటుఁజెందసం ।
స్ఫోటముసల్పి నీకడిమిచూపుము గన్గొనిమెత్తునేనునున్ ॥

చ॥ క్రతుభుగధీశనీవిపుడు కయ్యము సేఁతకుఁ జాలవేనియో ।
డితివనిచెప్పి నీమునుగడించిన యర్థములెల్లఁ గ్రవ్యభు ।
క్పతియగు శూరపద్మునకు పారముగావరిసించి తచ్ఛమా ।
పతులయనుగ్రహంబునకుఁ బాత్రమనౌటకు నేగుదెమ్మిటన్ ॥

మ॥ మదమానంబులు డించినీదు ధనముల్ మాతేనికిమ్మెండెనీ ।
త్రిదశానీకినుల్లఁ దోడుపడవిద్విడ్వీరులన్ శూరతన్ ।
గదనక్షోణిఁజయింపుమట్లుభయథాగాకుండినన్ నీకుఁద ।
కఁదుస్వారాజ్యము నమ్ముఁనానుడువు నికఁటంబేను వాక్రుదృతిన్ ॥

వ॥ అనితనపలుకులుగానీకుఁదెలిపి రానను నని చెనని దనుజవార్తా హరుండు వినిచినవిని నిలింపపతి శిరఃకంపంబొనర్చి విహసితగ్రహయా ళువదనతోయరుహుండై రాయబారికిట్లనియె॥

ఉ॥ ఆయసురుండహంయుఁడయి యంతరమారయకామువట్టివా।
తాయువు కేసరీంద్రమును దండడిడీకొనినట్లరాత్యవ।
శ్యాయవిభాకరుండయిన శక్రుని నోర్వఁదలంచె నేఁటితో।
నాయువుమూఁడెఁగాక దితిజాధముఁడింతకు సాహసించునే॥

శా॥ ఆయాంతుప్రభుఁజేరి చెప్పుమిటు లేనన్నట్టులోవార్తికా।
నీయార్జించిన స్వాపతేయములనన్నింటిఁ ద్విదాముష్మిక।
శ్రేయఃప్రాప్తికిఁ దానపాత్రులకు సంప్రీతిఁ సమర్పింపుమా।
కాయాపాయమవశ్యభావియగుటన్ గ్రవ్యాదలోకాధమా॥

చ॥ విసముశిరోధిఁదాలిచిన వేలుపు నీకభయాపవర్జనం।
బొసఁగి సహాయుఁడై యభిమరోర్వరనిల్చినఁగాని నీకునీ।
యసురవరూధినీతతికి నంతకుఁదప్పదు చావు నేఁడుమీ।
రుసురలచేతఁబెట్టికొనియుండుడు వచ్చెదమాజిభూమికిన్॥

క॥ అనినీవువోయి చెప్పుము,
దనుజాపశమనకునని యతనిననిపిజనా।
ర్దనదేవుని యాగమనం।
బునకు నిరీక్షించి యంబుభుప్రభుడుండెన్॥

సీ॥ విష్వగంటులతేని వీటిగేస్తులకన్నావలకుఁబున్నమవలి వెలుఁగుపొడుపు।
నెఱజెండిపోతుమానిసిదిండిరాణువ దువ్వాకదలికకుఁ దూరజల్లు।
అకుఁగుఁ దన్మాలుగోల్చునతనికి ముగితిమకుర-వగుబ్బెతనొసంగు కూకుదుండు।
సువిశాలమైన నలువగ్రుడ్డుపేరఁబన్నిన నవగోజకునిట్టరాడు।

జిడ్డుమున్నీటిదొరకూర్మి బిడ్డనోము।
పంటప్రాఁబలుకుఁ పెనుదారి బాటసారి।
పరమపదరాజ్యమేలెడుబాదుసాహి।
వచ్చెనసురావతికిన్ రమావల్లభుండు॥

శా॥ గర్వాంధప్రతివీరసంహృతికలం కర్మిణుఁడౌవిష్ణుఁడా।
స్వర్వాసుల్ ముదమందవచ్చుడు ద్విషత్సంహారవీరక్రియా।
నిర్వాహంబికనిశ్చయంబని యసందేహంబుగాఁ బొంగుచున్।
సర్వౌఘంబొనరించెఁ దారకజిగీషన్ వాసవుండత్తఱిన్॥

శా॥ దంశీవారము సాంద్రధూమతతిచేతన్ జచ్చునట్లామిషా।
ద్వంశంబంతయు నస్మదీయనిశితాస్త్రవ్రాతఘాతంబులన్।
భ్రంశంబందెడునంచుఁ దోర్మదమెలర్పన్ జెప్పికొంచున్ ద్రయ।
స్త్రింశత్కోటిసుపర్వులున్ వెడలిరుద్రిక్తాహవోత్సాహులై॥

సీ॥ నిరుపమప్రధనపాండిత్యులాదిత్యులు వైరితమోవిభావసులు వసువు।
లహితలోకాకారణాస్వరుల్ భాస్వరులలఘువిక్రమ పుషితులుతుషితు
సత్యపరాక్రమాసాధ్యులుసాధ్యులుపలభుగ్బలాటవ్యనలులనిలులు। [లు।
రిపువీరపిచుమాతరిశ్వులు విశ్వులు ప్రగుణాజికులు మహారాజికులును।
ప్రాసతోమరకరవాలపట్టససృగ।
పరశుశక్తిశతఘ్నికాశరశరాస।
నాదికములైన దారుణాభ్యాగమోప।
కరణములుదాల్చి వెడలిరి కయ్యమునకు॥

సీ॥ ప్రౌఢతరాభిసంపాతోచితంబైన నైపథ్యమును నూతనముగఁబూని।
యాయుధంబులకభేద్యంబుగానతికర్కశతనొప్పువజ్రదంశనముదొడిగి
చంచలాలతవోని కాంచనమయశరాసనముసవ్యప్రవేష్టమునఁ దాల్చి
రత్నమయాపస్కరమయి యాజానేయతురగముల్ పూన్చినయరద
[మెక్కి

త్రిదశసీమంతినీలోకదృక్చకోర।
లలితశీతకిరణమండలాయమాన।
సంహననుఁడు జయంతుండుసమరమునకు।
వెడలె సురసాంయుగీనులు వెంటనడువ॥ [నర్గ।

సీ॥ ఐకకంఠ్యంబుగా నస్వప్నులుచ్చైస్స్వరముతో జయజయధ్వను లా
వేధోండభాండంబు విచ్చునోయనునట్లు వాదిత్రతారరావము సెలంగ।
వశులనైనమనోజవశులఁదప్పక చేయఁబ్రతిభువులచ్చరపడఁతులాడ।
ప్రాంశుహర్మ్యంబులపైనుండి పుణ్యసువాసినుల్ దీవనసేసలాలుక।
బొల్లినెమ్మొగంపుఁబులుఁగుచౌదంతుల।
నెక్కిరిపుజిఘాంసరొసక మెసఁగ।
విష్ణుజిష్ణులపుడు వెడలిరి మూర్తమై।
వీరరసము బయలువెడలినట్లు॥

క॥ పడమటిప్రాయేలునుఁ దొలు।
కడలియు నొండొంటిఁదాఁకఁగదియఁబడినక్కై।
వడిసురసేనలు రక్కసి।
దడములు నొండొరులమీఁదఁ దలపడిరలుకన్॥

శా॥ కుత్కీలంబులతోడ మార్కొను కులక్ష్మాధ్రముల్ నోలెదు।
ర్వృత్తాఖండీరులమీఁది కొండొరులు బంహిష్ఠద్విషద్విప్రకా।
రోత్కంఠాతిశయంబునన్ గవిసి రుద్రోద్యోగులై వీరపా।
శౌత్కట్యంబునఁ గ్రిందుమీఁదరయకయ్యాదిత్యరక్షోభటుల్॥

సీ॥ పాఱువాయమ్ములువరపి మార్తురతపారులు నేలపైఁబడఁడులుచువారు।
వెడఁదవాతిలకోరులడరించి దాయలసిడపుకామలఁద్రెవ్వనడఁచువారు
వాఁడిజోడమ్ములు గాఁడించిసూడుల తంపరజేరాలఁ జింపువారు।
నెలవంకకోలలు నిగుడించిపగఱకైదువులను కేలనె తునుమువారు।

నగుచుఁ గృతహస్తులగు దానవాదితేయ।
కాండపృష్ఠపవరులు సంగ్రామకుర్ద।
నంబు పశ్యత్సుయూపాదనముగఁగొంత।
కాలమొనరించిరా కన్నెకయ్యమందు॥

మ॥ విలుకేలంగొనియున్న జోదులను ధన్విప్రాగ్రియుల్ రిష్టిహ।
స్తులనైస్త్రింశికులీఁటియల్ కరములన్ శోభిల్లుచున్నట్టియో।
ద్ధలఁగుంతాయుధులున్ శతఘ్నులను చేతంబూనియున్నట్టిది।
ట్టలశాతఘ్నికులున్ గడంగి నులుమాడన్ దాఁకిరొక్కుమ్మడిన్॥

చ॥ తెగిపడుపూర్వకాయములు ద్రెస్సియధస్థలిఁగూలుబాహువుల్।
పగిలి తొరంగుమస్తకకపాలము లూడుప్రకోష్ఠదండముల్।
నొగిలి రణోర్విఁ బ్రాలియు మనోజ్ఞతఁదప్పని విగ్రహంబులున్।
బగతురమానసంబునె కృపావరతంత్రముఁజేసె నత్తఱిన్॥

ఉ॥ మిత్తిమెఱుంగు కోఱలకుమిత్తులనందగియున్నవాఁడివా।
కత్తులపోటులన్ దెగిన కాల్వరమేనులనుండి కాఱుక్రొ।
న్నెత్తురు కంఠకఘ్నమయి నిర్జరనిర్ఝరిణీమతల్లిసం।
పత్తిదిసంతుకొట్టు పెనుబట్టియగాఁ బ్రవహించె నత్తఱిన్॥

సీ॥ ప్రతివీరనిహతులై పడుకాలరులవెన్క త్రోద్రోపులన్ గూలిరొల్లువారు।
ద్విషదస్త్రపాతితద్విపరాట్కళేబరములక్రిందఁబడి బిట్టునలియువారు।
శత్రుశస్త్రాహతశ్లథపాతుకరథకడ్యలయధస్థలిఁ బ్రాలి యలయువారు।
పగఱకైదువుపోట్లఁ దెగికూలుకత్తలానులయడుగునఁబడినొచ్చువారు।
నైతుములముగ నస్వప్నయాతుధాన।
పృతనలిరువాఁగునుండాఁకి యతిభయాన।
కంబుగా నొనరించిరి క్రందుకయ్య।
మెల్లచూపఱయుల్లముల్ తల్లడిల్ల॥

గీ॥ అట్టిసంకులసమరంబునందు మేలు ।
చేయిర్రై దేవతాభ్యమిత్రీయులసుర ।
సేనలఁదెరల్చుటయును సేనానులైన ।
దుర్జయపిచండశూన్యకేతుప్రభృతులు ॥

చ॥ మెకమెకపాటుమైఁబులులు మిక్కిలునుద్ధతినొత్తుకంబుమీఁ ।
దికుఱికినొంచుచాడుపునఁ దేవవరూధినిఁ బిట్టుతాఁకివా ।
రొకఁడొకఁడాద్విషద్భటుల నొక్కనినొక్కని నొవ్వనేసిరు ।
గ్రకులిశసంప్రహారనిభఘాతములైన పదేసి తూపులన్ ॥

క॥ తెఱఁగఁటిజోదులపుడునుఁ ।
బిఱుతివియక మోహరించి స్ఫిరశౌర్యమునన్ ।
నెఱకులునొవ్వఁగఱకుటం ।
పఱఁబరపిరి రక్కసీఁడు పడవాళ్ళపయిన్ ॥

క॥ చనిరి చమూపతులు విజయుఁ ।
డును ముసలియునుగ్రబాహుఁడును శుచివక్త్రుం ।
డునుఁగంటకుఁడును ఖరముఖుఁ ।
డునుఁదమవారలకుఁ దోడ్పడుటకురవడితోన్ ॥

శా॥ ఆరక్షోధ్వజినీశులట్లొకటియై జ్యారావఘోరంబుగాఁ ।
జేరంగన్గాని యోహటింప కలజేజేజోదులుగ్రాశుగా ।
సారంబున్ గురిపించి వారిరథముల్ సంచ్ఛన్నముల్ సేయుచున్ ।
వీరాశంసనమందునిల్చి రరులవ్విక్రాంతికగ్గింపగన్ ॥

ఉ॥ మీఁదికివచ్చు నమ్మలను మింటనె తున్మచు సోఁకుఁజేర్వకాం ।
డ్రూఁదరవెట్టినట్లొకటనూపిరివీడువనీనియేడ్తెఱన్ ।
జీఁదఱవెట్టినొంచిరి ప్రశిద్ధములైన మహాయుధంబులన్ ।
మోఁదియధృష్యులన్ సురచమూభటులన్ దలవారినెల్లరన్ ॥

మత్తకోకిల॥ దానవోచ్చయ మంతఁబోవక దండతాడితభూరికుం ।
భీనసంబులుపోలె రోజుచు భీకరప్రతిఘుంబునన్ ।
దానవారిభటుల్ యుగాంతధనంజయోద్ధతకీలలన్ ।
బోనిక్రూరతరాయుధంబుల మొత్తిరారిపువీరులన్ ॥

ఉ॥ కండలురాల్చియున్ భుజయుగంబులుగూల్చి యునుత్తమాంగముల్ ।
చెండియుఁగర్భగోళములుచించియుఁబకరులుప్రకరలించియున్ ।
గుండెలువ్రచ్చియున్ సిరలుగోసియుఁ జేరువకాంద్రనెల్లఁబో ।
గండులఁజేసిరబ్బులుమగల్ రజనీచరసైన్యనాయకుల్ ॥

* మేఘవిస్ఫూర్జితవృత్తం *

పరాభూతానేకప్రబలరిపుదిక్పాలుడౌ తారకుండా ।
సరాయైయుంటన్ మున్నమరులనినన్ సాధ్వసంబందుదైత్యుల్ ।
నిరాతంకోద్వృత్తిన్ నిలిచియపుడానిర్జరవ్రాతమున్ భీ ।
కరాభ్యామర్దక్షోణికిఁబోలఁచిరుగ్రంపుచేలా వెలర్పన్ ॥

ఆ॥ పొలసుదిండ్లయంపపోట్ల యోలాకునఁ ।
దలకివారియెదుర నిలువలేక ।
యోలమాసగొని స్వయువరాజునరదము ।
వెనకనొదిఁ గిరమరవీరభటులు ॥

క॥ సిబ్బితిలేక సురులచేఁ ।
దెబ్బలుతిని పఱచితనదుతేరి పిఱుందన్ ।
గొబ్బునఁడాఁగినసురలకు ।
నబ్బురపడుచున్ బురందరాత్మజుఁడనియెన్ ॥

ఉ॥ మానిసిదిండ్లు నవ్వ నవమాననకోరిచి పాఱిపోకుడీ ।
యేనిటనుండమీకు వెఱపేటికిమిమ్ముఁదెరల్చినట్టిసే ।

నానులముమ్ను నెల్ల మదనర్గళదివ్యశరోత్కరంబులన్ ।
లూనముసేసి మీకిదె విలోచనపర్వ మొనర్తుఁ జూడుఁడీ ॥

చ॥ తొలకరిమూడువాపురఁపుఁచుంమడుఃకీపలలాశ్యనీకినీ ।
తులయళికంబులందమరశూరులనెల్ల రణాంగణంబునన్ ।
గెలువుడటంచు వ్రాసినను ఖేచరులార మదీయబాహుకా ।
శలమున నాలిపింమడిచి చంపుమఁ దైత్యులనెల్లఁ ద్రేల్మిడిన్ ॥

తరల॥ జరయుఁజావును లేనిదుస్సహశౌర్యులన్ మనవారలన్ ।
దురమునందు నిశాచరాపశదుల్ సజన్మజరావృతుల్ ।
పరిభవించి జయించిరన్నయపప్రధన్ విని రేనిన
వ్వారె జగంబులనన్నిఁటంగలవార లెల్లఁ గికాగిక ॥

క॥ అనిపలుకుపురందరనం ।
దనునుడివిని పుచ్ఛడీకతనము కతనవం।
చిన మొగము లెత్తకయయి ।
ట్లనిరి చదలు ద్రిమ్మరుల్ జయంతునితోడన్ ॥

ఉ॥ త్రుంగుడు సావివైరవులతోరపుమంటలకన్న మిన్నలౌ ।
గొంగలయాయుధప్రతతి కోఁతలకగ్గములై శిరఃకరా ।
ద్యంగములెల్లఁ గాయపడ యాతనపాలయి యేడ్చుచుంటకం ।
టెంగడు మేలెయా మృతిఘటిల్లదుగాని పులోమజాత్మజా ॥

క॥ మున్నసురులతోఁ బవరము ।
లెన్నియొ చేసితిమికాని యిట్టి తెఱఁగునన్ ।
బన్నమువడి యెఱుఁగమునుమి ।
యన్నాయువరాజ తొంటియాహవములలోన్ ॥

గీ॥ అనియనను భూతపూర్వమా నభిభవంపు ।
టలఁచురుననుస్మరించు నయ్యాది తేయ ।
వీరభటులఁ గలయఁజూచి వృషతనూజుఁ ।
డకర సమునకసును హృదయమునఁబెనఁగ ॥

గీ॥ ఓయమరులార యక్తదైతేయరక్త ।
సాయకంబులతోవద్ది మీయొడళ్ళ ।
గాయములనొక్క త్రుటిలోనమాయఁజేయు ।
జాయువుగఁ దద్రుధిరమును బూయువాఁడ ॥

కం॥ పారకుఁడని శచినెయ్యఁపుఁ ।
దారకుఁడనిమిషులమనికితముమానిచియా ।
శూరకులశిరోరత్నము ।
తారకుని చమూపతులను దాఁకెనురవడిన్ ॥

ఉ॥ బాలకుఁడయ్యు శౌర్యమునఁ బ్రౌఢతరుండగునిప్పుగంటిరా ।
చూలిపురస్స్థితంబగున సోఁకుడుజోదుల పిండునెల్లఁబై ।
డాలపుఁజూపుఁదూపులనె డాకొని దగ్ధముసేయువాఁడునుం ।
బోలెఁజరీలునంగపిసి పోకుడటంచదలించి పల్కుచున్ ॥

ఉ॥ నాలుకలుక్రోయుచిల్వలాయనందగిమార్తుకప్రాణమారుతం ।
బులుకబళింపఁజాలినయమోఘములైన వెడందవాతులో ।
ములుకులు నాల్గునాలుగుగముందుగనే సెఁజయంతుఁడప్డుక ।
ట్టలుకనజిహ్మగాగ్నికభియాతులనాహుతిసేయుకాయ్యునన్ ॥

కం॥ ఆవెడఁదవాతియమ్ములు ।
మేవడిఁ దప్పించుకొని తెమిచపిశస్త్రి ।
జీవప్రవస్థులయినయా ।
ఖీవక్త్రుఁడు లోనుగాఁగలిగినట్టిదనుజుల్ ॥

ఉ॥ పందలఁగొంపజిన్ గలనఁబాఱగఁదోలుటగొప్పకామసం ।
క్రందననందనుండిదె దురంబునకైచను దెంచినాఁడువీ ।
నిందలఁకింపఁగల్గుటయొ నిక్కఁపుఁ బంటుతనంబటంచువా ।
రందఱుగూడబలిక్కొనియాతనిఁ జుట్టునుముట్టి యేద్రైఁన్ ॥

సీ॥ నీలపీనోదగ్రనిజసంహననములు ప్రావృషేణ్యాంభోధరములు గాఁగ।
హైమ్యదక్షిణ్వబాణాసనప్రభలు క్షణప్రభావిస్ఫురణములుగాఁగ।
శృఙ్గధ్వయాపాది శింజినీటంకృతిధ్వానముల్ ఘనగర్జితములుగాఁగ।
జిత్రవేపథుకరక్ష్వేడానినాదముల్ తోరంబులగుస్ఫూర్జథువులుగాఁగ।
నతిరథోత్తముఁడైన జయంతునిపయి।
ఘోరముగ శాతసాయకాసారములను।
తెఱపియీఁకుండఁగురిసిరద్దితిజసైన్య।
నాథులత్తటి నతిసమున్నద్ధులగుచు॥

మ॥ గడితంబౌ వడగండ్లవానకు నుదగ్రంబ్రాంఘరంబోర్చ్యుతై।
వడివాలమ్ములవానకోర్చి సుపర్వస్వామిగారాబఁపుం,
గొడుకయ్యందఱకన్నిరూపులయి రక్షోవీరునొక్కొక్కనిన్।
బిడుగుల్ నాఁదగుతూపులఁబరపి నొప్పించెన్ భుజప్రౌఢిమన్॥

ఉ॥ అచ్చెరుపాటుగొల్పెడు జయంతు నరుంతుదబాహుశక్తికిన్।
నొచ్చియు వీగక ప్రభుగనూకభవుల్ తుదిరేయినాటిపెన్।
జిచ్చునకుద్దయా కనడజిహ్మగముల్ పరఁగించియాంత్మసం।
యచ్చతురత్వమంతయును వ్యక్తముసేసిరి సూడుకానికిన్॥

చ॥ నడుమనె వానినన్నిఁటిఁదునాతునకల్ పొనరించిమబ్బుత।
త్తడిదొరకూర్మిబిడ్డప్రహితంబులవారలమేనినెత్తురుల్।
మడువులువాఱనేసి కరలాఘవమొప్పగ వైజయంతులున్।
గొడుగులు విండ్లు రథ్యములుఁగూల్చి యలంచెను వారినెల్లరన్॥

ద్రుతవిలంబితవృత్తం॥ విరథులైయురివీరుఁడు దైవతే।
శ్వరతనూజుఁడసాధ్యుఁడటంచువం।
దురుచులూమముద్రోకిన మేచక।
ద్యోసనంబులతీరునఁ గ్రుద్ధులై॥

చ॥ ఒకఁడు పరశ్వధంబు గదయొక్కఁడు శక్తి యొకండు కుంతమిం
కొకరుఁడు మండలాగ్రము మఱొక్కఁడు నిష్ఠురతోమరంబు వే
ఱొకఁడునుగాఁగఁ గైకొని మహోగ్రతనొక్కటఁ గోత్రభిత్తుఁ మా
రకుఁ దరదంబు పైఁబడిరి రాక్షసనాథుననీకినీపతుల్ ॥

శా॥ అల్లేఖర్షభసూనుఁ డల్లడరు దైత్యస్తోమముం గాంచి శుం
భల్లక్ష్యస్థిరదృష్టిసౌష్ఠవము దోఃప్రావీణ్యముల్ శోభిలన్
భల్లం బొక్కఁ డొకండుగాఁ బరపి తత్ప్రాసాసిశక్త్యాదికం
బెల్లన్ జక్కడచెన్ రిపుల్ నిజభుజాహేవాకమగ్గింపఁగన్ ॥

క॥ మఱియున్ వెనువెంట నేచి
చ్చఱకోలలఁ బోనినారసములన్ నొంపన్
బఱది రెఱది దిండులుతమ
తఱుసలితనములను డిగ్గఁద్రావి జళుకొనన్ ॥

ఉ॥ వేఁటరి నొంచు లేళ్ళవలె వేలువుఱేనికొమారు నేటులన్
దూఁటులు వడ్డయుంగములతోఁ బడవాళ్ళుడివోయి యాలకున్
దాఁటుచునుంట కేవపడి తారకుఁ డొడఱుఁ జేరఁ బిల్చి మి
మ్మాఁటది యైన నవ్వు నహహా యని యుల్లసమాడి దూఱుచున్ ॥

క॥ అంతకుని తెఱంగునన
త్యంతకుపితుఁ డగుచుఁ దారకాసురుఁ డంతన్
యంతకుఁ బరపు నరదము జ
యంతకుమారుకడ కంచు నాజ్ఞ యొసఁగి తాన్ ॥

ఉ॥ రోఁజుచుఁ గొండఱాస్మరధిరుల్ మిసిమింతులు వెంబడిన్ జనన్
బోఁజులు తీరియుండిన సపత్నులఁ దన్న భయప్రదానమున్
గోఁజు తెఱంగునన్ జితుకఁ గొట్టియలంచి తొలంగఁ దోలుచున్
బాఁజుకి కీదివింగనియుభాతిఁ జయంతునిఁ దాఁకి యిట్లనెన్ ॥

శా॥ ఏదీయింతకుమున్న మద్భటులపై నీవద్భుతంబౌ సమి।
ద్వైదగ్ధిన్ బ్రకటించినాఁడవుకదా దానింగనుంగొంటకై।
కోదండంబుధరించి కొన్నిదినముల్ కల్ పూనియేతెంచితిన్।
నీదాక్ష్యంబును జూపుమిప్డు మగుడన్ వృద్ధశ్రవోనందనా॥

ఉ॥ బాసటలేక పెక్కురక్షపాచరవీరులతోఁ బెనంగుటన్।
వేసటనొందితేమొ యొకవెల్లడిచోటున విశ్రమించియా।
యాపము లెస్సతీర్చికొని యాపయినాలముసేఁతకేగుదె।
మ్మో సురరాజపుత్త్ర యిటనుండెదనీవరుదెంచునంతకున్॥

మ॥ అనుచున్ బల్కిన నవ్వి తారకునకయ్యాఖండలాత్మోద్భవుం।
డనునో తారక యెందుకోఁ జలగు క్రవ్యాదోగ్రధూర్తేకామము।
మ్మొనవాల్ దాల్చిన వేల్పుసత్ప్రమథుఁడై భూతాళితో వచ్చి మా।
రొక్కనిన్ వేవటలేశమాత్రమును నాకుంగల్గ దాలించితే॥

మత్తకోకిల॥ ఈడఁబోవకచూడఁజాలుదు వేనిమాపెదఁ జక్కగాఁ।
జూడు నాభుజశక్తి కొంతనుచున్ వచించి జయంతుఁడా।
మూఢుకాని యురశ్ఛదంబునఁ జొన్పఁ బెక్కడిందిప।
క్ష్వేడనంబులు వేల్పుజోదులగెల్లునన్ దివి వ్రియ్యగన్॥

ఉ॥ భండనపండితుండ మరభర్త్రుతనూభవుఁడేయుప్రోజ్జ్వల।
కాండపరంపరల్ సరకుగాఁగొనకుత్తమసారథైనకో।
దండము నెక్కువెట్టి క్షణదాచరసైనికులుల్లసిల్లనా।
గండరగండఁడేసె విశిఖంబులు కల్పకృశానుకల్పముల్॥

* స్రగ్ధరావృత్తం *

మార్గ్వీగుర్వారవంబాంబరము నఖిలమున్ మాఱుమ్రోయంగఁ జేయన్।
వార్వాహాంబాంబుధారల్ వలెఁ గురియుచుఁ దీవ్రింపుఁగ్రొవ్వాడితూపుల్।
పూర్వామర్త్యంమ్రిదున్ వేల్పుదొరకొమరుఁడున్ బోరిరాత్మీయశుంభ।
ద్గోర్వీర్యైపాస్యవిద్యాదులకు నచటిజోదుల్ సెబాసంచు మెచ్చన్॥

చ॥ పిడివడి గర్జితంబులగు విక్రమువిక్రముఁడాఁకి పోర్కై ।
వడిసరికోడెకాండ్రు మఘవత్సుతతారకులుగ్రమూర్తులై ।
యెడపక యంపవానఁగురియింపుచు నెక్కటిఁబోరుచుండ్రమా ।
న్పడి తిలకించుచుండిరి రువాఁగునఁగల్గినజోదులందఱున్ ॥

చ॥ ప్రకృతిపృషత్కముల్ పనికిరావు మహాబలశాలియైనతా ।
రకుని రణాంగణంబునఁ బరాజితుఁజేయుటకంచుఁ దేవవ ।
ర్ధకివరనిర్మితంబయిన దారుణశక్తికరంబునందము ।
ంచి కులిశభృత్సుతుండు వయిచెన్ రజనీచరవీరమూర్ధ్నిపైన్ ॥

క॥ మిత్త్రివలె మీఁదికడరెడు ।
సత్త్రిన్ గుఱిచూచి యర్ధచంద్రశరమునన్ ।
ముత్తునెలుసేసెఁ దారకుఁ ।
డత్తఱిఁగంటివోరచూలి యలముటపడఁగన్ ॥

శా॥ జన్యాభిజ్ఞుఁడు శక్రసూనుఁడు విపత్తుధ్వంసకంబైనప ।
ర్జన్యాస్త్రంబు శరాసనోత్తమమునన్ సంధించి శబ్దగ్రహం ।
తన్యస్తాశ్లథముష్టి గాఁదిగిచి యాతం డేసెఁ దారాపథా ।
ధ్వన్యుల్ తారకుఁడీల్గెఁ దీననని సాంద్రధ్వానులై యార్వఁగన్ ॥

క॥ పొనలుచుఁ జగములనన్నిటిఁ ।
బెనుఁగుపరువఁ జాలుపిడుగుమొగులుగములతోఁ ।
జనుదెంచు నమ్మహాస్త్రం ।
బునుగనుఁగొని సోఁకుడులపబువకంపిండ్రై ॥

చ॥ క్రవ్యభుగాయుధీయులలరన్ బలుసింగిణియందమర్చి వా ।
యవ్యమనన్ బ్రసిద్ధమయినట్టి ప్రభంజనదేవతాకమా ।
దివ్యశరంబు నిండుతెగదీసి యలాఘునఁ బూర్వదేవమా ।
ణవ్యవతం సమాప్రహరణమ్ముపయిన్ నిగుడించెఁ జయ్యనన్ ॥

క॥ ఆయస్త్రమునుండి మహో।
వాయూత్కరముప్పతిల్లి వాసవిపర్జ।
న్యాయుధమునడఁగఁద్రొక్కఁద।
వీయముగాఁబాఱవైచె వేలుపులడలన్॥

శా॥ భగ్నానేకవిపక్షవీరుఁడగు నాప్రావేల్పుఁ గన్నాకును।
ద్విఘ్నంజేసి వధింపఁ గౌతుకితుఁడై వేగంటి గారాపుఁగో।
డాఱగ్నేయాస్త్రము వింటఁదొడ్గివిడిచెన్ యాత్వన్వయుల్ కాతరుల్
నగ్నత్వంబు పొసంగియున్ తెలిసికొంటల్లేక పర్వెత్తఁగన్॥

క॥ జగముల మ్రుగియిక యాప్పటి।
దుగమొగముల వేల్పుదాని తొలుకందనఁగాఁ।
దగిన మహాజ్వాలావళి।
నెగడెఁ దదస్త్రంబునుండి నీరంధ్రంబై॥

శా॥ స్వస్త్రీలభ్రపథంబునన్ నిలిచి త్రస్తస్వాంతలై చూడర।
క్షస్త్రైకపరాయణుండయిన యాక్రవ్యాదనాథుండుదా।
నిస్త్రింసుండయి దృక్కరవ్యముగఁ దానిన్ బెట్టి బిట్టేసెబ్ర।
హ్మాస్త్రంబున్ బలుసింగిణిన్ దొడిగిగాఢాకృష్టమౌర్వీకుఁడై॥

గీ॥ ఓతువాఖువుపైఁబడి యొడిసిపట్టి।
హరమున వధించి మెసవునట్లమ్మహాస్త్ర।
మడరి యప్పావకాస్త్రంబు నడఁచె వేల్పు।
దొరకొడుకు గెల్పుటడియాసతోడఁగూడ॥

ఉ॥ ఆవెనువెంట వింటిగొనయంబున భల్లమొకండమర్చి చే।
మేవడికెల్ల రచ్చటియ మిత్రులు నివ్వెఱఁజెందఁ జాపవి।
ద్యావిదురాగ్రగణ్యుఁడగు తారకుఁ డంచితవిక్రమోర్జితుం।
డా వృషసూనునల్లెగనయంబునకున్ దెగనేసె నేర్తెఱన్॥

ఉ॥ ఉఱియ శచీసుతుండు మఱియొక్క శరాసన మెత్తు నంతలో ।
దుఱుతోకయింత లేక పలుతూపుల నాతని దేహమంతయున్ ।
దోఱటలు వాఱఁజేసె రణదోహలితారకుఁ డజ్జయంతునిన్ ।
బిఱుతివుచున్ జయంతుఁడని పెద్దయెలుంగున మార్తురార్వఁగన్ ॥

చ॥ దివిష దధీశనందనుఁడు దీవనెసోఁ కుడుతేనిచావుని ।
కుక్కవమని యెంచుచున్ మగుడఁగొన్న శరాసన రాజమందువై ।
ష్ణవమను నుత్తమ ప్రహరణమ్మురివోసి సమంత్రకంబుగాఁ ।
దివిచి సురారిపైఁ బరపెఁ దేవవరూథినులుల్లసిల్లఁగన్ ॥

మ॥ సముదాయాజిర మెల్లఁ దానయి జగత్సంహారమున్ జేయనే ।
గుమహామృత్యువుపోలిఁకఁ బై నడరు నా ఘోరాస్త్రముం జూచి ప్రా ।
ణము హెచ్చ్రగుండగు తారకాసురుఁడు దానారాయణాస్త్రప్రయో ।
గము గావించెఁ బరస్పరాహతములై కాడ్వోవ నారెండునున్ ॥

క॥ వెండియుఁ జండశరములు ।
చ్చండత నడరించి పోఁకుసామి జయంతున్ ।
గండడఁగించె నతిశ్రాం ।
తుండై యాతండు మిగులఁ దూఁకలిజెందన్ ॥

ఉ॥ సూదికినైన నంతరము జొప్పడకుండఁగ నజ్జయంతునా ।
పాద శిరోరుహాంతముగఁ బాణమయాత్మునిఁ జేసినొంచెఁ గ్ర ।
వ్యాదకులేంద్రుఁ డప్పుడు తదాహతులన్ మిసిమింతుఁడై నయా ।
గాదిలిచూలిఁ జూచి వెయిగన్నులఁ గెంపొదవించు నల్కచేన్ ॥

చ॥ మదకలమైన యూథపము మసృణమై నిలుచున్న సింగపుం ।
గొదమనుదాఁకినట్లసుర గోత్రజులన్ దమవారిపెక్కురన్ ।
గదిసివధించె నన్నయలుకన్ దనమీఁదనె కన్నువైచియు ।
న్నదితిజ నాథునిన్ దివిజనాథుఁ డుమారొకనె స్యందనస్థుఁడై ॥

మ॥ అమృతాంధః కులసార్వభౌముఁడు నిలింపారాతిమీఁ దర్వివా
తములయ్యెన్ శ్రుతిసారదృశ్వ లగుకాండంబుల్ మరాధర్షశౌ
ర్యమునన్ గోలుమసంగి యుద్ధవిధి సేయన్ శూరపద్మానుజుం
డుముఖాబ్జంబునఁ గ్రోధసంవలిత మానాత్మస్మితం బొప్పఁగన్ ॥

చ॥ ఒడిక మెలర్పఁ బత్త్రికనుండి వెలార్చుట కార్ముకంబునన్
దొడుగుట నింటు మోపు తెగమాయుట లెప్పు మానంద డర్చుతే
ర్పడఁదిలకింపరాక కరపాటవ మద్భుతమైయె సంగరోఁ
కుడు దొర వజ్రి పైఁబర పె ఘోర పరశ్వతకంక పత్రముల్ ॥

క॥ కిరి కిరియున్ గిరి గిరియున్
హరి హరియున్ గపిసిపోరు నట్టి పగిదినా
శరపతియును సురపతియును
సరిపోరఁదొడంగి రుభయసైన్యము మెచ్చన్ ॥

చ॥ పగగొని యొండొరుల్ రథుల పైరథయంతల పైఁగుటాల పై
నిగుడుచు మూవు మొత్తముల నిండుసఁ జేసియు గ్రవ్యజద్ధిక్తై
తెగతిరుగాడు పుల్గు పెనుతిట్టలఁ జేసియు నభ్రమంతయున్
ఖగమయ మయ్యెఁ బోఁకు తెలి గంటులరాయల జంటపోరునన్ ॥

ఉ॥ తారకవీరుఁడో? పటిమదార్ఢ్యమదెట్టిదొ తాను నేరుపే
పారనడర్చె నంబక సహస్రమునుండి యకాకయల్లసా
కారికినున్న యంబక సహస్రమునుండియు నస్రబిందువుల్
సారణిమై స్రవింపసురసూసుతుఁ డేసెను వేయియమ్ములన్ ॥

ఉ॥ బ్రహ్మము ఖామరోఘుసము పాసితమంగళి పావపమ్ముఁ డా
జిహ్మగభుక్త రంగుదయుఁడేఁ జయమబ్బుగ శమంబుఁ గోరుచున్
బ్రహ్మశిరోస్త్రము ఁబరపెఁ బ్రాకరుకుబీశ్వరుఁ డన్యశాస్త్రవా
జిహ్మగ మద్రివారమగు దేవనెసంగెను దాని నేడ్తెఱిన్ ॥

శా॥ ప్రత్యాదిష్ట పరేతరాట్ప్రభృతికప్రత్యర్థివీరుండు సం।
స్తుత్య ప్రాణుఁడు తారకుండసురయోధుల్ నిల్చి జేజేయనన్।
బ్రత్యాలీఢపదస్థుఁడై తదభిధానంబైన దివ్యాస్త్రమున్।
బ్రత్యస్త్రంబుపయిన్ నిగుడ్చి పరిశమింపన్ జేసె నయ్యస్త్రమున్॥

శిఖరిణీవృత్తము॥ నితాంతంబున్ రుష్టాత్ముఁడయి దివిషన్నేభృశరూతు।
క్షుతామత్తంబై యాక్షణములసహస్రంబు దనరన్।
కృతాంతాగారప్రాహుణికుఁడవుగమ్మీనుచుఁడో।
శ్శ్రుతారంబున్ వైచెన్ సరభసతరక్షుత్ప్రభునిపైన్॥

మ॥ అమరుల్ ముక్కులమీఁద వ్రేళ్లునిడి హాహంతాభవల్లుప్తమ।
ధ్యమవర్ణం తృణమీశితుః కులిశమంచాశ్చర్యమందన్ శచీ।
రమణుం డేసిన ప్రోజ్జ్వలద్భిమరమాక్రవ్యాశనాధీశు కం।
ఠమునన్ ఘోరఁపుటుర్విడిన్ దగిలి కుంఠంబై రణోర్విన్ బడెన్॥

వ॥ అంతలోన॥

మ॥ మగుడన్ దెప్పిరిపోరుహూతియభిసంపాతంబునన్ దారకున్।
దెగటార్పన్ సమవేతులై యడర నాదేశించుచున్ వేల్పుజో।
దుగముల్ నద్దైసవారలొక్కటయి యుద్యోగించి యొక్కుమ్మడిన్।
నగరాడ్ధీరునిఁజుట్టుముట్టికొనిరా నక్తంచరగ్రామణిన్॥

ఉ॥ ఇట్టులమైన రోసమున నిట్టలదేవబలంబశేషమున్।
జుట్టునుముట్టిపైఁబడుటచూచి ముదంబున నుబ్బెఁగానియా।
కట్టుపరాముఖీతుఁడయి కాడ్పడడయ్యె రవంతయేనియున్।
గట్టలుపైఁబడన్ బెరుఁగుఁగాని జ్వలచ్ఛిఖయాఱిపోవునే॥

ఉ॥ వేసఁగివేఁడివేల్పువలె వెల్గెడునీరుపుదిండితేఱిపై।
నాసురవీరులందఱొక్కటై బెడిదంపుఁమహానువట్టిన।
న్లేసిరిసుంతయున్ దెలిపియాక నిరర్గళదోఃపరాక్రమో।
ల్లాసమునన్ సహస్రములు లక్షలు కోటులు పోటుముట్టులన్॥

ఉ॥ దానికిసిబ్బుచూపిన మదద్విరదేంద్రముపోలిఁ నల్గియా।
దానవలోకనాథుఁడు మృధస్థలమేదెసఁ జారఁజూచినన్।
దానయి యొకఁడేనియునుఁ దప్పకయుండగ మృత్యుజిహ్వలన్।
బోనిఖురాలకాఘములపోటులచే నొగిలించె నెల్లరన్॥

సీ॥ సంఖ్యాతిగాటవీసత్వమధ్యమ్మునఁ గ్రుమ్మరునాఖేటకునివిధమునఁ।
ద్రచ్చునప్పాతుజిడ్డుప్రాయేటినీటిలోఁదిరుగుమందరధరాధరమువగిదిఁ।
గంద్రచీమలుమెండుగలమంజ్లపొదరులోఁదరికొన్నకారుచ్చైదారకరణి।
వితతవృక్షకమైన విపినదేశంబున విహరించుగంభీరవేదిమాడ్కిఁ।
నల్లకల్లోలమొనరించె నమ్మహోథ।
నుద్ధురుండొకఁడుండె జిష్ణునితుటుముల।
నెల్లనోచెల్లయివ్వీరుడల్లగిబ్బ।
రావుతేమొకొయనివారు భ్రాంతిజెంద॥

ఉ॥ మూఁగినసూడుకాంద్రపెనుమొత్తముపై నలతారకాసురుం।
డాఁగకడర్చుచున్న నిశితాశుగకోటులు సాంద్రమైనతూ।
నీఁగలపిండువోలెఁ దివినెకొఁని సూచనచేసె నత్తఱిన్।
గాఁగలయాదితేయకులకాంతలలోచనవారివర్షమున్॥

గీ॥ పొలసుదిండులయును నిర్జరులయానంత।
రమునఁ దత్తారకప్రవేశమునఁజేసి।
సకలదైతేయసైన్యంబు సాంఖ్యమయ్యె।
నాకిబలమంతయును నమనస్కమయ్యె॥

ఉ॥ లావరులైన కోటులకొలంది యరాతులతోఁబెనంగుర।
క్రోవిభుఁడొకఁడయ్యు భుజశుష్మవిశేషమునన్ శరాసవి।
ద్యావిభవోన్నతిన్ బ్రధనదక్షతనందఱికన్నిరూపులై।
హావళినొందఁజేసె నభియాతులఁ గాటపుటంపదోటులన్॥

ఆ॥ అసురవిభునిచేతి యాఁణిపోటులనొచ్చి ।
మానవానిమాట మఱచిపోయి ।
మఱచి సురలు చక్రిమఱువుసొచ్చిరి నిశా ।
చరులు కేలుగవలు చప్పటింప ॥

మ॥ సకలామర్త్యులపాటుగన్గొని మదిన్ జాలొంది జేజేలకో ।
డకుడీయఁగచభయంబొసంగి ఖగరాడ్వాహుండు త్రైలోక్యర ।
తుకమై శోభిలుదోశ్చతుష్టయమునన్ గామోదకీశార్ఙ్గనం ।
దకముల్ స్ఫారసుదర్శనంబు నిరువొందన్ దాల్చి తా వెల్వడెన్ ॥

చ॥ త్వరితగమంబునన్ నడచివచ్చుచునున్న సురాలయత్రుమా ।
ధర మొకొ యంచు నెంచదగుతార్క్ష్యుని విస్తృతమైన మూఁపుపై ।
స్థిరముగఁ గూరుచుండి చనుదెంచుచునుండిన విష్టరశ్రవున్ ।
దరణిసహస్రదీప్తిఁగని దగ్గఱనిల్చి సురారియిట్లనెన్ ॥

చ॥ తనజనయిత్రి దాస్యముకతమ్మునఁ జక్రులనెల్లశైశవ ।
మ్మునఁగడు మోచి మోచి యిరుమూఁపులు కాయలుకాచె నేఁటికై ।
ననుభరమైనచక్రివహనంబిది తప్పకపోయెనీసుప ।
ర్ణునకహొ యెంతవారలకునున్ విధిదప్పనెయంచు నవ్వుచున్ ॥

చ॥ జలనిధికన్యకాహృదయ సారసతిగ్మమయూఖబింబమా ।
దళితవిపత్తు నేఁటికిఁగదా విలువట్టుట నేర్చికొంటకున్ ।
ఫలమ్మొనఁగూడె నింతసులభంబుగనిన్ను విరాట్స్వరూపునిన్ ।
గలని[illegible]నర్చఁగల గౌరవలాభము సంఘటిల్లుటన్ ॥

ఉ॥ స్థామమునన్ ననుంగెలిచి తమ్మభరింతనినమ్మియున్నసు ।
త్రాముఁడు లోనుగాఁగల సుధాభుజులెల్లరుతల్లడిల్లసం ।
గ్రామమునందు నీదుభుజగర్వము సర్వముడంచిమున్నునీ ।
చేదృతులైన తొంటిభృగుశిష్యులయోటమి యప్పుదీర్చెదన్ ॥

ఉ॥ నావుడు నవ్వుచవ్వనజనాభుఁడు తాననునోరిమూరప ।
ద్మావరజుండ మున్నుచనినట్టి త్వదన్వయజాతయాతుధా ।

నావసుకోటియం దెడఁదనంతటికూరిమి నీవునుండినన్ ।
నీవును వాంఛ్రుచన్నసరణిన్ జనియుండుము వాంఛ్రపౌత్రునన్ ॥

మ॥ ఇదెనీపోకకు మార్గదర్శకముగా నే తెంచివారున్నయ్యా ।
స్పదమున్ జూపునటంచుఁబలికి యులమిష్వక్సేనుఁడన్వ్యగ్రుఁడై ।
వదలెన్ రక్కసిబంట్లుచూచి గతజీవప్రాయులై మూర్ఛిలన్ ।
గదనక్షౌణ్యాసక్పున్నికృత్తబహురక్షశ్చక్రమున్ జక్రమున్ ॥

* స్రగ్ధరావృత్తం *

స్వర్ణాద్రిన్ దొట్టికొండల్ వడవడవడఁకెన్ వ్రక్కలైదిక్కులెల్లన్ ।
ఘూర్ణిల్లెన్ దిర్దిరన్ దిగ్గుడువడెనఖలక్షోణిచక్రంబునున్ స ।
ప్తార్ణోరాసుల్ కలంగెన్ హాళహాళివడె లోకాళి త్రాసాకులంబై ।
దీర్ణంబై తూఁటువోయెన్ దివియుడుతతి నిస్తేజమై రాలెనుర్విన్ ॥

వ॥ అయ్యమోఘాస్త్రంబు కల్పాంతసమయ విజృంభమాణ ప్రద్యోతనద్వాదశకంబు నల్పశఃద్యోతమాత్రదీప్తిపాటియదిగఁబాటింపంజాలు ననిర్వచనీయంబగు నర్చిఃపుంజంబుతో నంతరాంతరంబున ననేక దివ్యాయుధసహస్రంబులు ప్రజ్వరిల్ల ననిసంపూర్వంబగు నతిభయానకాకారంబుచే నఖండబ్రహ్మాండభాండంబు నెల్ల మెండుకొని దుండగఁపుసంజడు దిండితండంబులెల్లఁదారకుండొట్టి తమకందఱకు నివియతీఱుదల యని యర్ధప్రమీతులై నిలువంబడియుండ నరుదెంచుచుండుటయుఁ దండిమగలమిండండగు నత్తారకుండు నిండారుబత్తినత్తిగకంటిని చిత్తంబున హత్తుకొల్పి దండంబులొసంగి బాహుదండంబులాస్ఫాలించి తారకాస్త్రమ్మని పిలిచినిలిచిన ॥

శా॥ ఆవైకుంఠునిచుట్టుకైదువనిషహ్యాటోపమై విద్విష ।
త్క్రీవల్ దూటలచాడ్పునన్ దనుమముద్రేకించి యేతెంచియున్ ।
దేవచ్ఛందములెల్ల నిర్భరభయాధీనంబులై చేడ్పడన్ ।
దేవచ్ఛందముపోలెఁ దారకుశిరోధిన్ దాలెనిర్విర్యమై ॥

వ॥ అప్పుడు తారకుండు నారాయణుంజూచి ॥

గీ॥ ననుచునిట్లనియె సుదర్శనంబుకంఠ।
దేశమున్నఁదాల్చిన యతండెధీరుఁడట్లు।
కాకయుండుట ధీరలక్షణముగామి।
యెఱుఁగ వేడిల్లవడిచూచెదేలయిట్లు ॥

ఉ॥ కేశవదీననన్నుఁ దలకింపగఁజాలకపోతిలేశముల్।
నాశరవిద్యయించుకగనంబరతుల్ దిటకించెదేయటం।
చాశరసార్వభౌముఁడలికాక్షునిఁజిత్తమునన్ దలంచుచున్।
బాశుపతాస్త్రమేసెను గ్రపావివశుండయియున్న శార్ఙ్గిపైన్ ॥

సీ॥ అమరేంద్రునన్నిఁగెల్చి యమృతంబుఁగొనిపోయి జననిబానిసము మా [న్పినతరసిఁ।
క్ష్మాధరంబులఁబోనిగజకచ్ఛపముల నంఘ్రినఖరాగ్రములనెత్తిన బలి [యుఁడు।
కడలిఁదాఁగిన యసంఖ్యనిషాదకులములఁ గబళీకరించిన ఘస్మరుండు।
విశ్వంభరుంగైన వెన్నునివెన్నునఁదాలిచిమోచు జితశ్రముండు।
వెనుకొనినపాశుపతశస్త్రమునకువెఱచి।
సత్తువకోలందిగా నాకసమునకెగసి।
పసిఁడిపల్వాదాలుపునకు వసముగాక।
వఱవఁజొచ్చెఁగరుడి చట్టుపల్ విదిర్చి ॥

శా॥ ఆదివ్యాయుధచక్రవర్తియు నవార్యాటోపమైం సర్వతః।
ప్రాదుర్భూతమహాగ్నికీలలఖిలబ్రహ్మాండముల్ ముట్టపెన్।
బాదన్ బెట్టుచు వెంటనంటిచనుచున్ వారింపశక్తుండుగా।
కాస్త్రై[illegible]విరోధిచిత్తముభయాయత్తంబుగానార్తుఁడై ॥

ఉ॥ శక్యమశక్యమన్నయుపజాపములేక యవధ్యుడైన వా।
ర్థక్యామమీఁదిదౌదశరథుఁదారుచు నాఘునహేతికుత్తమో।

దక్ష్యమహాకులీమనకుఁ దారిదొలంగుగతిఁన్ దొలంగుచొ।
త్సుక్యముదక్కి యన్మధునిషూదనుఁడంజలిజేసి మ్రొక్కుచున్ ॥

చ॥ భుక్తహలాహలాఖ్యవిషపూరణ నీలశిరోధిదేశయా।
ముక్తభుజంగరాజమయభూషణయోశివ నీకునిక్కపుం।
భక్తుఁడనేని యీభయదపాశుపతాస్త్రముబారినుండినన్।
ముక్తునిఁజేయ వేయనుచు మ్రొక్కులు పెక్కులొనర్చె శూలికిన్ ॥

క॥ అత్తటి నాపాశుపతా।
స్త్రోత్తమమఁపవార ణంబునొందె శివాజ్ఞన్।
బుత్తడి పుట్టము తాల్పును।
నుత్తులపాటెడఁదనెంతయును నలముకొనన్॥

చ॥ అఱసురలేక రాతినివహంబులనాజిఁజయించునంచున।
న్నటి మురి నేల పిల్చెన మరాధిపుఁడక్కట లేనిపోనిపె।
ద్దటికముమీఁదఁబెట్టికొని తారకుమీఁదికి నేలపోతినే।
నట గౌరవొన్నఁడున్ గలుగనట్టిది నాకుబొసంగెనిత్తటిన్ ॥

చ॥ విబుతునిశూర పద్మని యపీయసుఁ ద్రుంచి యనంశయంబుగా।
దమకుఁ జయంబొసంగి ప్రమదంబొన గూరుతునుంచు నమ్మియు।
న్న మఘువదాది నిర్జరుల సమ్మెకవమ్మయి ప్రోచుదిక్కులే।
కమనికితంబు గూరి యొమగన్ వలసెన్ నిసిద్రిమ్మరిండ్లకున్ ॥

మ॥ మిపులన్ బత్తిమయిన్ దపించి గిరిశున్ మెప్పించి యీచుట్టుకై।
దువుఁగైకొన్నది యాదిగా నసురులన్ దుర్వారగర్వారభ।
ట్యవలిస్తాత్మలఁ బెక్కరన్ సుఖముసేయన్ జాలితింగానియా।
ప్రవమున్ జెంది పరాభవంబునకుఁ బాత్రంబొట లేదెన్నడున్ ॥

శా॥ నానాదుర్జయదైత్యులన్ సమితిలోనన్ లీలమైఁ గెల్చినే।
నీనక్తంచరరాజబాలకునితో నీడాడియిట్టొటను।
త్తావల్ పెక్కుప్రవంతులీఁదియొకయీఁతంగీరితింగన్ననా।
ధ్దానుండుమ్ననుఁజొచ్చియీలిగిన చందంబయ్యెఁగాయక్కటా ॥

చ॥ పవియును జక్రమున్ దృణని భంబులగున్ దృణమాకడిందికై।
దువులగుఁ ధన్వమబ్ధియగుఁ దోయధిధన్వమగున్ రజఃకణం।
బవనిధరంబగున్ గిరిరజోంశమగున్ హిమబిందు వగ్నియా।
నివమగుఁ దారుణజ్వాల నమీశ్వరశక్తికసాధ్య మున్నదే॥

క॥ త్రిదశులిది ఖండపరశు।
ప్రదత్త వరమహిమ మగుటభావింపకయె।
ల్లి దముగఁ దలఁతురు తారకు।
మదమడఁపంజాలఁ డయ్యోమాధవుఁ డనుచున్॥

క॥ అనితనకు నెన్నఁడునుఁగలు।
గని పగతునివలని విప్రకారంబునకున్।
వనరుచు నంతహీనతుఁడై।
చనియె నధోక్షజుఁడు నిజనిశాంతంబునకున్॥

మంజుభాషిణీవృత్తం॥ వరతాపసాంచదపవర్గదాయకా।
పురుఫాలవహ్న్యుషిత పుష్పసాయకా।
ఉరగేంద్రభూషణ మహాత్మధోరణా।
హరిణాంకచూడ జగదాదికారణా॥

భద్రకవృత్తం॥ కాశమండనభాసురా। నాశితోద్యదిభాసురా।
కేశవార్పితసత్పదా। కాశికానగరాస్పదా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు సప్తమా
శ్వాసము.

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## పూర్వ భాగము.

### అష్టమాశ్వాసము.

క॥ ఉక్షేంద్రవాహనవిశా।
లాక్షీనాయక యనూన కాబ్జభవాండా।
ధ్యక్షు పరాత్పర యవిము।
క్త క్షేత్రని కేతనస్థితా విశ్వేశా॥

వ॥ అవధరింపుము శౌనకాది తాపసోత్తముల కయ్యైతి హాసికోత్తముండిట్లని చెప్పందొడంగె॥

ఉ॥ రక్కసితేని చేనని౯ బరాభవ మొందిము ముందునంతవాఁ।
దుక్కరి ప్రద్ర వించెనయయోయ్యఁకది కెక్కవరంచుఁ గుందుచున్।
బిక్కల బల్మియప్పటికిఁ బెద్దయుఁ దిక్కయియోడు సూపగా।
దిక్క మొగంబులై పరువుదీసిరి జన్నఁపుఁదిండు లెల్లరున్॥

మ॥ చరణద్వంద్వము సారెకుంగు దివడ౯ శ్రాంతాత్ములై యేగుచుం।
దరులంబట్టి సురారిసైనికులు మోఁదంబోవనాసోఁకుము।
పారులం దూటి భయంబు నొందక యుష్పృచ్ఛంబొంపుమీరంచుఁగా।
తరులంబేతు దోలంచి పీడొ్కలిపెఁ దైత్యస్వామి నట్టిలుఁడై॥

చ॥ పకపకనవ్వుచుంగృతులు పాడుచునాడుచునుర్ దలంచుమా ।
నికము సురాఘ్న నాకరమణీ తతిమున్నగువానిఁ జారశాం ।
ఱకెఱది దిండ్లు ప్రోల్చార బడంగ మకించు తెఱంగెఱింగితా ।
రసుఁ డునయానయజ్ఞుఁడు సురద్విషులర్ మరలింది యిట్లనెర్ ॥

చ॥ భషకములట్లు భీతులయి పాఱిరి వేలుపుజోదు లెల్లఁబూ ।
రుషులిటులిండ్లలేనితఱిఁ గ్రొత్తడులంబ తిదుర్ద శార్తులర్ ।
ద్విషద వరోధనాంగనలఁ దెచ్చుట గర్హ్యతరంబు గాదెపా ।
రుషమగునే పరార్ధములు ప్రుచ్చిలి తెచ్చుట పోటుబంట్లకుర్ ।

క॥ ఇతరులు మనలయెడలనే ।
గతిమెలఁగన్ వలయుననుచుఁ గాంక్షింతుమొయా ।
వితముననె నడచుకొనవలె ।
నితరులయెడ మనమునుఁ బరమేశహితముగన్ ॥

క॥ మనసాత్త్మ్యలు కడతే ।
ర్చి ననేద్వమె మనముపరుల రిక్థముగొనినన్ ।
మనకై వారెడ్చెదరని ।
మనమునఁ దలపోయవలదె మతిమంతునకుర్ ॥

శా॥ జన్యోర్విం బరి పంథులంగడి మిమ్మైసాధించుటల్ జాతరా ।
జన్యాన్మాకు నకర్హధర్మ మనుచుర్ శాస్త్రంబు శాసించుచుం ।
టన్యృద్ధంబద యంబుగాఁ జలిపినాఁ డంగాని నిష్కారణం ।
బన్యార్థంబుల కర్త్రు సంశ్రవముగా నాశింపఁ గైకొంటకుర్ ॥

శా॥ సంకల్పించిన యీకడింది షరి నిప్పృత్యూహన్మై తీరెనా ।
హంకారా మరనాయ కావ్య సకృదభ్యా సాదనాసాదితా ।
తంకస్వాంతము దైత్య వాగ్ధకము తత్తాదృక్ప్ప మోదంబునర్ ।
జంకల్ గొట్టుకొనంగఁ బోవునమిఁకర్ నైఘంబు గానిండ్లకుర్ ॥

చ॥ అనియిటులానతిచ్చుటయు నయ్యమరావతిఁ జూరవెట్టకా ।
త్మన గరికేగు దేరనసమాహితులయ్యు నలంఘ్య చండశా ।
సనుఁ డగుతారకాసురుని శాసనమున్ జవదాఁటనోడి చ ।
య్యనసురుల్ ప్రయాణమున కంతయు సిద్ధముచేసి తెల్పుడున్ ॥

చ॥ ప్రతిభయమైన యాప్రధన రంగమునన్ దనచేసినట్టియ ।
చ్యుత విజయాదులన్ వెఱఁగు చొప్పడవాకొనుకొంచు మెచ్చుచున్ ।
దితిజబలంబు వెంటనరుదేరగఁ దారకుఁ డేగిదూఁ కొనెన్ ।
గతిపయఘు ప్రయానములఁ గానన రాజముఁ బూర్వలిప్తమున్ ॥

ఉ॥ ఆవనిఁబద్మినీ ప్రియకరాం చదదక్షిణ బాహుభాస్వదో ।
జోవిరతారి తారకుఁడు సుస్థిరభంగని మగ్నయాతుధా ।
నావన నజ్జతారకుఁడు సాగ్రహచాలనమాత్రవిద్రవ ।
ద్దైవతరూత్తు తారకుఁడు తారకుఁ డాప్తులఁ గాంచి యిట్లనెన్ ॥

చ॥ నలువయిదొప్పు నీశుభవనంబున నీశునిఁగాంచుటెన్నఁగా ।
సులభమె యాకతంబుననొ సుస్థిరభక్తిఁ దపించు కావిగో ।
చులజడదారి కేనిబొడసూపని నీలశిరోధినుజ్వలా ।
నలమయ గోధినీశుభవనంబునఁ గాంచితిమేను నన్నయున్ ॥

చ॥ వనమిది శారదాంచి తనివాసము కావుటఁగాననత్వమున్ ।
ఘనవరుణాస్పదంబగుచుఁ గ్రాలుటచే వనరాశిభావమున్ ।
దనరగ భూరి యాపకలితంబయి యొప్పుట సత్రసంజ్ఞయున్ ।
జనములెఱుంగ సార్థత నెసంగర సంగడు హృద్యమయ్యెడున్ ॥

క॥ తమకిసలయంబులెసురా ।
గములుగఁదనరాను నిచటిత్త్వారుహానమువా ।
యమునకు సురాగములతో ।
సమతవదించుట సమంజసము గాదరయున్ ॥

వ॥ అనిపలికి ॥

సీ॥ రాచదివ్నెలుదిగ్గద్రావివానప్రస్థచిహ్నముల్ పొసఁగఁ దాల్చినప్రదేశ।
మసుధారణంబున కైకాయగ సవులాకలము లేరుచువచ్చినట్టియెడలు।
నిఖలబాహ్యాంతరింద్రియవృత్తులడఁచి పెంపొప్పఁ గాఢసమాధినున్న [నెలవు।
తిగవేలుపులకు మీఁదిదిద్దైన పరతత్త్వమైంద్రియకంబైన యట్టిచోటు।
తనము సాహస్రులకుఁ బ్రమోదంబెసంగఁ।
జూపుచురుదయాశాలినే శూలినేక।
పాలినే దుష్కృతతమోంశుమాలినేన।
మోయటంచిందుమాళికి మ్రొక్కె యతఁడు॥
క॥ ఇంచుకసేపవ్వనివిహ।
రించి మరలమరల హరుపరిం దివతులుగా।
వించుచుఁ దారకుఁడాన।
క్తంచరసైనికులతోఁ గదలె నిలుసేరన్॥
శా॥ సాంద్రారణ్యములాయతహ్రదములుచ్చక్ష్మాధ్రముల్ దాఁటియ।
య్యింద్రారివ్రజమెల్లఁ బ్రీత్యతిశయోపేతాత్మకంబై చనన్।
జంద్రాహస్కరవర్త్మరోధకమహాసౌధాళియావీరమా।
హేంద్రాఖ్యంబగు పట్టణంబుగనినయ్యెన్ లోచనోద్ధర్షమై॥
చ॥ అరదములందుఁ బొల్చువిజయధ్వజముల్ మనరక్కసీండ్లగె।
ల్చిరరులనంచుఁ జెప్పకయ చెప్పఁ జవంబుననచ్చుతారకా।
సురునిబలంబు దవ్వులనె చూచి సురార్యపసర్పులాశరే।
శ్వరుఁడగు శూరపద్మవిభుసన్నిధికేగి కృతప్రణాములై॥
సీ॥ తోలుగొంగడివాని మేలుసంగడికాని జక్కులతోఁగూడనుక్కమడది।
వింతగర్వేఁపుఁబోతుమంతవార్వపురాతు నోడించి కేల్గోయి మోడిపించి
మగమానికపువాలుదగఁ బూనిదివమేలుమగనిదేవళ్లతోఁ బొగరడంచి।
గ్రుడ్డుకానువుతేని దొడ్డపానువువానిఁ బగదీరమాడనిఁ జాడఁ జేసి।

వచ్చుచున్నాఁడు జగదేకవర్ణనీయ।
విక్రముఁడు నీదుకార్శ్యయవీయసుండు।
పోఁజుగమితోడనో శూరపద్మనామ।
సకలరాత్రించరాన్వయసార్వభౌమ॥

క॥ అనిప్రణిధులు విజ్ఞాపిం।
చిననుడువా శూరపద్మ చెలియంచునునా।
తనిమనము ప్రమోదార్ణవ।
మునయందునునొకర్మా తెఱ మునిఁగినవయ్యెన్॥

ఆ॥ అనుజవిహిత విధుజయాకర్ణనానంద।
పరవశుఁడయి దైత్యపరిబృఢుండు।
మంజులముగ వీరమాహేంద్రపురముగై।
సేయనైగములకు సెలవొసంగి॥

ఉ॥ హెగ్గడికాండ్రచే స్వజనయిత్రికి నాశుభవార్తఁబంపితా।
డిగ్గనశింహవిష్టరముడిగ్గి సభాసమలక్షుదర్శకుల్।
ప్రెగ్గడలప్పురింగలుగు పెద్దలుచుట్టలు పాదచారులై।
వగ్గను రేంద్రుఁడుచ్చకరివాహుఁడునై తన వెంబడిన్ జనన్॥

ఉ॥ తానునుఁ బాదచారియయి దానవనాథుఁడు శూరపద్ముఁడా।
దీనవముల్ తొలంగెఁ బొలదిండులకంచపుడైకకంత్యని।
ధ్యానముతోననుప్లవులు తారకువిక్రమముగా నుతింపుచున్।
దోనరుదేరఁదమ్మునకుఁ దూరముగా నెదురేగెఁ బ్రీతితోన్॥

చ॥ ఎదురుగవచ్చు తాతయసురేంద్రుఁడు జ్యేష్ఠుఁడు శూరపద్ముఁడున్
మొదలగు దైత్యముఖ్యులను ముందటఁదప్పులఁగాంచిప్రాంచిత।
హృదమునఁ దేరుడిగ్గి సురసాసుతమధ్యముఁడంఘ్రిచారియై।
ముదమునవారిచెంగటికిఁ [illegible]యెను ప్రాంజలియై వినీతితోన్॥

శా॥ దృష్టిప్రీణనమూర్తిఁదన్నుఁగని హస్తిండిగ్గి జ్యాయసచే।
యష్టింగైకొనియున్న తాతకిది మీయాశీఃఫలంబంచుసం।
శ్లిష్టశ్రోణితలాఖిలాపఘనుఁడై శ్రేష్ఠపాతంబుగా।
సాష్టాంగప్రణతుల్ పొనర్చెఁ బ్రగుణుండత్తారకుండత్తఱిన్॥

క॥ నిటలతటీఘటితాంజలి।
పుటుఁడై యత్తారకుండు భువిఁజాఁగిలియు।
తఱటమదునకగ్రజునకును।
కుటమణిఘృణులంఘ్రులలముకొనఁబ్రణమిల్లెన్॥

క॥ పదపడి రాతిరిద్రిమ్మరి।
ముదుసళ్ళులందఱకుఁ గేలుమోడ్చె నతండా।
హృదయాళు నెలమి నాశీ।
ర్వదించి వారలని రేకవాక్యత యొప్పన్॥

ఉ॥ ఘోరతపస్సులౌ ఋషులకుం దరిసింపగరాని యీశ్వరున్।
దోరఁపుఁబత్తి పెంపుమయిఁ దోషితుఁజేసిన యోమహాత్మయుం।
ద్రారులకెల్లఁ బుణ్యజనులంటకు నర్హతగల్గె నేఁటికో।
తారకయీసురద్విడవతారమునన్ ధరనీవుబుట్టుటన్॥

క॥ చేనెత్తిగాకయుండర।
మానేత్రప్రభృతులగు నమర్త్యులనెల్లన్।
జానేసి విజయమందిత।
హానేర్చునె నినునుతింప నహిపతియైనన్॥

గీ॥ అనుచుఁ గొండాడుటకు నొప్పకాఁగియసుర।
దశములను దేరిచూచి యత్తారకుండు।
మొలకనగవాననంబున నొలయననియెఁ।
దనదగు నహంతలేమి వ్యక్తంబుగాగ॥

చ॥ ఇటువలె మీ స్తవించుటకు నెంతటివాఁడ నదంభభక్తిని।
స్ఫుటగతకల్పశాఖియగుచుం దనరారుపినాకపాణియు।
క్కటికము పెంపుగాక యలకైటభజిన్మఘవాద్యులంజయిం।
చుటమదిఁ బక్కఁగా నరసిచూచిన నామప్రయోజకత్వమే॥

క॥ ఆతరసాశనకులమిహి।
శాతరణిభూతచక్రకరునిఁద్రిజగతీ।
నేతరమాపతినోర్చుట।
నాతరమాశంకరుకరుణగలుగకున్నన్॥

క॥ తలఁచినపని చేకూడుట।
గలిగినదది తనప్రయోజకత్వమనియుని।
ష్ఫలమైనఁ దైవికమనియుఁ।
బలుకఁదగునె యెఱుకగలుగు ప్రాజ్ఞునకెంచున్॥

మ॥ వసమీఱన్ గమలాసనాండమను శుంభన్నాట్యరంగంబునన్।
బసపుంజాయమదుంగుదాల్పు మొదలౌ పాత్రంబులన్ శంకరుం।
డసమానుండగు సూత్రధారుఁడయి తానాడించునేకానిలే।
దసుడీతుందుభబీజమంతయును స్వాతంత్ర్యంబు మేదారికిన్॥

క॥ పశువులు శరీరధారులు।
మశకము మొదలుగ రమాకమనునివరకునున్।
బశుపతిశివుండు నగుటన్।
వశగతులాతనికి ధాత్రువైకుంఠాముల్॥

ఉ॥ సృష్టిమొనర్పవాదిని విరించనునిన్ నియమించివిష్ణుఁద।
ద్విష్టపముల్ భరించుటకుఁ దీరిచి సంహృతిసేయరుద్రునా।
దిష్టునిఁజేసియున్ జగదధీశ్వరుఁడీశ్వరుఁడా త్రిమూర్తులున్।
శిష్టవిధేయులై పనులుసేయఁగనుంగొనుచుండు సాక్షియై॥

సీ॥ హాలహలాద్రిత్రస్తహరిహయాధోక్షజాద్యభయప్రదాయి యేప్రభు
[నిచేయి।
యాపదుల్లోలఘోరాజవంజవవార్ధితరణియే పరమునిచరణసరణి।
యపునరావృత్తి నిత్యాపవర్గానందఘటనైకచణయే జగత్ప్రేక్షణ
మస్కరిప్రవరులామ్నాయోపనిషదర్థవిందులేయొకిమీనివందులెపుడు।
నట్టిపరమేశ్వరునిదైన యక్కటికము।
తప్పినప్పుడు శ్రీపతీంద్రప్రభృతికి।
లేనియును సకిఁచిత్కరులై నిహీను।
లగుటయనివార్యముసుడీ నిశాటుఁహార॥

శా॥ అంచున్ దైత్యులకున్ ద్రిలోచనుని మాహాత్మ్యంబు వాకొంచురో।
మాంచాక్రాంతశరీరులై వినుచునమ్మాంసాశనుల్ బెబ్బులుల్।
పంచాస్యంబును వెంటనంటిచనులీలన్ వెంటనేగన్ బ్రవే।
శించెన్ దారకుఁడాత్మపత్తనమునన్ సేనాసమేతంబుగాన్॥

సీ॥ అలవివస్వత్తేజమపవారితముగఁజేసిన శరోన్నతినొప్పు ఘనుఁడితండె।
మొనసి దారుణరణంబున వృషాద్రులఁ బారఁదోలిన పురుష శార్దూల
[మితఁడె।
పూర్వదైవతమనోంబుజములు వికసించిశోభిలఁజేసిన శూరుఁడితఁడె।
సముపాత్తశర్వరీచరరాజ్యలక్ష్మిప్రభవుఁడైన వాహినీపతియితండె।
యనుచు వీరమాహేంద్రపత్తననివాసు।
లందఱునుఁ గూటువులుగట్టి యన్నిశాచ।
రోత్తమునిఁ దారకునుతించునులివుదక్క।
నన్యశబ్దమెయ్యదియు లేదయ్యె నవుడు॥

సీ॥ పయార్యతమిందీఆనీకళానిధిమాళిపరిరంభసుఖమును బడయఁగలదో।
యేపద్మిని యజస్రమీపురుషోత్తము నెదహత్తిసుఖలీలఁబొదలఁగలదో।

యెలమి నే శుభవాణి యాచతురాస్యుని మోవి తేనియలాని మురియఁ [గలదో ।

సతతంబు నేపుణ్యరతిగారవమున నీయసమాంబకున్గూడి యలరఁగ [లదో ।

యని యనిర్వచనీయగాథానురాగ ।
లైతలిరు బ్రాయమునమున్న యలరుబోండ్ల ।
నాథలుప్పరిగలమీఁదనుండి యతనిఁ ।
జూచుచుండిరి మోహంబు సోడుముట్ట ॥

మ॥ రణమందుర్ బరిపంథ్యసుగ్రసనసర్వాన్నినమా తార్క్ష్యధ్వో ।
రణువేయంచులవాలుకోమలతరప్రాలంబమెట్లట్లురోం ।
గణమందూనియపూర్వమౌ జయరమన్ గైకొన్న తేజోధనా ।
గ్రణికిన్ మంగళమంచు నెత్తిరువిదల్ కప్రంపునివ్వాళికల్ ॥

శా॥ స్థానీయస్థులొనర్పు నాత్మవిషయశ్లాఘావచోనల్పని ।
స్వావంబబ్జరిపూదయావసరశశ్వద్ధుష్టార్ణమానార్ణవ ।
ధ్వానంబున్ బురుణింపఁదారకుఁడు రథ్యాంబోయిచేరెఁ సురా ।
స్థానిన్ మించిన శూరపద్మనిసమాజ్యంబౌరవారంబుతోన్ ॥

మ॥ కొలవుంబెద్దలతోడ నచ్చమరునంగొల్పుండి యవ్వీటిగే ।
స్త్రులసేనంబులు వేలువేలరసి యామర్త్యారశౌర్యాఢ్యుఁడ ।
వ్వలనప్పారుల నెల్లఁగీములకుఁ బోవంబంధిదై తేయము ।
ఖ్యులతోడన్ దగుపుచ్చటల్ నెరపి వీడ్కొల్పెన్ సభాస్తారులన్ ॥

వ॥ తదనంతరంబున ॥

శా॥ ఆదైతేయకులైకమండనునిచే నాజ్ఞాతులై చేటకుల్ ।
శ్రీదాబీశ్వరనైరుతాంతకులచేఁ జేకొన్న గాంగేయర ।
త్నాఢ్యుల్ క్రిందికిడించి రాసులుగఁబోయంజూచి యత్యంతమున్ ।
మోదంబందిరి శూరపద్ముఁడసురేంద్రుండాదిగా బంధుగుల్ ॥

చ॥ తమకు నసాధ్యశత్రువగు దైవతనాథుని ద్రుళ్ళడంచెన ।
న్నమునమునన్ సురద్విడధినాథునిఁ దారకవీరునాప్తభా ।
వమలరఁజూచి పోవుటకువచ్చిన మాల్యవదాదులౌ నవా ।
ర్యములోకొ నాగనుల్లసిలె నమ్మణిరాసులు హేమరాసులున్ ॥

మ॥ సభచాలించి సవిత్రిఁజూడఁజనియాచండప్రతాపుండశా ।
శ్వభయప్రశ్రయభక్తియుక్తుఁడయి సాష్టాంగంబుగా మ్రొక్కె నా ।
శుభచారిత్రయుఁ బ్రీతినిర్గళితచక్షుర్వారివర్షంబుచే ।
నభిషేకించి చిరఁసుఖీభవయటం చాశీర్వదించెన్ సుతున్ ॥

శా॥ మాయాసూనుఁడు తారకాసురుఁడు భీమంబైన సంగ్రామమం ।
దేయడ్డంకియు లేక చక్రధరదేవేంద్రాదులం గెల్చితాఁ ।
బోయెన్ సేనలతోడ నింటికని యాప్తుల్ సెప్ప నాలించి దై ।
తేయానూకభవుండు నైరుతుఁడు హృద్వాన్నాధికానందుఁడై ॥

క॥ వ్యపురంధ్రీనిభవనితము ।
త్రిపురంగాదిపదసమహిరణ్యపదముశ్రీం ।
ద్రపురంబు వీరమాహేం ।
ద్రపురంబాతండు సొచ్చెఁ దగుబలఁగముతోన్ ॥

చ॥ కొమరితఁ దారకాసురునకున్ సహధర్మిణిగా నొసంగుత ।
ర్షమునఁ బ్రభూతసంఖ్యపరిచారకవర్గసమేతుఁడై స్వగే ।
హమునకు వచ్చియున్న నికషాత్మజునిన్ సురసాత్మజాగ్రజుం ।
డమితగుణఁగౌరవించెఁ దకటాంకుతనం బెవలేని యాదృతిన్ ॥

వ॥ అంతలోన ॥

ఉ॥ చెలువపుటెల్లయీమెయని చెప్పఁబకున్ దగియున్నపద్మకో ।
మలయను సుందరిన్ దనకొమారిత నాత్రిజగజ్జయేయుఁడై ।
యలరెడు శూరపద్మునకు నాశరసేతకు రాణిగాగనీఁ ।
దలఁచి తదాలయంబునకుఁ దొప్పుజనన్ బంపెదనంబునన్ ॥

మ॥ అసురేంద్రమండలత్వష్టరాకడప్రతీహారుల్ నివేదింపనా ।
త్తసమేతంబెదురేగి యాతనిఁబ్రమోదంబొప్పఁదోడ్తెచ్చియ ।
ర్ఘ్యసపర్యల్ కడుఁబ్రీతిఁగూరిచి మహారాజోపభోగ్యార్ఘ్యవ ।
స్తుసమృద్ధంబగు గొప్పయుప్పరిగలోఁదూఁకొల్పె నాశ్రీలునిన్ ॥

ఉ॥ త్వష్టయు మూలయేలికయు దైత్యకులేశ్వరునింటఁగొన్నినా ।
ళ్ళిష్టవినోదమోదముల నింపుగఁగాలముపుచ్చి హృద్గతా ।
భీష్టమువిన్నవింప నసురేంద్రునిపాలికి నొయ్యనేగియ ।
శ్లిష్టముగాఁ గుటుంబదశమీష్ఠునకిట్లనిరాసురాదికిన్ ॥

మ॥ కటివేల్పంతటివానినోర్చె నొకఁడొక్కండంచితన్యాయమే ।
మఱికేలున్ ద్రిజగంబులీదృశులు మన్కల్ గల్గునీతోడిచు ।
ట్టఱికంబున్ మదిఁగోరివచ్చితిమి గాఢప్రేమకారుణ్యముల్ ।
నెఱయన్ మా మొఱయాలకించి నెఱబాళిన్ మమ్ము మన్నింపవే ॥

మ॥ త్రిజగద్వందితుఁడైన కశ్యపునకున్ దేవేరివై నీప్రియా ।
త్మజవై త్రైలోక్యమునందుఁగల్గు కులకాంతాజాతిలో నెల్లన ।
గ్రజమా వాసికినెక్కె నమ్మునికిఁదోకంబోటచే నిమ్మహా ।
భుజులున్ బుణ్యులు తత్క్రుపోదితమహాబోధుల్ యథార్థంబుగన్ ॥

గీ॥ అర్ఘ్యసత్పాత్రములకుఁ గన్యలనొసఁగి ।
యమలవర్తనములఁ బిత్రృణములుదీర్చు ।
కూకుములుదూఁకొనెదు పుణ్యలోకములకుఁ ।
దగినవారలఁజేయవే తండ్రి మమ్ము ॥

ఉ॥ ఈశ్వరసాక్షికంబుగనె యుద్ధముఖస్తుతికాముదైత్యలో ।
కేశ్వర యీమహోన్నతికి నీవనిమిత్తము నీకతంబునన్ ।
శాశ్వతకీర్తిఁగాంచరి నిశాచరులీవిటు సేయకున్నల ।
క్ష్మేశ్వరుఁడిమ్మహాన్వయము నింతకుమున్నె యడంపకుండునే ॥

మ॥ అనుడుఁ మందహాసోపలక్షితముఖుండై దైత్యవర్షీయసుం
డనునో పావన వృత్తులార ఘనమాహాత్మ్యాపరాంభోరుహా।
సనుఁడై విశ్రుతుఁడైన భార్గవుని ప్రాసన్న్యంబునం జేసియీ।
యనిదంపూర్వముభావుకాతిశయమిట్లబ్బెఁ యథార్థంబుగన్ ॥

ఉ॥ ఆమహనీయుఁడేమిపని యానతియిచ్చిన నాదరంబునన్।
మానసదికాని దేశమసమాహితమయ్యును నియ్యకొంటయున్।
మే మొనరింపఁబూనినపని వలదంచునతండుమాన్పినన్।
బూనియ లేకమానుటయుఁబోలు బతంబులు మాకజస్రమున్ ॥

క॥ అయ్యుశనున కెఱిఁగింపక।
యెయ్యదియునుఁ జేయఁబూవ మెన్నండునునా।
జియ్యయధీనములుసుడీ।
యియ్యసురులు నీతనువులు నీసంపదలున్ ॥

ఉ॥ కావునమీయభీప్సితము కావ్యునకున్ దగవిన్నవించియా।
కోవిదమౌళిరత్నము భృగుప్రవరుండెదవిశ్చయించియే।
త్రోవఁజరింపనాదరముతో సెలవిచ్చునొ యాపథంబునన్।
బోవుదమంచు నద్దితిజపుంగవుఁడాత్మఁదలంచె భార్గవున్ ॥

సీ॥ తనప్రయాణప్రయత్న మెఱింగి క్రొత్తడిమిన్నయాశతపర్వచిన్నఁబోవ।
వేద్యమానాధ్యాత్మవిద్యారహస్యులు బోధవిఘ్నమునకు నాధిఁజెందఁ।
దడయకే తెండని యడఁకువమై వేఁడి ఛాత్రులు కొంతదౌసాగనంప।
నెటనుండివచ్చునో భృగుఁడంచుఁదలెత్తి సోఁకులభ్రమువంకఁజూచు
దనతనూదీధితులచేతఁ దచ్చికడలు। [చుండఁ।
వెల్లవేసినగోడల వితముగాఁగఁ।
దెల్లనై యుల్లసిల్లనద్దితిజగురుఁడు।
వీరమాహేంద్రమునడిగ్గె వింటనరిగి ॥

ఉ॥ బాలసురంగలాంఛనకపర్దునకుం బ్రణమిల్లి యాజగ।
త్పాలకునానతింగొని యతండు వసాహవనం మొనర్చన।
వ్వేళకు నేగె విష్ణుగుపవిష్టసమస్తతపస్విదేవతా।
జాలకు యోజనాయుతవిశాలకు దక్షునియజ్ఞశాలకున్ ॥

ఉ॥ శ్రీరమణామలచ్ఛవిరువు జెంది కనుంగొనుచుండ నమ్మహా।
పూరుషమాళిపోవుచు నెపోయి హరిమ్ముగనావివేకకం।
శేరునిదక్షునిన్ దనప్రదక్షిణకరంబున జుట్టుపట్టిగం।
భీరపుబిట్టమ్రోతదలపించు నెలుంగున నప్పుడిట్లనెన్ ॥

గీ॥ ఎల్లజగములతల్లి నా తల్లియేది।
రాపశువ యామెనిప్పుడు చూపకుంటి।
వేనియిందలు చూడనీ మేనికండ।
లోలి దిగ్వేలిమికి త్రికాహుతులొనర్తు ॥

క॥ చెట్టంతికూతురును బో।
గొట్టుకొనియుదిటవునన్ దగుదుననిజస్నం।
బిట్టులొనర్చుచునుంటివె।
కట్టానీయంతపాపకర్ముడు కలడే ॥

శా॥ ఓరీదక్షుడనీకు నే భయము లేకుండన్ నినుంగావనె।
వ్వారున్నారని నమ్మి యాదిమపవిత్రాడర్వాణాభాజనా।
కారున్ శంకరునామతింపకసభన్ గారొడ్డెముల్ ప్రేలితో।
వారిన్ రమ్మనుమిప్పు నీశిరముద్రెవ్వన్ ద్రేయనీకుంటకున్ ॥

వ॥ అనియాసభాసములనెల్లం గలయందిలకించి ॥

చ॥ పలువనుదక్షుబట్టియిదె బలిమ్రవధించుచునున్నవాడంగా।
జులుతొడిగించుకొన్నయనిజొచ్చుటకోపనిస్త్రీలుగాకిటన్।
మొలలకుదాళ్లుగట్టుకొని పొర్చెదు పూరుషులుండిరేని నే।
బిలుచుచునుంటి వచ్చివిడిపింపుడు వీనినటంచు బల్కెడున్ ॥

చ॥ ఒకరువుఁడట్లువల్ల విసుచుండియా శేవకసూరుచుండిరే।
మొకొనురలీయవజ్ఞ కెటులోరుతునేనని పూషుఁడాతర।
స్వీకడకునేగఁబంగ్లుడులిచెన్ శివఘర్మభవుండు పూషుఁడు।
ర్వ్యాకొఅగరెండుపొడలును రెండరజేసులఁబట్టి యేడ్చుచున్॥

చ॥ భగుఁడనునాతఁడేద్దెఅనభంబుశుభంబునెఱుంగకడ్డమై।
నిగిడిన వీరభద్రుఁడతనిఁ గనుదోయిపెకల్చిగూలిచెఁ।
భృగుమునియడ్డమేగివిడిపింపఁగడంగిన నొకట్లతన్నుత।
న్నిగిరిశ సంభవుండుధరణింబడఁగూలిచె నామునీంద్రునిఁ॥

వా॥ ఈనిర్మక్తఫణేంద్రకల్పుఁడెవఁడో యెన్నండునీక్షింపలే।
దోనాకౌకసులార యందఱును లెండుత్సాహమొప్పంగన్।
వీనిఁగెల్వఁదరంబుగాదెవరికిన్ వేర్వేఱమార్గాన్ననం।
చానొనంచు నునందఱుంగవిసి రాయుభ్రంలిహాకారునిఁ॥

ఉ॥ కొందఱ భూరిహుంక్రియలఁ గొందఱ రూక్షనిరీక్షణంబులన్।
గొందఱినర్థచంద్రములఁ గొందఱిఁ గుప్పిటిపట్టుపోటులన్।
గొందఱ బాదఘాతముల గొందఱిఁ దోడెవుబెంపకాయలఁ।
గొందఱ నాయుధాహతులఁ గూలిచెఁదాఁకినవారినెల్లరన్॥

సీ॥ పరిపక్వతృణరాజఫలములవలెఁదలల్ పఱియలుగాఁగూలియఱచువారు।
వాతముకుల్లనెత్తుత్రంతలువాఱంగ బుడమికేత్రాలి వాపోవువారు।
విలవిల గాలుసేతులు వెలికిలబడిగొట్టుకొంచేడుపు వెట్టువారు।
నిడుదనాలుకలుసాచి నడిమికిఁగరచి కుంభినిబోరగిలి విలపించువారు।
నగుచు నొకట్లరుఁడైనను మిగులకుండ।
నృపతిద్వంద్వభుజసారుఁడైనయట్టి।
వీరభద్రునిచేనట్లు వ్రేటులువడి।
చాపచుట్టుగగూలిరప్పప్పుడెల్ల॥

ఉ॥ వెడ్డిసునంతలేని భుజవీర్యమెలర్పగ వీరభద్రుఁడ ।
ట్టడ్డమువచ్చి తాఁకినవియాతులనెల్లరనొక్కరుఁ బ్రేల్మిడిన్ ।
జడ్డిగముల్ తొలంచి క్రతుశాలకు నాస్తరణంబొనర్చుచున్ ।
గడ్డుకొనన్ మదిన్ గినుక గ్రన్నఁ ద్రివిష్టపనాథుఁడెత్తెటెన్ ॥

శా॥ దంభోళింగుడికేలఁబూని పెనుకాంతాళంబునన్ ఘోరసం।
రంభుండై తనమీఁదనేయఁగ నకింపంగాన వేక్షించియా ।
శంభుస్వేదభవుండు నవ్వుకొనుచున్ సవ్రాదినీకంబుగా ।
స్తంభీభూతముసేసె నయ్యనవనాజంభారివో స్తంభమ్మునన్ ॥

శా॥ అంతన్ దాలిమిడిందిపశ్యదఃమహ్యోటోపుఁడై యిందిరా ।
కాంతుండా శివపుత్రునేయుటకుఁ జక్రంబెత్తినన్ జూచిని ।
శ్చింతుండై నిలుచుండి ద్రమ్మానుపిలఁ జేసెన్ వీరభద్రుండు దా ।
వంతంబందగ నాసుదర్శనముతో వైశంబవైకుంఠునిన్ ॥

మ॥ అకటా చూచితె నీకు నాప్తులగు విష్ణ్వాదుల్ పరాభూతులై ।
రిఁకనింకెవ్వరునీకు నోరిడుటటా యిష్టంచువాదక్షునున్ ।
స్తకమున్ గోటనెత్రుంచి హోమశిఖిమీదన్ వైచె వింతల్ నెలం।
తుకలున్ బెట్టుకడింది యేడ్పుటులివుల్ ద్యోవీధికిన్ బ్రాకొనన్ ॥

సీ॥ ఋత్విజులను వెక్కిరించి నవ్వెడువారు పెనువంటపాకలుపీకువారు ।
హవిరాదివస్తువులవనిఁ జల్లెడువారు వేమలఁగాల్మడివిరుచువారు ।
దక్షబాంధవులయాచలలు మొత్తెడువారు కుంబలుపందిళ్లుగూల్చువారు ।
వేలిమికొరముట్లు వెలిబారవైచువారగ్గికొండములు చల్లార్చువారు ।
విడువుడిఁకఁ బుద్ధివచ్చె నిప్పుడనిపించి ।
యడ్డుకొనువారి సోఁది రపడఁచువారు ।
నగుచుత్సవంబొనర్చిరయ్యక్షసొల్ల ।
నప్పుడవ్వీరభద్రానుయాయిభటులు ॥

మ॥ అటులాదక్షుఁడొనర్చుచుండిన మహాయాగంబశంకంబుగా
విటతాటంబొనరించి లబ్ధజయుఁడై వీరేశ్వరుండేగి ధూ।
ర్జటికిన్ సాగిలి మ్రొక్కుచేసి తదసర్గంబున్ నివేదించెన।
చ్చటవిష్ణ్వాదులు తన్నికారమునఁ బశ్చాత్తప్తులై కుందుచున్॥

శా॥ అజ్ఞానంబునఁ జేసి చేటొదవ నంచాత్మన్ వివేచింపకీ।
యజ్ఞార్థంబరుదెంచుటన్ దగినప్రాయశ్చిత్తమిష్టయ్యెనీ।
యాజ్ఞావర్తులమేము వెట్టుకొను మొత్తాలించి వేవచ్చిన।
ద్వాజ్ఞ మ్రొక్కుచునుంటి మీపెనువెతన్ వారించి రక్షింపవే॥

శా॥ అంచున్ వేడుచునున్న యాసురలకున్ యాలించి చూపట్టియా।
పంచాస్యుండు పురందరాచ్యుతులమ్రానాప్తుల్ తొలగించి వా।
న్నించెన్ వారల నేఁడుకోలునటన్ జేడ్పడ్డజేజేలర।
క్షించెన్ మేఁడశిరంబునుర్వి బ్రదికించెన్ దక్షునిన్ గ్రమ్మఱన్॥

ఉ॥ ఆగిరిశుండు వేల్పుదొరలందఱు వేఁడుటఁ జేసి వెండితా।
ద్యాగముపక్రమించుటకుఁ దక్షునకాజ్ఞయొసంగి తద్ధవి।
ర్భాగముముందుగాఁగొనె సుపర్వులప్రార్థనచే శివాజ్ఞనా।
రోగిణముల్ పొనర్చిరమరుల్ మఘువద్రుహిణాచ్యుతాదులున్॥

వ॥ ఇట్లసురప్రార్థితుండై దక్షాధ్వరంబు గావింపఁజేసి పశ్చాత్తాపదుఃఖితమనస్కుండై యున్నదక్షునూరడించి తత్రత్య నిఖిలబృందారకకర్శ్మంది బృందసంస్తూయమానుండై శివుండంతర్హితుండయ్యెనని చెప్పిన నప్పౌరాణికుం జూచి మహాత్మా సురప్రార్థితుండై సుమశరుండేమి సేసె నయోనిజయైన జగన్మాత శీతగిరినేతకెట్లు తనూజాతయయ్యె నానతీయవే యని శౌనకాదులు ప్రశ్నింపుటయును॥

మదనవృత్తం॥ ధారాధరఛవిగళా దమునోలలాటా।
స్వారాణ్ణతాంఘ్రియుగళా శశిఖండజూటా।
క్రూరాసుహృద్విశసనా కుధరేంద్రచాపా।
వారాణసీనివసనా వనమాలిరోపా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాధశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
ద్వితీయాశ్వాసము

---



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### తృతీయాశ్వాసము.

క॥ క్షీరోదమథనవేళా।
ఘోరావిర్భూతకాలకూటక్ష్వేళా।
హారపరిత్రాతజగ।
ద్వారావారాణసీనివాసాగారా॥

వ॥ అవధరింపుము శౌనకాది మహామునులకు రోమహర్షణసూనుండిట్లని చెప్పందొడంగె॥

మ॥ హిమవంతుండనువాసరాచరితసర్వేశార్చనుండొక్కనా।
డుమహాదేవనమస్యకోసమొక కండోలంబుచేబూనిపు।
ష్పములందెచ్చుటకొక్క చేర్వఁగల కాసారంబుఁబ్రాపించియం।
దుమనోజ్ఞంబులు పుండరీకకుముదామల్ గోసి సంతృప్తుఁడై॥

క॥ తామరలుగోసి యింటికిఁ।
దామరలుచునున్నతఱి న్వతాదృశజలరు।
ద్ధామధురానహమగుచును।
ధామధురాంభస్సున్మై పోటులు నక్రోలనన్॥

ఉ॥ ఒక్కసహస్రపత్రమున నుద్యదనూరునియంతృమండలీ ।
రుక్కనుమించఁజాలినయురుప్రభతో వెలుఁగొందుచఁబ్రవుం ।
జక్కదనంబుచే నజునిసర్గమునందునభూతపూర్వమై ।
యక్కఁడఁగానిపించెనొకయాఁడునిసుంగలగట్టుఱేనికిన్ ॥

ఉ॥ ఊయెలలోనఁబండుకొని యూఁగుతెఱంగున నాసముల్లస ।
త్తోయజగంధముఁబండుకొని తూఁగుస్తనంధయిఁజూచియయ్యవ ।
శ్యాయశిలోచ్చయేంద్రుఁడెదనబ్బురమందుచుఁ గొంతసేపుక ।
న్మాయకచూచుచున్ నిలిచె ముద్దులుమూటలుకట్టునాయమన్ ॥

ఉ॥ పోవుచుఁద్రోవలోనొడమె ప్రాఁదుపుఁగాంచిన కింపచానున ।
ట్లావలిసేలతాల్పుదొరయానిసుఁగుంగని హర్షమాణుఁడై ।
కేవలమున్ బ్రణంత్రనుజిఘృక్షుఁడు భక్తదయాళుఁడన్మహా ।
దేవుఁడు ప్రీతుఁడై యొసఁగెఁదీని నటంచెదఁబొంగె నెంతయున్ ॥

ఉ॥ అంటియునంటనట్లధికమైన మెలంకువతో నగేంద్రుఁడా ।
చంటిసిసుంగునెత్తి జలజచ్ఛదనంబునఁబట్టి పర్వుమై ।
నింటికి నేగి మేనకకునిచ్చెడునాచలిగట్టుఱేనివా ।
ల్గంటియుఁబొందె నెన్నఁడునుగాంచియెఱుంగని సంప్రమోదమున్ ।

మ॥ పసిఁడింబోలుపనానఁగొల్పుగనుశ్శోభన్ బొల్చుచున్నట్టియా ।
పసిబిడ్డన్ మెలపొప్పనెత్తికొనియా ప్రాలేయశైలేంద్రప ।
త్నిసుమాళంబునుజెంది కొంతవడికిన్ దెప్పర్లియానందబా ।
ష్పసమూహంబులు పెద్దసేపువిడిచెన్ శగ్గాతిరేకంబునన్ ॥

ఉ॥ ఆపసిబిడ్డనెత్తుకొని యక్కునఁజేర్చుటయున్ బ్రసూతికా ।
రూపముదాల్చె మేనకయురోజములంబెను చేఁపుజొబ్బిలన్ ।
జూపఱు మెచ్చలాసికిసుశోభననాటకశాలలోపలన్ ।
మాపొకవేసమున్ విడిచి మాఱటబారిసమూహముకై నడిన్ ॥

గీ॥ చాలుకాన్పును లేకయా సొగసుటడ్డ।
పట్టుపాపనుకూతుగాఁబడసి పురుడు।
లేనిబాలింతయ్యెయ్యో నా మేనకపురు।
డెందముఁగలదీశ్వరినకన్న యిందుముఖికి॥

ఆ॥ మొదటిగేస్తురాలు మూలప్రకృతిజన।
నీజనకులు లేని నిఖిలభువన।
కారణాత్మచంటికందయి మేనక।
చన్నుగుడిచె శివునిశాసనమున॥

ఆ॥ దొరకునిందువాళికరుణచే నొకతమ్మి।
దొరవియందు నొకఁగరితనిసుఁగు।
దొరకుటెట్టిఁగి చూడనరిగిరిపౌరులం।
దొఱకు స్మృతినుంకుతూహలులయి॥

మ॥ క్రితభక్తేప్సితదాయకుండగు కపర్దింగూర్చి పెక్కేండ్లురా।
వ్రతమంబౌ నియమంబునన్ మహింనగోత్రస్వామి కావించిన।
ట్టితపంబిప్పుడిదిన్ ఫలించెననుచున్ డెందంబులం దెంచిర।
ప్రతిమానమ్యతిమూర్తినాదియుతపాపంగాంచి యానైగముల్॥

మ॥ మును పెన్నండును నెందుఁబొందని మహామోహంబుగల్గించున।
య్యనిదంపూర్వవిలాసమూర్తిఁగనియష్టయోషధిప్రస్థవా।
సినులైనట్టి నెలంత లెల్లనిఘసాజీవాములన్ విస్మరిం।
చిని షేవించుచునుండి రెప్డెడయ కాశీతాద్రిరాజాత్మజన్॥

శా॥ బాలాంలోకశిరోవతంసమగుచున్ భాసిల్లునయ్యాశ్వరిన్।
నాళీకాక్షులు తూగుమంచములలో నంబంతుకో బెట్టియు।
య్యాలూగించుచు ముద్దులాడుదురమేయంబైన హార్దంబునన్।
లాలుల్ జోలలు దొట్టపాటలు మహాహ్లానంబునన్ బాడుచున్.

మ॥ నిఃమూహింపఁగలేక యీశ్వరినను వీంద్రాకల-సామాన్యబా।
లిక గా నెంచిరటంచు నవ్వుకొనుసోలిగ దోచెనప్డానెలఁ।
తుకలన్లక్ష్ణశరానురాగమునఁదన్ను సందిటను ముద్దుబె।
ట్టుకొనంబోయెమునప్డు నెత్తికొనినప్డు సారెకున్ నవ్వుచున్॥

ఉ॥ కంగటిప్రేంఖలోఁదగుసుఖంబు మెఱున్ శయనించికాలుగే।
లుంగదలించుచున్ జిలుఁగెలుంగెసఁగన్ దనలోనఁదానెఊ।
ఉంగయటంచుఁ బలుకొనుచుండు వినోదముజూచిచూచియా।
బంగరుబొమ్మనెత్తికొని భానులుముద్దిడుకొందురర్మిలిన్॥

క॥ పడకుండఁగెలనఁజూచుచుఁ।
బుడమింగూర్చుండఁబెట్టి సొలఁతులుకొన్నా।
ళ్ళాడికపుఁగనియగునాయమ।
నెడపక యాడించుచుందు రెలమిదలిర్పన్॥

చ॥ వెలఁదులచే ధరిత్రినుపవేశితయై యమవారిఁజూచుచున్।
గిలకిలనవ్వుచున్ దనము కేల్గవయాంసలిక్రొంబసిండిగా।
జులురలిపోవఁగొట్టుకొనుచున్ దనరెన్ గనకాంశిశాయిదీ।
ప్తులయినమతం-రంబులకు భూషలివేలనియెంచెనోయనన్॥

మ॥ తనతిర్యజ్ఞనునంబువింతసొబగుత్పాదింప మోకాళ్లురెం।
డునుఁగేల్దోయియు నేలనానుకొనియందున్ బ్రాకుచున్ జెంతఁగ।
ల్గినపంకేరుహపత్రలోచనలు గేలిన్ బట్టుకోపట్టుకో।
యనిపల్కన్ జనుఁదొంటికంటెఁమురుసౌ యానంబునన్నవ్వుచున్॥

చ॥ మగువలు గాఢహార్దలు హిమక్షితిభృత్తనుజాతముద్దు కే।
ల్దుగస్వశయద్వయాంగుళులతోగొని యామెను లేవనెత్తిచ।
ల్లగదకు కేలువట్టులు వెలారిచివిద్దెమువిద్దెమంచుమె।
ల్లగనిలుచుండఁబెట్టి పదిలంబుగఁజూచుచునుందు రాయమన్॥

క॥ వనితలు కనిష్ఠయోఁత।
ర్జనియోఁ కేలూఁతగానొసంగి పడవతిఁడర్భ।
గనిపెట్టినడుపహిమవ।
త్తనయనడుచు వారివెంటఁ దప్పటడుగులన్॥

ఉ॥ ఎడగల్గన్ నిలుచుండి రమ్మనుచు నయ్యేణాక్షిపోఁకుండినన్।
మడఁతుల్ కన్నులుకేలమూసికొనుచున్ మాయమ్మయేవచ్చెనో।
వడిమాతల్లియెవచ్చెనోయనుచుఁ బిల్వన్ మెల్లనన్ జిట్టిచి।
ట్టడుగుల్ వేట్టుచుఁబోయి మీఁదఁబడునొయ్యన్ ముద్దుగానవ్వుచున్॥

క॥ ఈక్షణములె క్షణములువున।
యీక్షణములె యీక్షణములు ఋతముగనుకొం।
చాక్షణదాపతివదనలు।
సాక్షాదీశ్వరినిఁబాయఁజాలరొకపుడున్॥

గీ॥ తనతనయకన్నియును మహాధనమణిమయ।
మండనంబులెకాని సామాన్యములగు।
మండనములుంచడయ్యె నాకొండదొరము।
హింభృద్గణికుపలములేమి కొదవ॥ [గుడి।

సీ॥ గుజ్జనగూళ్లుడాగురుమూతతను బిళ్ళగుడుగుడు గుంచముల్ కుందెన
నెట్టుకుగాయవెన్నెలకుప్పలచ్చనగాయలు గంజనకాలుపగడ।
సాలయొకటిసికొకుటి నాలుగుకంబములాటకోలాటములందలంబు।
చీకటిమొటికిళ్లుసిరిసింగణావత్తి బొమ్మలపెండ్లిండ్లు పుట్టచెండ్లు।
లోనుగాగనాటలు జనతానుతగుణ।
లొనువిదమిన్నలంగూడి జానుమీర।
సానుమత్తల్లజప్రియసూనువపుడు।
తానునాడును సామాన్యమానుషివలె॥

క॥ ఉత్తమవనితలు జీతము।
బత్తెమునున్ లేకయె యెడబాయక యెపుడున్।
దత్తబడవైకొలువహిమ।
వత్తనయాక్రమించె శైశవము తృటివోలెన్॥

శా॥ ఆపుణ్యాంగయతన్నునెల్లరు నశేషాజ్ఞేయవిద్యారహో।
క్షేపిష్ఠావగతిప్రవీణయని యగ్గింపెంతయున్ జేయన్వై।
ష్యోపాధ్యాయకసుంతయేనియును లేకుండగనే సర్వవి।
ద్యాపారీణమనీషయయ్యెఁ బరమేశాంచత్ప్రసాదంబునన్॥

చ॥ సదయకులోకమాతకలసత్ప్రథవర్తనసుప్రసిద్ధలో।
త్రిదశులవిద్విషద్భయము తీరిచిప్రోచుటకున్ గృపారసం।
బొదవియెడందలోనుబుకుచున్నదియే యొకో యిట్లుపైకొనన్।
గొదవమెఱుంగునిబ్బరపుగుబ్బచనుల్ తలచూపెనత్తఱిన్॥

క॥ తమదుశ్రుతిపారిదృశ్వ।
త్వముఁ వ్యక్తము సేయుచున్నవడువుననపుడా।
హిమనువతున్ఁతకన్నులు।
గ్గములసుదలకంటఁ బ్రాకినవిధమై పొలిచెన్॥

ఉ॥ పాయము పేరిగొప్పదొరబాల్యము పేరిటిచిన్నయేలికన్।
బాయగఁబారఁదోలి స్తనపర్వతదుర్గములాక్రమింపఁబో।
గాయజశిల్పియొకడుఁ గట్టినయట్టిపసిండిపావటీ।
లోయననుల్లసిల్లెఁ ద్రివళుల్ హిమవత్తనుజాతకౌనునన్॥

శా॥ తారుణ్యంబుప్రవిష్టమౌటకు నిమిత్తంబోయనన్ సమ్యగా।
త్తారుణ్యంబయి పద్మరాగమణినొయ్యన్ రాపడంజేయుచే।
పారెన్ మంకెనపూవుజంకెనయుగాఁ బల్లవప్రవాళప్రాదో।
ప్పారెన్ జెల్లరెవల్లకీగుణసముఙ్ఘన్నిక్వణక్షిప్తమై॥

క॥ అలనైయగ్రోధము కెం।
దలిరును మొదలైనవస్తుతతియున్నవిలా।
పలువల్లవకునీజా నని।
పలువలువచించింతు రే సు పలుకరు ప్రాజ్ఞుల్ ॥

చ॥ అమయగనున్న స్వర్ద్రవిణమంతయునుం దనునాశ్రయించిన।
ట్టిమొగడ చన్నుదోయికిఁగటిద్వయికిం ద్యజియించిస్వీయలో।
భమునకుఁజూడకుండుటనుబట్టియె విష్ణుపదంబుతోడిసా।
మ్యమొనవిపర్యాశ్యమయ్యెననమథ్యమమెంతయుఁ జెందెఁగార్శ్యమున్ ॥

చ॥ ఉనప్రసృతుల్ తురుండుహరునోర్చుటకున్ నవకూర్చుకొన్నకా।
క్మనాలగు తూణరత్నములు కావుటనిశ్చయమందమన్నని।
కర మెపుడునున్ విలోమములుకాని మనోజనిషంగముల్ విలో।
మములగు భూమిభృద్వరకుమారికచకర నిపికర తెల్లగున్ ॥

గీ॥ సూర్యభిక్షుతలావణ్యశోభమాన।
నార్యనైలక్షక ప్రతిభాతిరేక।
నార్యఁగాంచి వికుర్వాణుఁడనుచునయ్య।
హార్యసార్వభౌముండు మిన్నంటెనపుడు ॥

ఉ॥ ఆధరణీధ్రేంద్రమున నప్పుడుమాఁకొనె నీశ్వరుండనం।
బాధశిఖావితానము భద్రవటంబను పేరనొప్పు న్య।
గ్రోధము ద్రష్టృజన్యనికురుంబను తాంబువమండలాతిగో।
త్రోధము శాఖికోకృతశితద్యుతితిగ్మకరావరోధమున్ ॥

చ॥ సనకసనందనాదులగు సంయమివర్యుల వేఁడికోలునం।
బనుపడనగ్గిరీంద్రబహుపాదగమప్రవరంబు చెంతనుం।
జనియటఁగూరుచుండి మునిపుణ్యులుకండనివారికాజ్ఞయి।
చ్చినిటలలోచనుండొనరిచెం బరమార్థమహోపదేశమున్ ॥

శా॥ రుద్రాదిత్యమరుద్వసుప్రభృతిశుశ్రూషాగ్రహీత్ర్యాల్లస ।
త్పద్రాజీవుఁడు శర్వుఁడమ్మునులరున్ బల్కఁగఁడున్ లేకచి ।
న్ముద్రామాత్రముచేతనే సకలమున్ బోధించి నిస్సంశయా ।
త్ముద్రస్వాంతులఁజేసి వీడ్కొలిపియచ్చోనుండెఁదానొక్కఁడున్ ॥

ఉ॥ ఆహిమవన్నగాధిపతియప్పుడధిష్ఠితయానవర్గ జగ ।
న్మోహనవిగ్రహున్ దనముద్దుకొమారితఁజూచియే తదు ।
ద్వాహమహాప్రసాదమున ధన్యునిఁ జేసి యనుగ్రహింపవే ।
యోహరనన్ను నంచునతఁడువ్విళులూరుచునుండె నాత్మలోన్ ॥

గీ॥ రేలునుఁబగళ్లుమున్ సార్వకాలికముగ ।
వేలుతలఁపేదియును లేక విసపుగుటక ।
యేలికమదీయసుతనుద్వహించుభాగ్య ।
మున్నదోలేదో కదయునియుదిలగొనుచు ॥

మ॥ అతఁడొక్కప్పుడు తద్వటాంతికమునందక్షాఁడువాఁడచ్చటన్ ।
ద్యుతినుద్యద్దిననాథుఁ జెల్వమునఁ జేతోజాతునిన్ మించును ।
న్నతదేహంబమయన్ దపస్విపలె మానంబూని నవ్యాజ్నమీ ।
లితనేత్రుండయి కూరుచున్న శశిమౌళింగాంచెఁడబ్బాటునన్ ॥

చ॥ అగమునకల్లుఁడౌమనని వ్యక్తముసేయుచునున్నపోల్కిన ।
య్యగమునకల్లుడౌనటులు స్వాంగముమ్రానికినానికూరుచు ।
న్నగిరిశునిన్ జగత్త్రితయనాథునిఁగన్గొనిమేననెల్లెడన్ ।
గగురొదవన్ బొనర్చె మిహికాగిరినేత బహుప్రణామముల్ ॥

మ॥ అధికానందపరీతచిత్తుఁడయి సాష్టాంగంబుగాఁగన్ దయో ।
దధికయ్యిందుకలావతంసునకుఁ జోతల్ సల్పి విధ్యంజనా ।
షథికైక్షేత్రవ్వాడుచోటుసన్ నిధియొకాంచన్ గల్గెఁబోయంచునెం ।
తధరాగ్రీయుఁడు శూలిఁగూర్చియెమదిన్ జింతించువాఁడొటచేన్ ॥

ఉ॥ మంచుబిడారుగట్టువోరమానసమందనిశంబు నామొఱా।
లించియనుగ్రహింపవె బిలేశయరాజకలాపయంచువాం।
ఛించుచునున్న హ్వాడగట్టుచేఁ దనకాశ్రితరక్షకుండుకా।
న్పించియశక్యవర్ణనము ప్రీతివిశేషమొసంగుటబ్రమే

చ॥ త్వరమయినింటికిన్ జని యుదంతమదంతయుఁగౌరవంపుఁగా।
తురికెఱిఁగించి యాయమనుదోడ్కొని యెంతయు సంతసంబునన్।
గిరికులసార్వభౌముఁడరిగెన్ మగుడన్ మునువచ్చినట్టిపెన్।
దెరువుననీశ్వరుండు శ్రితదీనజనావనుఁడున్నచోటికిన్॥

గీ॥ శైలనాయకుఁడమ్మహేశ్వరునివలన।
నమయఁదదనుగ్రహమునాధనముఁనువడయు।
వలసిగిరపుగనుంచినట్లలికలోచ।
నునకుఁబరిచర్యకర్పించె నసుఁగుసుతను॥

ఆ॥ ఆనయ మెప్పడేమివనివంచునోయని।
శూలిమొగమునందె చూడ్కినిలిపి।
పరిచరించుచుండెఁ బరమేశ్వరునకునా।
లలనకన్నుసన్నలన్ మెలఁగుచు॥

వ॥ ఆసమయంబున॥

సీ॥ అరవిందనవమల్లికామ్రమనీలోత్పలాశోకంబుల నేడు నాశుగములూని।
తుమ్మెదగొనయంపుఁ దుంటవిల్వట్టి యందంపుఁగెందమ్మిఁబొందలము [దొడిగి।
మొసలిడాలు మెఱుంగు లెసఁగారు పులుకాసి పులుఁగువార్వాఁపుఁదేరు [పొనగనెక్కి।
మలయమారుతుని నామని తేని రాతిఠిపడఁతుక యొడయని బానటగొని।

సంఘుగోచితమైన వేసమ్ము పూని।
పద్మనాభాద్యమర్త్యులపంపుసేసి।
కడుఁబోఁగడుగాంచవలెనని కాంక్షఁబూని।
విషమనయనునిమీఁదికి వెడలెమరుఁడు॥

గీ॥ ఆసడిమొఱంగి తనహృదయంబుకుదురు।
చాటుకొఁకటిబ్రేళ్లతో పాఁతుపెకల।
నించువిలుకానితోరతియిట్టులనియెఁ।
గేలుగవఫాలతలమునఁగీలుకొలిపి॥

శా॥ ప్రాణేశా విను మొక్కవిన్నపము సుప్రాసన్నచిత్తుండవై।
వాణీనాయకభార్గవీపరిబృఢస్వర్లోకనాథాదిగీ।
ర్వాణస్తోమసమర్చ్యమాణచరణద్వంద్వున్ కృతాంతాంతకున్।
స్థాణున్ నీకుఁజలింపఁజేయఁదరమే చర్చింపుమీ చక్కఁగన్॥

క॥ అతఁడెక్కడ నీవెక్కడ।
మతినారసిచూడ హస్తిమశకాంతరమా।
శితిగళునకు నీకుమఁబ।
ర్వతపరమాణువులయంతవాసి నిజముగన్॥

క॥ చేటెయగుగాని విజయము
వాటిల్లదు నమ్ము నిక్కవమునీబోఁటుల్।
జోటింగుఁజెనయఁగడఁగుట।
లేటిపులిన్ నొంపవక్కళించుటయసుమీ॥

ఉ॥ ముట్టినమాత్రవాడుపడు ముల్కులతోఁజని నీవజాండముల్।
చట్టులచాడ్పునన్ జదుపఁజాలినముమ్మొనవాలుకేలను।
న్నట్టిలలాటనేత్రుశమనాంతకునోర్చెదవేని దూతచే।
[illegible]ట్టినపాసగంబుఖడఁగూల్చుటకోపుఁగదా యమాంసుఁడున్॥

చ॥ కలతెలుఁగెంటు లెల్లఁ దమకార్యమెచూచిరి కాని నీకుఁగా।
గలదొకవెంచరైరి తెలుఁగంట్లముఖస్తుతికుబ్బి చేటుపా।
టులరయనైతి పీవును మృదుండవు నరాసదుడమ్మహాత్ముఁడో।
వలదసమానకత్తుప్రియవల్లభ యీజతనంబు మానుమీ॥

వ॥ రతిమోహమోడకయిట్లు వలుకుటయు వారంభోరువుఁ జూచిన।
స్మితనై మోములరారమీఁ సిడపు వఁజ్రీఁడిట్లనుఁ విస్మయా।
వతమూఁడాభరణంబు స్త్రీజనమునస్వాభావికంబైనత్ర।
స్నుతచేనంటివిగాక శౌర్యధనులన్యుల్నాకునీడౌమరే॥

ఉ॥ ఎంతభుజాబలాఢ్యుడనో యేమియెఱుంగుమవాడనాసపీ।
వింటిరొ మద్బలంబెఱుఁగకిట్లు వచించెదుగాకలచ్చితో।
డంతటి వెగ్గలీఁడు నను నాత్మజునల్పుఁడనేని శూలిపై।
నంతకహంతపై శిఖిమయాక్షునిపై నెదిరింపఁబంపునే॥

ఉ॥ ముప్పదిమూడుకోటులు బుభుల్ దివినున్ననువారికేరికిఁ।
జెప్పినఁ నీకడిందివని జేయఁగ లేరనినన్ను వేఁడినా।
రప్పవిషాణిచక్రధరులంతటివారలు నాకునేనుగా।
జెప్పకొనంగనేమిటికిఁ జెల్వమదీయపరాక్రమోన్నతిన్॥

చ॥ భువనములెల్ల నాకుఁగలముట్టినమాత్రనవాడువాఱున।
ల్పవిశిఖపంచకంబునసలంచుచునుండుటనీవు చూచుచుం।
టివకద వారిజాతదళనేత్రి మదాశుగవృష్టిచేతఁడే।
జువిడిచి డిందకున్నె యలశూలియుఁగిలియు రేపుచూడవే॥

ఉ॥ స్త్రవ్యపరాక్రముల్ మఘవశార్ఙ్గధరాదులు వేఁడువారుజే।
లవ్వుఁడు వేఁడికంటివౌరధన్యజనుస్సుఁడసేనకాదెప్రా।
ణవ్యయమైనమేలె జయనంబొనగూడినమేలె యెట్లునుఁ।
జివ్వులకోర్కిఁ వెనుకదీయుమనేమినుమీఁదఁగూలినన్॥

ఉ॥ ఈశ్వరు నేనుమారుని జయించెద నేని యనన్యలభ్యమా।
శాశ్వతకీర్తిగాంచెదను చాలిక లేనికతంబునన్ మహాహా।
త్రాశ్వునిచేత నొచ్చి తెగటారుము నేని తపోధనుల్ మహా।
క్షీశ్వరులిచ్ఛగించెదరు మహిష్ఠపదంబున కేనుపోయెదన్॥

క॥ ఓయమునాతీరత్నమనా।
సూయాణము మాన్పకుము యశోవామృత్యు।
ర్వాయనిమినుసిగదొరపైఁ।
బోయెదనేమైన సరియె పూర్ణేందుముఖీ॥

క॥ పతియిట్లనుఁడుఁదదంఘ్రి।
ద్వితయముపైవ్రాలి యారతీదేవినమ।
స్కృతిజేసి నిల్చిచూడిరుద।
యితుని మొగమునందునిల్పియిట్లవె మగుడన్॥

ఉ॥ క్రొన్నెలతాల్పుతోడఁబగకూడదుదానదోసంగెసంగునం।
చెన్ని తెఱంగులన్ నొడివివేమునినున్ బతిమాలుకొన్ననా।
విన్నపమాలకించి యెదవింపవయాఁటనాకునమ్మెక్కా।
నున్నది కాకమానదెటులున్నదొ నాతలవ్రాఁతయింతకున్॥

ఉ॥ ఇంపలరార నామనవియెన్నఁడుఁగేటునఁబుచ్చవీవు నా।
పంపుకడంగితీరుపనపాల్పడుచుండెడివాఁడవిప్పుడా।
లింపవునామప్రార్థన బళీయల దైవచికీర్షితంబుత।
ప్పింపఁదరంబె యేతెవిలి పెక్కువగల్గినవారికేనియున్॥

క॥ పోనిమ్ము వెంటవచ్చుట।
కేనియునీకొనుము జీవితేశ్వరనన్నున్।
దీనికినినొప్పవేనిప్ర।
సూనాయుధ మరలవచ్చిచూతవు నన్నున్॥

ఉ॥ అంచువినీతిపెంపునఁ గృతాంజలియై రతియట్లువల్కె నా ।
పంచశరుండు వంచిదని పైదలితో రథమెక్కె సాగికా ।
వించె నభిక్రమంబు తన వెంబడి నెయ్యురుకూడ నేగవే ।
యంచులవాలుదాల్చిడినయానతిదిర్పఁ బినాకిమీదికిన్ ॥

ఉ॥ చేరువనొక్కఁడొక్కఁడీయచేసె క్షుతంబుకటుస్వనంబుతో ।
ఘోరువలంతిదవ్వునను పెద్దయుసేపటుచేరె రథంబుపై ।
బోరువదూఁకొనెన్ జెవులపోతెదుఱైచనె వైజయంతిపైఁ ।
బారువముల్ దివాంధములుఁ బాఱరలాడఁదొడంగె నత్తఱిన్ ॥

క॥ సకినములవిగనిరతితన ।
యొకిమీనియడుగులనొఱిగి యొంతగఁబతిమా ।
లుకొనినను వినకయాద ।
గ్ధకుఁడీశ్వరుఁడున్న హిమధరంబునకరిగెన్ ॥

చ॥ అవశకునంబులెవ్వియును నాత్మఁగణింపక మొండికట్టెపు ।
ష్పవిశిఖుఁడట్లుపోయి హిమశైలమునందొకచక్కఁబెక్కపు ।
ట్లవసుధనాక్రమించి కొమరల్ ముదిరాధ్వమునాకవెట్టునొ ।
క్కవటముక్రింద నీశ్వరునిఁగాంచెఁ బరాత్పరునాదిదేవునిన్ ॥

సీ॥ తనయపాలాపురుషికమునుముట్టఁదొలఁగించు నబ్బురంబగు మేనిహ
[వుసువాని ।
నుల్లంబునందేదియో విచారించుచుఁగన్నులుమోడ్చికూర్చున్నవాని ।
సేవకైజనకునిచే ననుజ్ఞాతరై యుమునన్నిధానమందున్నవాని ।
నుద్యద్దివాకరద్యుతికోటికంటె నగ్గలమైన తేజుచే వెలుఁగువాని ।
దక్షిణామూర్తియను పేరఁ దనరువాని ।
నల్లకుత్తుకదొరఁ గాంచి యొల్లమేని ।
కింగగురువుట్ట మోడుపుకేలువ్రాని ।
చిన్నిపువ్వులు పెక్క నర్చె రతిజాని ॥

చ॥ జడియక చిల్కరావుతు విశాఖముగా నిలుచుండివిల్లుగే।
ల్విడఁగొనియెక్కువెట్టి హృదిలెప్పముగా రతిదేవియొట్టిపెన్ ।
బెడఁదపొసంగునోయనుచు బెగ్గిలిచూచ్చునుండదర్పమే।
ర్పడనడరించె నంపఱపరంపరగా నుడురాజమౌళిపైన్ ॥

గీ॥ దానసించుకమది గలంతపడుడున్ ని।
దానమించువిల్తుఁడే యంచుఁదలఁచుచుగజ।
దానవనిషూదనుండు ముందఱకుఁజూచెఁ।
దానవుడు మీఁదిపోగకన్ను దరతుదెఱచి॥

చ॥ ద్రుహిణచతుర్భుజామలమరుల్ దివినుండిమహానుభావయా
గ్రహముపసంహరించి కృపఁగావవె మీనినటంచుఁబల్కుచున్ ।
బహువిబిడార్తరావములఁ బ్రార్థనసేయుచునున్నయంతలో।
మహరుఁడు నీఱుసేసె మరునిన్ నిటలోదితవహ్నికీలచేన్ ॥

గీ॥ అవురకనుమూసి కనువిచ్చునంతలోనె।
విలునునమ్ములునున్ గొనినిలిచియున్న।
కామునిన్ బసుమఁపుప్రోవుగాగమార్చెఁ।
త్ర్యంబకుండాదిమప్రాతిహారకుండు॥

మ॥ భువిపై దిప్వయతాఁకునన్ సుషమమై పొల్పొందుకప్రంపుబో।
మ్మనలెన్ ధూర్జటిఫాలనేత్రశిఖిసంస్పర్శంబునన్ బేసిక్కై।
దపుజోదట్టులు మండిపోవుటయుఁదద్దుశ్ఖాతిరేకార్తయై।
యవనిన్ దెళ్విదోఱంగికూలె రతి హాహా నాథయంచార్చుచున్॥

ఆ॥ కృత్తమూలయైన మృదులాంశుమత్ఫల।
వలెనెకూలి పెద్దవడికిఁదెలివి।
వూని యేడ్వఁదొడఁగె వినియతీవెల।
పలుకునఘూర్ణించు నెలుఁగుతోడ॥

చ॥ మడిసితిఁ గూలితిన్ బిలుకుమాలితి బిద్దితిఁ గీటడంగితిన్ ।
గెడసితి నేలపాలయితి గిట్టితి దోరితి గంతుకొంటి మే ।
నెడసితి ప్రమందితిన్ జెడితి నీల్గితి ప్రాగ్గితి డింకవేసితిన్ ।
ద్విడిభమృగేంద్ర మాసమసితిన్ దెగటారితిఁ జచ్చిపోయితిన్ ॥

మ॥ అలరుంగైదువుజోదనీవుపయనంబై సాగుచున్నప్పుడా ।
కొలపుం బెద్దను మేనఁ దాల్చిన శశింగోటీరమందుంచుకో ।
న్నలలాటాక్షు నెమర్పఁ బోకుమనుచున్ వాకొంటకో నాగఁ గుం ।
దెలెమర్వచ్చుట చూచియప్డె యనుకొంటిం గెల్పు లేదంచె దన్ ॥

సీ॥ నీవన నెంతయుం నిటలాక్షు నెదిరింపఁ జక్రహస్తుండైనఁ జాలఁడంటి ।
నాతని యనుకంపకాశించి హరికాంక్షులు నిత్యమాతనిఁ గొల్తురంటి ।
జడదారులకె కాదు శర్వుఁ డధోక్షజబ్రహ్మాదులకునును బాస్యుఁడంటిఁ ।
దపనేందువహ్నితో దాడియాడుట పతంగంబు దావంబుపైఁ గవియు
నానుడువు మినుముడియగా నమ్మి శమన । [టంటి ।
మధనుఁ డగుశూలిపైఁ బోకమానుమంటి ।
నోటి ప్రవ్వకొనర్చిన నీతిపోత ।
యయ్యె నీపీనుమగకున్నా ప్రార్థనంబు ॥

క॥ చెవిఁ గిల్లుగట్టుకొనిమొ ।
న్నివిధంబులఁ బోరినన్ వినిమొడంబడవై ।
శివినాము విన్నపమునకుఁ ।
జివరకునింత దురవస్థ చేకూరెఁగదా ॥

క॥ యమరాడ్ఘనుఁడు నిను [illegible]దు ।
సుమములుపై వైచినట్టి సుమనోధర్మున్ ।
కుమమాలి పిలుకుమాలి చె ।
నమరన్ సుకృతీగతాయువనునుడి వృషమే ॥

ఆ॥ మదనుఁజంపిశివుఁడు తదనువ్రతనునన్ను।
నీల్గఁజేయకుండుటేమిన్యాయ।
మత్తచేసినపనికారళ్ళు లేవను।
నానుడిన్ దలంపునకుఁదగిల్చె॥

చ॥ జగములనెందునున్ మగలుచచ్చిన స్త్రీల్గతజీవమైనయా।
మగనికళేబరంబుపయి మ్రానువలెన్ బడిపెద్దపెట్టునన్।
వెగచుచుఁగొంతసేపు పలవించెదరంతటియోగమేనినా।
కుఁగలుగదయ్యె నయ్యయొ యగోచరమయ్యెను నీదుబొందియున్॥

సీ॥ మేలిమిబంగారుమేలింటిలోనుండుదేహమేమయ్యెనో మోహనాంగ।
శోకమ్పైకములకోజ్జతనంబువ్రాని నపలుకులేమయ్యెనో భవ్యమూర్తి।
యఖిలలోకములననర్గళంబుగనొంచుకడిమియేమయ్యెనోకదమనోజ।
యెపుడును నెడబాయనీయని నామీఁదియరితియేమయ్యెనో యసమ
మనకుసత్సరినక్రమమ్లై మంతుగనిన। [విశిఖ।
స్పర్శనకుమారుఁడునునలచైత్రుఁడునుఁడ।
మీశ్వరుండునుఁగాన్పించరేమిప్రాణ।
నాధయెంతలోనెట్లయ్యె నాయవస్థ॥

చ॥ పొడమినవారిలోఁ బొడమఁబోయెడువారలలోనుగూడనా।
యొడయనికెవ్వరున్ సదృశులుండరు చక్రదనంబునందటం।
చెడఁదఁదలంచుచున్ సుభగనేనెకదాయని పొంగుచుంటినీ।
గడెవరకయ్యెనా హృదయగర్వము సర్వము ద్రుంగనేటితోన్॥

మ॥ దరహాసద్యుతికౌముదీకముఖచంద్రంబున్ బృహాదారసక్రమున్,
స్ఫురదాజానువిలంబిబాహుయుగమున్ ఫుల్లాంబురుట్పత్రజి।
త్వరకర్ణాంతపరీతవల్గునయనద్వంద్వంబునౌ నీమనో।
హరరూపంబునుజూచుభాగ్యమిఁకలేదా నాకుఁ బ్రాణేశ్వరా॥

ఉ॥ ఈసహధర్మిణిన్ విడిచియేగితివోఁటిగ ధర్మమేనినున్ ।
బాసిని మేష మేనియునుఁ బన్నుగ మున్నెపుడైననుంటి నే ।
వాసరనాథ తేజపిసువాసముపీసరవోవకుండనీ ।
వేసరణిన్ సురింగితివొ యేర్పడఁ దెల్పవె వెంటవచ్చెదన్ ॥

చ॥ అతులితరామణీయక సమన్వితమా భవదీయమూర్తిదృ ।
ష్టిగతులు నేమొయన్నవెఱచే నొకనాఁడునుఁజూడలేకపో ।
యితిఁదమిదీరునట్లు హృదయేశ్వరలోచనతృప్తిగాఁద్వదా ।
కృతియొకసారిచూపి మఱియిప్పుడెపోదువుగాని రాగదే ॥

చ॥ నినునినునంతదీప్తిఘనునిన్ సుడికైవపుదాల్పుకూర్మినం ।
దనుదనుజాంతకోపమును దారతరస్ఫురన మూర్త్యశత్రుభం ।
జనుజనురమ్భతుంజటికేఁజంపెఁగదా నిటలాక్షుఁడాతఁడో ।
పనిపని లేదటం దిపుడు స్పష్టముగాఁ దెలిసెన్ ద్రిలోకికిన్ ॥

ఆ॥ ఇదిసుకరము శక్యమిదియను భేదంబు ।
లేని సర్వశక్తిగాన శర్వుఁ ।
డమరుమమునిఁజంపెనట్టి దుర్లభమహో ।
భాగ్యభరము నాకుఁబట్టుటెట్లు ॥

ఉ॥ నెయ్యురనెప్డుఁగోల్పడని నిత్యసువాసినులైన వేలుపుం ।
దొయ్యలులందునన్నొకతెనున్ మృతభర్తృకగానొనర్చినా ।
కయ్యయొయిట్టిబెట్టిదపుటార్తిగదించుటకెంతజాలిలే ।
దయ్యెనొయష్టమూర్తికి దయానిధియందురుగాదె యాతనిన్ ॥

ఉ॥ పరిచజనాంగనల్ మొదటిబాముఁనఁబున్నెపునోములేమిగా ।
పించినకారణంబున భువిన్ జనియించినవారొకోమగల్ ।
పంచతనొందినప్పటివిపత్తున భర్తలతోడఁదామునున్ ।
మించినకూర్మిమైననుగమించి సుఖింతురుశాశ్వతంబుగన్ ॥

చ॥ ప్రిమలనిపాపమేమియొనరించి దివంబునఁబుట్టినానొయో।
మృదుతరమూర్తి నిన్ననుగమించి సుఖించెదనన్న నాకుఁజా।
వుదొరకదేమి సేయుదు శివుండు నమద్భవతాతియమ్మహో।
భ్యుదయమునాకొసంగవలెఁ బూర్తిగనాయెడ జాలిపుట్టినన్॥
ఆ॥ ఎప్పుడే ప్రయాతకెమరాదునోయని।
కాలుకదపఁగొంకుగదుర వేల్పు।
లేమఁగొకక తెకును లేని వైధవ్యావ।
మానమెట్టులోర్తు నేనుముందు॥
చ॥ కరమువినీతినిందనుక గారమొనర్చెడువారెయయ్యునున్।
బరిణయమాదిగాఁగల శుభంబులలో నిటబట్టియక్షుకి।
న్నతవిబుధాదియోషితలు నాయగపాటున కేవగించుచుం।
దురుకదయెంతఘోరమగుదుర్దశదాపురమయ్యె నేటికిన్॥
మ॥ అనివాపోవుచునున్నయన్నవలయే డ్పాలిందిన ర్వేశ్వరుం।
డనుకంపారససిచ్యమానహృదయుండై యందువిచ్చేసి కాం।
తునిమేబూడిదప్రోవుమీఁదఁబడి యంమంబొల్లికల్ వెట్టున।
త్తనుమధ్యన్ దిలకించియిట్లను సుధాధారాసమానోక్తులన్॥
గీ॥ నేత్రమేకదయిదియు ననియ లెప్పిల్ల।
త్వదుపసంవ్యానమఁ స్రుశులఁదడిసిపోవ।
నేడ్చుచున్నావు వీఁటిడీయిట్టులెనియు।
గంబులేడ్చిన నీభర్త క్రమ్మఱిలునె॥
క॥ స్వార్థపరులైన త్రిదశుల।
ప్రార్థనమునఁజేసియంతరమెఱుఁగకనున్।
దుర్ధర్షుఁగలఁచియింతయ।
నర్థము దెచ్చికొనెనీసుమాయుఘుఁడతివా॥

చ॥ నెలతలమానికంబుగజనిందినదానవు నీవునేనునుఁ ।
నెలతలమానికంబుగన నింద్యతనొప్పకునీకునిత్తఁ ।
గలిగినవంతనాయుదియగా నెదలోనఁదలంచుచుంటినీ ।
యలజడిమాన్తునెమ్మ పఁకచాంబుజపత్రవిశాలలోచనా ॥

ఉ॥ స్తవ్యశరాసవిద్యుఁడగు త్వత్పతినాయెడనుద్యతప్రస ।
వ్యవ్యవసాయుఁడైచెడె నహంయుఁడు నీహృదయేశ్వరుండుశక్తం ।
తవ్యుఁడుకాడుగానియయినఁ నినుఁగూర్చిక్షమింపనయ్యెనై ।
ధవ్యమునిన్నుఁబొందమికి దర్పకుఁజిచ్చితినీకుఁగ్రమ్మఁ ॥

క॥ ముదితాతొంటితెఱఁగుననె ।
బ్రదికిమరుఁడొనర్చుఁగాఁపురమ నీతోడఁ ।
ద్వదితరులకుమాత్రమతం ।
డదృశ్యమూర్తియయి జగములందుఁజరించుఁ ॥

చ॥ అడలకయింక నీమనిలయంబునకుం జనుమన్నగిత్తత ।
త్తడిదొరయానతిచ్చిన సుధామధురోక్తులకాత్మఁబొంగియ ।
ప్పడఁతుకతత్పదద్వయముపైఁబడి జోతలొనర్చెఁ బిమ్మటఁ ।
మృడుఁడపవారణంబునఁజనెఁ రతియుఁ దనమనికిఁజనెఁ ॥

వ॥ అనియిట్లుసూతుండుసెప్పిన ననంతరవృత్తాంతమేమని యా
మునులడుగుటయును ॥

మణిరంగవృత్తం॥ కేశవాద్యవగీర్ణచరిత్రా । పాశివందితపచ్ఛతపత్రా ।
జ్యాశతాంగయమహాశ్వశరాసా । కాశికాఖ్యనగర్యధివాసా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
తృతీయాశ్వాసము

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### చతుర్థాశ్వాసము.

క॥ స్మృతిసముదాయాగతిభీతి ।
శ్రితమార్కండేయమునిపవిత్రాశాస్థాం ।
ఘృతశైలైకప్రహరణభం ।
జితశమనశిరఃప్రదేశశ్రీవిశ్వేశా ॥

వ॥ అవధరింపుమమ్మహర్షులకు రోమహర్షణి యిట్లని చెప్పందొడంగె॥

పంచచామరము॥ వృషధ్వజుండు ఫాలనేత్రవీతిహోత్రకీలలన్ ।
ఝుషధ్వజుం దహించి భస్మసాత్కరించి పోవుడున్ ।
విషాదమందిగట్టుపట్టి వెచ్చనూర్చి చింతిలెన్ ।
విషాదపాణిపీడనేస్టి నిఘ్నుఁడిత్తయాటచేన్ ॥

శా॥ నన్నున్ దమ్మునుఁ గూర్పఁ దారకొనిన కందర్పున్ హతున్ జేసెనా ।
మిన్నుంగూఁకటి వేలుపాతనికి నామీఁదన్ గృపాలేశమే ।
నున్నన్ మారుఁ జికీర్షితోపకృతి నయ్యుగ్రాక్షుఁడ స్లైలచే ।
యున్నాబోఁటి యభాగ్య కంటటి మహాయోగంబు చేకూఱునే ॥

ఉ॥ ఎట్లిఁక నేను వెండి పరమేశ్వరునిన్ దరిసింపఁగందునా ।
కెట్లిఁకఁ దత్పదాంబుజము లెప్పటి గొల్చెద బాగె మబ్బునే ।
నెట్లలదర్పకాంతకునకింక ననుగ్రహపాత్రభావమున ।
న్నెట్లు పరిగ్రహింతపనతఁడే కొనునంతకు నోచికొంటినే ॥
ఉ॥ ఎక్కడిమాట వెఱ్ఱితమి హెచ్చున వాసిగణింపఁగానినే ।
నెక్కడ సర్వలోకవిసరైకశరణ్యుఁడు చంద్రశేఖరుం ।
డెక్కడ నమ్మహాపురుషుఁడింపలరన్ జను దెంచినన్నుఁగా ।
ల్ధ్రాత్రిఁ గుక్కటసంభవంబును దిలోప నీయఁడి యోసయేటికిన్ ॥
చ॥ హిమకరమౌళినిన్ బరిణయించుట నోమును నుంబునోముల ।
ల్పములొనరించి యొక్కవఫలంబులుగావలెనన్న వచ్చునే ।
యమృతమయూఖశేఖరుని యంకలివాంఛ మనురల్పుకొండమ ।
న్న మరల దేమి సేయుదును నాహృదయార్తికిఁ బారమెద్దియో ॥
చ॥ గొనకొని శ్రోణుఁడెత్తరఁపుఁ గొండపయిన్ సహకారభూరుహం ।
బునవలరారు స్వాదుఫలముంగనికోయుట కెక్కఁబోవులా ।
గున నవివేకబుద్ధినయిగొంతెమ కోరెక్కలుకోరుచుంటిఁగా ।
కనగుదు రెవ్వరేన్నిఁదినఁ గామహరుండు ననున్ వరించునే ।
చ॥ ననుననుకంపవూనితన నాతిగ నాతిగ కింటిమేలిసన్ ।
దనుకున మేయమైన ప్రసాదంబసాదంబ మానంబునందునా ।
జనకుఁడు మిన్నుముట్టు నెల సంబునసంబున భూతపూర్వమై ।
యనయముగారవించు రహినన్నయునన్నయు తప్పియోక్కులన్ ॥
సీ॥ తనకుండఁజో టెంచునొసగూడనట్లు సర్వేశ్వరుఁడిచ్చోటి కేలవచ్చె ।
వచ్చెఁబోయాతని వరివస్యకై నన్న గేంద్రుఁడాతని పజ్జకేలపనిచె ।
ననిచెఁబోయకలంకమైనట్టిమామకహృదయమాతనియందు నేలతగిలె ।
దగిలెఁబో సర్వజ్ఞుఁడగు నాశ్రితార్తిభంజనుఁ డేలనన్ను నీకొనకపోయె ।

నన్నతఁడు పెండ్లియాడకయున్నన్టై ।
పోవునతని పదాంబుజంబులకుఁ గట ।
నుండుటయుఁగూడ లేనిప్రత్యూహ మొదవ ।
ద్రాబతలిరువిలుతుఁడేలదాపరించె ॥

చ॥ అరయఁగనెల్లలోకములయందలి యౌవనవంతులైనస్త్రీ ।
పురుషులసంఘటించుట యెప్పూనికకర్జముగా మెలంగుశం ।
బరదితిజాహితుండెయెడబాటునకున్ గతమయ్యెనీలకం ।
ధరునకునాకునున్ బళిరనాబ్రతుకెంత జగద్విరుద్ధమో ॥

ఆ॥ త్రిణయనుఁడువరించితీరనై నవలయు ।
నేను మేనువిడువనై నవలయు ।
నీశ్వరునకుఁగాని యీదేహ మేలసొం ।
దర్య మేలజవ్వనంబిదేల ॥

ఆ॥ మట్టుమీఱినట్టి యిట్టులంపువిరాళి ।
పుట్టినట్టు కొట్టకొట్టువెట్టి ।
గట్టునట్టు దిట్టఁజెట్టవట్టుటకట్టు ।
గట్టిపట్టుపట్టిగట్టుపట్టి ॥

క॥ తపమొనరింపఁదొడఁగెనా ।
తపమనకిగమనకవర్ష ధారలనకయూ ।
తపనీయగా త్రిసముపా ।
త్రపనాయితని యమయగుచు ద్రష్టలువొగడన్ ॥

చ॥ పనివడియట్లుదారుణతపంబునకున్ దొరకొన్నగారవుం ।
దనయ తెఱంగుమాతరపితల్ వినివెగ్గలితత్పురీ జనం ।
బునుదమ వెంటరానటకుఁ బోయియటన్ దటి వేచియుండినం ।
దనను తదానమాధ్యుపరతన్ గనియిట్లనిరామెతోడుతన్ ।

శా॥ బిడ్డా యెంతకు సాహసించి తెనినున్ బ్రేమించుచున్ మంచియో।
చెడ్డో నీతలిదండ్రులుంటిమికదా • సేబాసు మాతల్లినీ।
యెడ్డన్ మా కెఱిఁగింపనక్కఱ అయె లేదే యించుకంతైననా।
కడ్డంబెవ్వరటంచు నింతకుఁ దెగన్ న్యాయంబె నీబోఁటికిన్॥

క॥ ఓతనయారత్నమనీ।
చేతస్సుననున్నకోరిక చెప్పిముదలమా।
చేతంబడయక యిటువలె।
స్వాతంత్ర్యమువూన నీకు సముచితమగునే॥

క॥ స్వైరిత నీకుఁదగునె వి।
ద్యారహితవు కావుగద పితారక్షితకా।
మారేయను నీతివ్యా।
హారమునీ వెఱుఁగనిదియటమ్మా వినుమీ॥

ఉ॥ బాళురె మెల్లగాఁజిఱుతబాని సపుంబువుఁబోంష్లువీచువీ।
చోపులగాలికుల్కపడుచుండెడు దోంబులిగొట్టువియ్యెడన్।
వేపథువొందకీయెదురువీచుచునుండిన యోరుగాలికే।
ట్లోపుమవమ్మ నీవు వికచోత్పలనిర్వడదాయతేక్షణా॥

చ॥ ఎడఁగడఁగష్టమాట రయవిందు దృపస్మయమైన మేడలో।
నుడుగక యుస్సురస్సురనుచుండెడు దానవునీ వనారతం।
బడవులనుండు నాటవికులైనను నోరుజఁజాలనట్టియీ।
మిడిమిడియెండలో నొకని మేషము నిల్చెద వెట్లువీటిడీ॥

ఆ॥ అంచమూదితలివమంచుఁ బన్నుండికన్।
వొందకయిటునటునుఁ బొరలుదాన।
వెట్లు వెన్నునాల్తు వేపెట్టితల్లిరో।
నీవు కటికిపాటి నేలమీద॥

సీ॥ కరకశతరములౌ గండశైలములు నిద్దంపుఁగుర్చీలతో తల్లినీకుఁ।
క్రోష్టుకాకోలాది రుతముల్ తతానద్ధసుషిరశబ్దముల తోచూలినీకుఁ।
గాయలాకలములుగడ్డలున్ స్వాదుభోజనపదార్థముల తో తనయనీకు।
వ్యాఘ్రతరక్ష్వాది వనసత్వయూథంబు పృథుపరిచ్ఛదముతో బిడ్డనీకు।
భూరితరసంపదలుగల పుట్టుబోగి।
వయ్యును సకించనవువోలె నడవి నెగ్గ।
తమ్ము నద్దపంబునకుఁజొచ్చి మమ్మునిట్లు।
తగనియలమటపాల్సేయఁదగునె తల్లి॥

సీ॥ బహుమూల్యమణిసుయాభరణముల్ మాని రుద్రాక్షదామంబులు
[దాల్చినావు।
గమగమగమవల్చుకలపముల్ మాని మేనఁళముగా వెలిబూదియలఁది
[నావు।
తగటుహేరవలు లుత్సర్జించి తోలునుగ్గడితముల్ బిగియించికట్టినావు।
నులి వెచ్చపూనీటజలకమాడుటమాని వెంచలోబుడుకలు వెట్టినావు।
ఈకొమరుఁబాయమేమిసంసృతిసుఖములఁ।
గరముదనివొంది కాటికిఁగాళ్లుసాపు।
కొన్నదశమీస్థగృహులునైకొనవలసిన।
ప్రచురవైరాగ్యదశయేమి పట్టినీకు॥

చ॥ జలజదళాక్షియొడ్డయిన జగ్గికి నించుక వేళదప్పినన్।
గిలగిలలాడియోముటికిఁగిన్వడు నెత్తున నేడు మగ్లైమొ।
గ్గలకెనవచ్చుమర్బలవు కష్టతపంబునకుద్యమించితీ।
నెలలకొలంది నుంకులకునీ వెటులోరుతువమ్మ యీపయిన్॥

సీ॥ ఉదరిమాడువుమీఁదనుండునీవడవిలో నుండుటఁజూచి యెట్లోర్తునమ్మ।
మృష్టాన్నము మెసంగునీవాకలముదినుచుండుటజూచియెట్లోర్తునమ్మ।

మృదుతల్పమందుశయించునీవిలఁబండుచుండుటఁజూచియెట్లోర్తుమన్న।
యొండకన్నెఱుఁగని యీవిట్లు గఁదపించుచుండుటఁజూచి యెట్లోర్తు [మన్న।
చెలిమరులలోన నెపుడును మెలఁగుదాన।
నొంటిమయినుంటఁజూచి యెట్లోర్తుమన్న।
దుఃఖవార్ధిలో మునుఁగూలఁద్రోయకీతి।
పమ్మచాలించి లేచిరావమ్మతల్లి॥

తోటకవృత్తం॥ అనిబో మొనరించు నవార్యకులే।
శునిమేనకనుంగని జోతలోన।
ర్చినిలంబడియ వ్విమషిజనముం।
డనమిట్లనిపల్కె నడంకువతోన్॥

సీ॥ ధాతృప్రభృతులకుఁదలమానికంబు లేమహనీయచరితునిమలకడములు
సేవకప్రతతికిఁ జేపట్టుకుంచమే కల్యాణగుణుని క్రేఁగంటిచూపు।
శరణాగతులసాధ్వసములకు వేరు విత్తేతపస్సాధ్యుని చేతిచాపు।
సకలనిరాధారజగతీస్థితికిఁ బోటుగంబమే యనుభావఘనిని దేశ।
మట్టిసర్వాధికుండగుహరుని వరునిఁ।
గాఁగబడయందలంచి యీకరణిఁదీవ్ర।
తపమువకునేను దియగొన్నదానవాన।
దలఁగివినుతున్ వినుడు తల్లిదండ్రులార॥

శా॥ ఉల్లంబిట్లుడికిల్లనేమిటికి మీకోగారవుందండ్రియో।
తల్లీమీరెకదా ననుంగడుఁబ్రమోదంబొప్ప నాహత్తితోల్।
సెల్లాయొల్లియ వేల్పుసేవసలుపన్ సెల్విచ్చియంపించినా।
రుల్లంఘించినదేదిమీముదలనే సూహింపుడీ చక్కఁగన్॥

చ॥ అలరులవింటివానినయనాగ్నికి నాహుతిగానొనర్చియా।
వలమెడవేల్పుచాటువడినన్ సకలాత్మునినామహేశ్వరున్।

గొలుచుటమానివేఁగమదిగొల్వకయీపగిదిన్ దపస్యకున్।
దలకొనియుంటిఁగాని జవదాఁటుమనే యెప్పుడైనమీనుడిన్ ॥

సీ॥ అడవియేసొగసైన హొయివటారమా నొగికియిచ్చు-వసామిఁ గొలుచు
[నాకు।
గాయులాకులెరుచిగలవంటకంబులో విసపుమేఁతరిని సేవించునాకుఁ।
గటికిసేలయె యొడికపుఁ బట్టుతలిమమా మలనెప్పుదొర చింతసలుపు
[నాకు।
మందుపేరెండయే నిండురేయెండయా సెకకన్ పబువును పొసించు
శివునిసర్వాత్ముశాత్మభజించునాకు। [నాకు।
నిచటియగములు ఖగములు మృగములునునె।
తగినపరిబర్హమాఁ దలిదండ్రులార।
నాకొరకుఁబొందకుడుమీరు చూసురేదల ॥

సీ॥ అఖిలయాదోభవాబ్ధికిఁదగు పీలికాఁడున్ననావశంకరుని సేవ।
దుర్గతియాతనాతుహీనసంహతికిఁదిగ్మంబౌతపము శివమంత్రజపము।
కాలునియాటసాగకయుండఁజేయుపెన్గికురింత యీశ్వరాంఘ్రియుగ
[చింత।
తతవాద్యనినదముక్త్రితలోదరీస్వయంవరణము శంభునామస్మరణము।
శ్రితులయిన సనువులవాలిబృహతికాంచ।
లగ్రథితహాటకంబై చెలంగెడుస్మర।
హరుఁగుటిచిచేయునాసముద్యతికినడ్డు।
వాట్లువెట్టకుడయ్యయో పంన్యులార ॥

క॥ ఉప్పరముచొల్లెముగఁగల।
యప్పరమునినాశ్రయించినట్టికృతులకున్ ।

నెప్పరముతోలఁగుఁదప్పక ।
డెప్పరములుతప్పకావటిల్లు భవుకముల్ ॥

చ॥ ఏకసకియమ్మ గాదు మిటియెండలు వర్షములోరుగాలికా ।
ర్మైకములునెవ్వియుం బగలురేలునొకింతయుఁగావునాకుబా ।
ధకములు నానిమిత్తమెదఁదల్లడమందకుడయ్య మీరుమి ।
న్నికదొరయంజదోయిదరిఁజేరినవారికినున్నె యంజికల్ ॥

క॥ కానన్ నాయీనుపకి ।
చ్చోనొడువకుడడ్డముల్ ప్రసూజనయితలా ।
రానతులొనరించెదనా ।
యానమతేమియానుఁబల్కు కరుగుడనవుడున్ ॥

గీ॥ మాటుమాటాడనోడి కొమార్తమదిమ ।
రల్చుట దరంబుగాక నైరాశ్యమంది ।
మేనకాహిమవంతులా మెకడజోటి ।
కత్తియలఁ గొంతనుందినుకర్ణము వెట్టి ॥

సీ॥ విడినవేనలిచక్కముడుచుకోలేనినాపోరియుండునుసుడీపులుఁగులార
తలవాకిలెన్నండుదాఁటియెఱుఁగని మామునుగుదయుండునుసుడీ మృగ
[ములార ।
క్షేత్రమాఁకులననల్పిదుముటకలయునాగోలయుండునుసుడీ కుటము
[లార ।
మ్రావటమెడపిక్రమ్మఱఁగట్టలేని మాబొట్టెయుండునుసుడీచట్టులార ।
మీకునీమెనిల్లడవెట్టి మేమువోవు ।
చున్నవారము దీనిమీకన్నయనుఁగు ।
కొమరితనువోతె లలినామకొనుడుసుండు ।
వనములార బహుప్రాణ్యావనములార ॥

లలితపదవృత్తా॥ అనిపలు వేఁమఱుఁటప్పనముల్ తా।
మొనరిచి మేనకయున్ హిమవంతుం।
డునుఁగనునీరునఁ డుంగులువాఱన్।
బనవుచు నేగిరి పొరుఁగుఁ దోఁచున్॥

మ॥ అయయున్ దల్లియుఁ జన్న వెనుకనలయార్యాదేవి బాహ్యాంతరిం।
ద్రియసంచారములాఁక వెట్టిపొరిదిన్ శ్రీకంఠుఁ డుందాశ్రితా।
భయవిశ్రాణనునందుఁ జిత్తములయింపం జేసివాచంయమా।
గ్రియులున్ దీలుపడన్ మహాతపమొనర్చెన్ వర్జితాహారయై॥

వ॥ ఆసమయంబున॥

సీ॥ వృజినంబులని విసర్జించెనోయన వెండ్రుకలు లేనితల గడగడవడంక।
నొచ్చిపుచ్చురలుబోక నోటితో నేమేని బలికిన పైపల్లుఁ దుంపరలురాల।
వేపథుప్రభవదోర్వేగ్రగింఖణమున నడతేప తేపకుఁ దడబడంగ।
పెరిఁగిన జవరంపునరపత్తుప్పాడుపంటపైర్వలె గాలికిఁ బాత్రలాడ।
నుడువు లేమేమొ లోననె గొణిగికొనుచు।
భ్రూయుగముమీఁదఁ గేలిడి ముందు దెసకుఁ।
గనుఁగొనుచరగడపుజన్నిగట్టువేస।
మూనిచని శూలి పార్వతియొద్ద నిలిచె॥

సీ॥ ఆహా ల్తియపుడె లోఁచూపుచాలించినదాట చేఁ బ్రణమిల్లెనతనికతఁడు।
శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తనుచు దీవించి యట్లనుటకు వెల్లబాటు।
గదిరినట్లు నటించి కాంతరోముక్రిమిచే మతిలేనివాడనౌకతనఁ జేసి।
యూఢవో లేక యనూఢవో యరయకే చేసితినిట్టి యాశీర్వచనము।
ఉవిద యింతకుమున్నె నీవొకరుఁ రుపుఁడు।
కేలువట్టికొనిన మగనాలవేని।
చిత్తవైకల్యమున విచేదింపకనిన।
నానుడికిఁ దప్పువట్టుకొనకుముసుమ్ము॥

శా॥ ఆవ్వా యెవ్వరిబిడ్డవీవు భవదీయంబాహ్వయంబేమియీ।
పువ్వున్ మించిన దేహమార్దవము సంబొల్వారు నీవ్వాళ్లకున్।
దవ్వౌనిం మఱఁదపించుచున్ నవతజెందంగారణంబేమివా।
క్రొవ్వంగూడునయేని నిక్కవము నాకుం దెల్పుమీ యంతయున్॥

ఉ॥ నావిని యాతుషారగిరినందన వందనమాచరించియో।
పావన సాధువృత్త ననుఁబార్వతియందురు లోకులెల్లనే।
నావసుధాధరాధిపతియౌ హిమవంతునకున్ గొమారితన్।
భావజహంతఁగూర్చి తపంబొనరించుచునుంటి నిట్లుగన్॥

గీ॥ మేదినీసురసత్తమ మిమ్ముఁబోంటి।
బోధఘనులాడునుడులేల పొల్లవోవు।
నేననాథను కావు తే నిక్కవంబు।
కాను పరిణీత నెవఁడలంకినుడనవుడు॥

శా॥ పోనీ లేచిన వేళమంచిదియె నాపున్నెంబు బాగున్నదో।
చానా యిట్లు తపంబు పూనుటకు బీజంబీవె వాక్రువ్వ తే।
దోనాథామెడ్యమునన్ వినంబడనె లేదో కాని జ్ఞాతంబుగా।
దోనారీజనమాళిభూషణమనస్పష్టోక్తంబుగాఁ దెల్పుమీ॥

గీ॥ అనుచు ముందుకు రెండుమూడడుగులుంచి।
యాబవంతపుముసలి యగజఁదఁటొసి।
యోరమొగమిడి చెవియొగ్గియుండఁజెప్ప।
సిగ్గువడి యాళివంక వీక్షించె నాపె॥

క॥ అగ్గిరిసుత ఛందమెఱిఁగి।
డగ్గరగానరిగి యాబిడ చెలియొకతెయా।
వగ్గుముసకబాపనునకు।
నగ్గరగా నిట్లని తెలిపెఁ దదాశ్వమునన్॥

స్రగ్విణీ? 

ద్రుతవిలంబితవృత్తం॥ అవనిదేవకులాగ్రణి యాతఁడే ।
ధవుఁడుగావలెఁదప్పకటంచునా ।
శివునిఁగూర్చియె చేయుచునున్నదీ ।
పవిదినీ మెతపంబొకపూనిక తోనో ॥

సీ॥ అనవినీతలయూచియాపొలంతినిగోరచూపునఁజూచి యాబాపనుండు।
పందితిల్లెడునావుపడ్డమబ్బయువోలె నెంతచక్కగనున్న దేశ్వదాస్య ।
మెల్లిదమైతి నేమేనునాబోఁటిజ్యోయస్తరుతో నీకుఁద్రస్తరులకె।
యని వైశికపుటలక్కనభినయింపుచునక్కవాడపుఁబొలుండు వలుకు
నగజ కేల్మోడ్చి దేవయీ యనుయనృతము । [టయును॥
వలుకలేమ యథార్థమె పలికినదిక్షు ।
మింపుడన నక్కపటదశమీస్థధరణి।
సురుఁడు పకపకనగిగట్టుచూలికనియె ॥

ఉ॥ ఆహావుసేమియయ్యోడలవెంతటఁ దాల్చెనగాలిదిండిజా ।
వాహిరియేమియాముఁరికివాసనతోల్వలు వేమిమున్నమో ।
త్సాహములైన యాపెనుపిసాసి బలంగము లేమియయ్యెన ।
ద్వాహపుటెక్కుడేమి యెటువంటి పతిఁవరియించితే చెలీ ॥

శా॥ అయ్యోయెంతటివెఱ్ఱిదానవబలాయాపాబలే బాపురే ।
యియ్యాలోచన లోనసొంతముగనీకేతోచెనా కానిచో ।
నెయ్యుర్వోలెనటించువైరులెవరేనిన్ నీవుపెన్వంతలన్ ।
బ్రియ్యంజూడగఁగోరియివ్విధమునంశోధించిప్రేరేచిరా ॥

చ॥ ఇచటికిమొన్నవచ్చినపుడిందుకళామకుటుండుగొన్నబూ ।
కచెలువుచూచినిక్కవముగానెనిసర్గఘనోజ్జ్వలించునెం ।
చిచిగురుబోడిరోమరులుజెందియలంమరెదేమొతద్వపూ ।
రుచిరతయాదృశంబొ కలవూపెటిగించెదనాలకింపుమీ ॥

సీ॥ ఈక్షించుటకె చాల యేవంబు దలకొల్పుం గదే యాతని బొల్లి మేను ।
విసము మెక్కినఁ గొంతు వెక్కురు చాయ యా మొయివన్నె కిబ్బడి మెఱుఁగు దెచ్చె ।
నెందుగాదఁపు వెరిట్లకెనే వచ్చు జుంజురుగుడుసు చుట్టల పల్లజడలు నెఱక ।
లెవరికే జగతి లేని వివిరూపంబులై నిగిడారు కనులు మూడెగుడు దిగుడు ।

చాలు చాలు మంచి చక్కనిపతి నేరి ।
కొంటివిందుముఖిరో కోరఁబోయి ।
కోరఁబోయి తెవులు గొంటి దేవరఁ గోరె ।
ననెడు మాటకిదియె యర్థమేమొ॥

మ॥ కలికీ లోకమునన్ గురూపులు పరిష్కారంబులున్ ముందివ ।
ల్వలునున్ దాలిచి కప్పిపుత్తురు వపుర్వైరూప్యమున్ మాయు రే ।
యలముక్కంటి నిజాంగమం జికుకుఁ దోడాకస్మికాలోకనుల్ ।
తలఁకన్ దాలుచుఁ దోళ్లు నెమ్ములును నాతం డెంత మూఢాత్ముఁడో ॥

క॥ వటఫలరదనఘనకం ।
కటికాలోకపోటుముట్టుగాఁ దాల్చినధూ ।
ర్జటికడిమియుఁ గలితనమును ।
దిటవును నిట్టి వని వేఱె తెలుపవలయునే ॥

మ॥ పడఁతీ నీయుపయాను కాలమున నప్పంచాహముల్ నీవును ।
బ్రగుఁడును గూడి జరద్గవంబుపయి నారోహించి యూరేగున ।
ప్పుడు పౌరుల్ మిముఁ జూచి నవ్వుమరు కడ్పుల్ తీపులెత్తన్ బడం ।
పడి యారీఢకు సైపకెంత యనుతాపం బందెదో నీవెదన్ ॥

ఉ॥ ఇస్సిరో నీకుఁ బెట్టునగ లెవ్వియొ సందియమేల తాఁకినన్ ।
బుస్సన లేచు త్రాఁచులువి భూషణముల్ కదయాకపర్దికిన్ ।
లెస్సగ నొంటి నిండఁ దగిలించును వానిన బీతుఁడించిచే ।
తస్సాక హాయి చేసికొని తాల్పవలెన్ జుమి మోడి ధైర్యమున్ ॥

సీ॥ మానోజ్జకమునకు మరులుకొంటివొయన్ననొడలెల్ల శ్వేతమౌదొడవ [కెపుడు।
నైశ్వర్యవంతుఁడౌటా సగొల్వెనొయన్నఁ దెరల తింటకులేక తిరిప మెత్తుఁ।
గడిమి పెక్కువకు మేల్పడితివోయనినవ్ వృకున కోడిపఱచినకోఁచ [యతఁడు।
విద్దెకాఁడౌటనువ్విల్లూరెదవొయన్నఁ బితలుశిక్షించినబిడ్డగాడు।
అధికసౌందర్యవతికినీ కరసిచూడ।
నొకసుగుణమేనియును లేని యొంటిమీఁద।
దెగడికకుమాలుతమిమెకలుగుటనీదు।
నుమటిప్రాతఫలమొయేమొ సదమలాంగి॥

సీ॥ చెలువంబునకు నపేక్షించెదవేని నాసత్యాదులైన నిర్జరులుకలరు।
శౌర్యమాశింతేని సకలవేధోండరక్షణదక్షశక్తి కేశవుఁడు కలడు।
చదువుకోరెదవేని సకలజగత్సర్గకృతముఖుండగు శతధృతికలండు।
కలిమి వాంఛింతేని కల్పాగసురభిచింతామణుల్ గల మహత్వొంతుఁడు [గల।
డిట్టిగొనములకువ్వెలనేకులుండ।
నీదృశులనెల్ల నొల్లక యెబ్బెరాసి।
పిఱికిపేదమెమకఁగోరి పెండ్లియాడి।
యేమిసౌఖ్యమనుభవించెదే మృగాక్షి॥

క॥ మసనము కాఁపురముండుని।
వసనముకడవసమునీ దువపువునకులస।
ద్వసనమునగునీయప్పటి।
వెసనము భవదనుభవైకవేద్యముసుమ్మీ॥

చ॥ వలదొకమాటచెప్పెదను వారకయీకొని సౌఖ్యమందుమో।
నెఱఁత కపాలభృత్పరిణి నీపత్యజింపుము శ్రీయుఁజెల్వునన్।

చెలివియు శౌర్యమున్ గలపతిన్ సమకూరుతు మెప్పుకీరుతుల్ ।
వెలయగ వానితో ననుభవింపుమ శేషసుఖోపభోగముల్ ॥

గీ॥ బద్ధుగాదుసుమీ నాదుపలుకు స్వామి ।
సాక్షియనుటయునా కాదుజన్నిగట్టు ।
నార్యహారిచూపునన్ జూచియనియె ముకుర ।
చెరమలుకపోలములు నల్క చేతనదర ॥

శా॥ ఏమేమీ వెఱఁగయ్యెడున్ వయసునన్ వృద్ధుండవై యుంటనీ ।
వేమోయొక్క పవిత్రవర్తనుఁడవంచే నెంచితిన్ ధాత్రుపా ।
లోమీనాధజనార్దనామలగు వేల్పుల్ నీవలెన్ ధీనిధుల్ ।
గామింజేసిసుమీ సదాకొలుతురక్కందర్పదర్పాపహర్ ॥

గీ॥ వీఱేఁడీ పెద్దనిమరకు వేశ్యయగుట ।
నొదవుచుండినకునికిపాట్లోయనంగ ।
దలవడం కెడు వార్ధకదశకతమున ।
బైజనినుఁబాయదయ్యె నిప్పటికయినను ॥

క॥ నీతరమా నాతరమా ।
ధాతరమాపతియునున్ మొదలుగా దివిజ ।
వ్రాతములు దెలియనేరని ।
భూతేశునిదివ్యమహిమము నెఱుంగుటకున్ ॥

చ॥ శివుఁడవలక్షుణుండనివచింపఁదెగించితి నీకువచ్చినేం ।
ద్దైవనికివచ్చె నిస్సిరొమహీసురవంశమహాకళంకనీ ।
ద్మువదనముంగనుంగొనిన దోసములన్నియుఁ జుట్టుముట్టునిం ।
క నెడలిపోకె వేనియునుఁగాఱులు ప్రేలిన నీడిపించెదన్ ॥ [మీఁద ।

స॥ శ్రీకంఠుఁడింది విచ్చేసియున్నప్పుడే యసమాస్త్రుఁడరుదెంచి యతని
గవియుమ శివుఁడు ముక్కన్నువిచ్చె నథోక్షజాదులు తెఱగంటులది
[యొఱింగి ।

స్వాగ్రహింపక ప్రోవుమయ్య మహాప్రభో యని చాల వేడుకొనినను
[వినక ।
మఱియుంచె మరుని నామాధవాములు చేయునది లేక విమనస్కులై యరిగి
శివుఁడు సర్వాధికుండని చెప్పుటకును । [రపుడు ।
ఏమి గావలయుఁ బ్రమాణమేను కన్న ।
లారఁజూచిన యీవిషయంబుకంటె ।
నోవసరుపోతపుడమి జేజేవెడంగ ॥ [తయనియుఁ ।
సీ॥ వృకదైత్యుఁ డెగువంగ వెఱఁబాఱెననియును వృషభమాతని కెక్కిరిం
బునుకలుఁదోళ్ళు నెప్పుడుఁదాల్చుననియును విగ్రహంబంతయు శ్వేత
[మనియు ।
రవణముల్ పెనుబోరు బ్రాఁకుడులనియు నానాసదేశము పితృవనమ
[నియునుఁ ।
గేలఖట్వాంగంబు దాలిచెననియునుఁ గవణంబునకుజో లెఁగట్టెననియు
యతిపరార్ధ్యమనోపచాయితపదాబ్జుఁ ।
గేవలుఁద్రినేత్రుఁ జాల సెగ్గించినావు ।
కారణంబులు వానికిఁ గలవు వానిఁ ।
దెలియ వినిపింతు వినుమని పలుకుటయును ॥
మ॥ చమవుల్ నేర్చితి వేమొ హేతువులు పేక్షుంగొన్ని కల్పించి చె ।
ప్పెదు కాఁబోలును విన్నయస్లై కడుసంప్రీతుండవై నాఁడనా ।
మదనారాతి త్రిశుద్ధిగా సుగుణసంపన్నుండు కాఁడేల చె ।
ప్పెదవా వెంబరవిత్తునే నెఱుఁగనే పృథ్వీధరేంద్రాత్మజా ॥
చ॥ సమజగతీమృగీదృగతిశాయి మనోజ్ఞతనైననీకువో ।
కొమిరెరో యేమపుందొడవఁ గ్రొన్నెలతాల్పును జెట్టపట్టుటో ।
చ్చెమనుచు నీదుబాగున కె చెప్పిననానుడి కల్గిలేవుపు ।
ణ్యమునకుఁ బోవఁ బాపమెతుతైనటియన్న తెఱంగి దేసుతు ॥

చ॥ తివిరి వచించెదన్ వినుము తీవ్రతరజ్వరితాపయావికిన్ ।
జవిగొనఁబంచదారయు రసజ్ఞకుఁ జేఁదయి తోఁచు క్రొవ్వడిన్ ।
జెవులకు మద్గతోక్తులు రుచించునె నీకు నదృష్టహీనకున్ ।
బవిసి ప్రసవ్యమైనపుడు పంకరుహాయతపత్రలోచనా ॥

గీ॥ పుట్టినింటననుభవించు ముద్దులెల్లఁ ।
బోయియెద్దురావుతునొద్ద ముద్దులనుభ ।
వించునపుడు నానుడులు తలంచుకొందు ।
కానిలే పోయివచ్చెదఁగంబుకంఠి ॥

మంజుభాషిణీవృత్తం॥ అనియిట్లుపలికి కుహనావనీసుధా ।
శనుఁడాతుషారగిరిసార్వభౌమునం ।
దనదుపై వీడ్కొని శనైర్గమంబునన్ ।
జనె నామెమానసము స్వాస్థ్యమందగన్ ॥

సీ॥ ముంగాళ్ళు రెండును మోవజీరులువాలుకొమరు నీరాకవిపీనముల [తోడఁ ।
దేజునమడికాసుతీవలఁబురుణించుతిన పోచయొంటిజందియముతోడఁ ।
పౌర్ణమాసీందుబింబముద్రిసంతులుకొట్టు మోహానంబగునవ్వు మోము [తోడ ।
నంసదేశంబు పర్యంతంబు వ్రేలుచు నిగనిగలాడునూనె ముడితోడ ।
నభినవతారుణ్య శుభసూచకంబులౌ చకచని నూగుమీసములతోడ ।
నాలుడికత్తెల నవకీర్ణనులఁ జేయఁజాలిన యరిదివర్చస్సుతోడఁ ।
జిత్రతరజగన్నాటకసూత్రధారుఁ ।
డాతుపాకరకోటీరుఁడంతలోన ।
మిగులఁబన్నని ప్రాయపుమెణకరియయి ।
వెండియుంగొండరాచూలిసండకరిగె ॥

ఉ॥ ఇంచుకదవ్వునన్ మహీధరేంద్రసుతాసఖులావటూత్తమున్ ।
గాంచి వెఱంగుపాటొదవనానుమఁగన్గొని వేఁడికంటిచే ।

బాంచశరుండు సచ్చెననిపలికి తివెవ్వనిఁజూచియాతఁడం।
చెంచితో యామరుండిచటికేఁలుకోవచ్చెడుఁ జూడుమీయనన్ ॥

క॥ సకియలనుడువులువినిచూ।
డికి యాపురుషుదెసకు నిపుడిచి యాతఁడెవం।
డోకో యశ్రుతచరమానో।
జ్ఞకుఁడనిటిచ్చ్పడిచూచి సకులకునని యెన్ ॥ [నకుఁ।

సీ॥ ఖద్యోతమునకు భాస్కరమండలమునకుఁ బల్వలంబున కకూపారము
గంటినలుసునకు గ్రావోత్తమమునకు గుసగుసకశని నిర్ఘోషమునకు।
గాజు జాతికినొడికపుమూలజాతికినుస్నాహమునకుఁబీయూషమునకు
జిరకుటీరమునకుదొరవటారమునకునలుకుపాంతకుఁబట్టువలిపమునకు।
నెంతవాసికలదొ యంతకంటెనుఁగూడఁ।
దారతమ్యమధికతరముకలదు।
సుందు తలిరువింటిజోదునకీవచ్చు।
పురుషునకును మేనిపోలుపునందు ॥

గీ॥ అనినుడువుచున్నయంతలో నాఛలద్వి।
జుండు నేదిష్ఠుఁడగుటయుఁ జూడిక్కమలపి।
మిన్నకున్న నతండన్నమిన్నఁదలిసి।
నిలిచె వనమంతయును వింతచెలువుదనుక।

క॥ ఇద్దఱును సమవయోయువ।
లిద్దఱునతులసుషమామహితవిగ్రహాలీ।
యిద్దఱు మిథోనురూపుల।
యొద్దికచూపఱకు లోచనోత్సవముగదా ॥

చ॥ విమషిమె యయ్యానియ్యెడలవేఁటిఁడిమె మనయార్యవెట్టిప
ట్టుదలయొకండువ్వాని శివుఁడోశివుఁడోయనుచుండెఁగానిచ।
కరదనపుఁగుప్ప నీవటుశిఖామణిఁబెండిలియాడి వీనితో।
వివితతరంబుగా ననుభవింపగరాదె సమస్తసౌఖ్యముల్ ॥

క॥ ఇతనికినని దంపూర్వా ।
ద్భుతసౌందర్యనకు నెనసభూతోనభవి ।
ష్యతియనుచు మెచ్చుకొనుపా ।
ర్యతిచెలులకు నాబిగాదివడుగభిముఖుఁడై ॥

క॥ రౌగ్మ్యంతయుఁ జనుఁగవయుమొ ।
గమ్యాతయుఁగనుఁగవయునుఁగా నలరెడునీ ।
కొమ్మయెవతె పితలెవ్వా ।
రిమ్మాడికి నిచటనుండు టేమి యనవుడున్ ॥

చ॥ వటుజనమండనంబ హిమవంతునకీయమ కూర్మిపట్టియీ ।
తటిదుపమేయగాత్రి యభిధానము పార్వతియాకసంపుఁగూఁ ।
కటియెకిమీనివల్లభునిఁగాఁబడయన్ గడుపూనిఁ మైతపం ।
బిటులొనరించుచున్నయది యీయమయంచెఱిఁగించిరాచెలుల్ ॥

క॥ ఆమాటకుఁ గిఁకికనగి ।
బూమెవడుగు గిరిజదికుఁ మొగమైయపుడా ।
హైమవతిఁజూచియిట్లనెఁ ।
బ్రామిడితనమామెమదికెఁ బాదుకొనంగన్ ॥

శా॥ శ్రోనానిప్పుడు జ్ఞప్తివచ్చినది నీహారాద్రిరాట్పుత్రియీ ।
శానుంగూర్చి తపించుచున్నయది తజ్జాయాత్వముంగోరియం ।
చేనాలించితి నాల్గుప్రొద్దులకుము న్నెవ్వారొ వాక్రువ్వనీ ।
వేన్తాయాహిమవత్తనూభవవు రాకేందూపమానాననా ॥

క॥ ఆయెమొగుడుదిగుడుకన్నులా ।
యాంయేవఁపుబొల్లిమేనొ యాచిఁపిరిజు ।
ట్లోయింతవలపునకుఁగత ।
మేయదియో తెలియఁజెప్పుమీ హైమవతీ ॥

చ॥ చిలువలనెల్ల మేనఁగయిసేయుట గన్గొనివల్చినావొయ ।
స్థూలసరులెచ్చుగాఁగలుగు తుందమునందముజూచికోరితో ।
కళవసముల్ ధరించితిరుగన్ దిలకించివిర్రాల్కిఁజెందితో ।
మెలఁతరో యేమిమేలునకు మెచ్చివరించితివృక్షవాహనున్ ॥

క॥ ఓవిష మేక్షణఫాలద్రు ।
గావిర్భూతదమునః పరాసుమనోభూః ।
జీవాతుమూర్తి నినునే ।
నీవరకును నెపుడుఁజూచియెఱుఁగనికతనన్ ॥

చ॥ కటిమెడ వేల్పువల్లభుఁడు కావుటకున్ వడిఁగోరియాతనిన్ ।
గుఱిచితపించుచున్నయది క్షోణిభృదాత్మజయంచువిన్నయ ।
త్రఱినితరాంకురూపు నెలతాల్పును బెండిలియాడఁగోరున ।
త్రైజవయువానికిన్ దగినదేయయియుంఘునటంచు నెంచితిన్ ॥

ఉ॥ చేఁతలమేనులన్ నుషలఁజిత్తములన్ దలిరాకుబోండ్లపై ।
రోఁతలుగొన్నదిర్భరనిరుద్ధహృషీకులనైనఁదాల్మిపెన్ ।
బాఁతుపెకల్చి చిత్తభవబాధలపాలొనరింపఁజాలునో ।
పోఁతపసిండిబొమ్మరో యపూర్వమునీసొగసించుబోండ్లలోన్ ॥

గీ॥ దొండపండక త్రైయొసంగఁబడుటజూచి ।
జనులుపోల్తురు కాకిముక్కునకు దొండ ।
పండుగట్టినట్లని యయ్యుపమయుఁజాల ।
దావృషాకపికీవాలవౌదు వేని ॥

ఆ॥ వేలుమడఁచి లెక్కవెట్టిచూతమటన్న ।
నొక్కసుగుణమేనియును దొరకని ।
యాపిసాసిరాయఁడానీకుమగఁడౌట ।
చాలుచాలునెంతజేలుపడితె ॥

ఉ॥ కద్దు పుడంచు నెంచకుము కాంతలవిశ్వసనీయులౌటచే।
నుద్వహనోద్యమంబునకు నొల్లని వాఁడ నెయయ్య నీవు భూ।
భృద్వరకన్యశాంతనుఁ బెండ్లియొనర్చుటకియ్యకొంచు ధీ।
మద్వరవర్ణినీతిలకమా యనుమానము మాని తెల్పుమీ॥

ఉత్సాహ॥ పదురు మెచ్చ నన్నుఁ జెట్టవట్టె దేని మోదముల్।
గమరమునలతగినయమ్మాల్మగల్తనమునకింపుజెం।
దెదరు సర్వలోకగృహస్థులు, నేను కాదు చెప్పుటో।
సుదతినీకు చెల్లుబనడిగిచూడు మేకతంబునన్॥

చ॥ గెడవిడి వేయియేండ్లు తలక్రిందుగ నీవు తపస్సు చేసియున్।
బడయవు మాదృశుండయిన భర్తను నిక్కము కాన సంశయం।
బుడిగి నన్ను వరింపుము పయోజదళేక్షణ యంచుఁ గేల్మొగన్।
గడఁగిన నద్రికన్యతొలఁగన్ జనినిల్చియనెన్ గ్రుధోగ్రయై॥

ఉ॥ వేలుపులబ్జయోనియుఁ ద్రివిష్టపనాథుఁడు నేనుహొత్రసం।
బాళిగ లెప్పుడున్ దలలపై మణిభూషల చెంత బెట్టిమేఁ।
దాలుతురాదిదైవతమతండహహా కొఱగానివాఁడుగా।
నేలిదమయ్యెనో వటునిహీనుఁడనీకుపలబ్ధి లేమిచేన్॥

శా॥ వేదంబుల్ నిఖిలాగమప్రతతియున్ వేధస్తురాషాణ్ముకుం।
దాతుల్ నిక్కము గాంగలేని శివుచూడాత్యోన్నతిన్ దెల్పియుం।
బేతల్ త్వాదృశులెల్లయుంగఁగలరో పృధ్వీనిలింపాధమా।
నీదౌర్తిన్ జనకీలకమున్ వధరైదేనిన్ సాగఁదోలింపెదన్॥

సీ॥ ఝుత్తృష్ణలనడంచు సుధఁద్రాపు తెలుఁగంటి మడఁతిసాంధిని చూడ మా [నసంబు।
ద్వీపమాంసము మెసంగుబెడవామకుఁ బొంటెశభక్ష్యిం గోరునే పం [క్తిరుచి।

తలఁపుకేళామాళిఁదమ్మితూండ్లుగ్రసించువరటయుండుటకాసపడునె [పడియ।
నింగినాఁగియవాననీరానుస్తోకకి క్రోలఁగాంక్షించునే రొచ్చునీరు।
అప్రమేయమహిముఁడగు శంకరుఁప్రపర్యు।
తాంఘ్రినళినయుగళమంమనిర్వి।
కల్పలగ్నహృదయగానొప్పునేనుకో।
రుమనెనిమ్నుఁబోఁటి మెమకనొరుని॥

చ॥ ఖరనఖరాగ్రనిర్దళితగంధముదావళకుంభనిస్పుర।
త్తరసరసగ్రసిష్ణువయి తద్దయు విశ్రుతిఁగాంచినట్టికే।
సరిపముఁగాకశింహి మృతజంతుకళేబరమాంసజగ్ధిత।
స్పరమగు ఫేరవంబుపయిఁదర్షముఁపూనునె యెన్నఁడేనియున్॥

చ॥ ఉపయమలిప్సనాయెడ నహ్హాప్రభవించెనకాదె నీకునా।
నపడితొలంగిపోక నిమునంబిఁకనిచ్చటనుంటి వేనినీ।
యుపయమలిప్సదీర్చుటకు నొప్పరికింపనతప్పకంచుగ।
ట్టుపబువుపట్టిమండిపకుఁడున్ వినియాతఁడలంతినవ్వుతోన్॥

సీ॥ చదువరిఁగానని సంశయించెదవేమొ సర్వజ్ఞుఁడందురు జనులునన్ను।
ధనికుఁడనేనుగానని యెంచెదేమొనాయుదవసితంబురూప్యపలమయ
మింతినాచెల్వమీవీక్షించదితివకదా జితమారుఁడనని యెంచెదరుప్రజలు।
శౌర్యంబులేదనిసందేహపడుదేమొశక్తిమంతుఁడనేనె జగములందు।
బాగుబాగునాకంటెఁ గవర్ధియందు।
నేమియధికతకలదని యెంచియతని।
నంతగాఁబొగడుచునన్ను నింతదెగడు।
చున్నదానవె యుస్మలితోత్పలాక్షి॥

క॥ ననుఁబెండ్లియాడుటకు నీ।
కొననంటీమాటను అవశ్యమునుమ్మీ శీ।
తనగేంద్రతనయనీమన।
మునజ్ఞాపకమ్ముంచికొనుము పోయెదననుచున్ ॥

క॥ సుజనస్తుతయాయమయ।
కరజమును సిబ్బితియుఁజెంది కనుఁగొనుచుండన్।
ద్విజరాజమౌళితోఁచెన్।
నిజరూపముతో హిమావనీధరసుతకున్ ॥

ఉ॥ ప్రాఁచులుసొమ్ములిట్లురముతత్తడికృత్తి యథోంశుకంబునై।
తోఁచినచిత్రచిత్రచరితుం బరమేశ్వరుఁగాంచి నానయున్।
గోఁచతనంబునున్ గమరఁ గొండలరాయనికూతుఁ రాసతుల్
పూఁచియొనర్చెఁ గేల్మొగిచి భూతలపాలితదేవయష్టియై ॥

క॥ ఇటకుఁబతితనాలంబిం।
చుటకేయరుగుదెంచినాఁడజోటియనుచుసం।
దిటఁబట్టిలేవఁదీసెన్।
నిటలేక్షణుఁడాపెయొడలు నిట్టవొడువగన్ ॥

శా॥ వానప్రస్థులు కణ్వగాధిసుతమర్త్యాపోవశిష్ఠాత్ర్యుఖా।
భూనాకౌకశ్యవకశ్యపాదులునిలింపుల్ నిర్జరేంద్రాహిభు।
గ్నానాంభోరుహసంభవాదులునెటుంగన్ లేరనన్ మూర్ఖనే।
నానీమాయఁగనుంగొనంగలుగుదానన్ సర్వలోకేశ్వరా॥

క॥ తెలియక కాఱులుపలికి।
నలుగకనాయెడ ననుగ్రహముపూనవెయో।
బలరిపుధాతృశ్రీవ।
త్సలాంచనాది వరివస్యితపదాంభోజా ॥

మ॥ అని వ్రీడావనతాస్యయై పలుకు నార్యం జూచి యోగీంద్రుఁ డి
ట్లను గ్రామణి యొద్ద కర్థిజనులన్ బంపించి చెప్పించి యా
తని నీ కొల్పి పరిగ్రహింతు నిను నుద్యత్ప్రౌఢిఁ జేకొంటిమో
వనితా యం చొకమా టనియె హిమవద్వాస్తవ్యుఁ డై గౌరితోన్ ॥

* చంద్రకళావృత్తం *

సానుమద్వరపుత్రియు నట్లా సంశ్రిత వాంఛితదాయకుం
డైన చంద్రకిరీటుని చే సంప్రాప్తమనోరథయై చనెన్ ।
దానకంబున కాళులతో నంతన్ శ్రుతతచ్ఛుభవార్తులై ।
మేనకాహిమవంతులు నాత్మన్ మిక్కిలి మోదిలి రత్తఱిన్ ॥

* క్రౌంచపదవృత్తం *

శ్యామశిరోధీ కామవిరోధీ యమిసుతవిశసనయమురహరోధీ ।
సామజఘాతీ భూమవిభూతీ సముపచరితపదజనశివతాతీ ।
జామియుతాంగా భూమిశతాంగా సకలజగదధిపజలనిధిషంగా ।
ధీమదుపాస్యా వ్యోమకకేశ్యా దివిజనుతచరితస్థిరలసదాస్యా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందు త్తరభాగమున
చతుర్థాశ్వాసము

